The one and only Magazine devoted to Humour & Music

పేజీలు : 68 + 8

వెల : రూ. 10

16 - 31 జులై 2002

# హాసం

హాస్య-సంగీత పత్రిక









జులై 19
రాజేంద్రప్రసాద్
పుట్టిన రోజు
సందర్భంగా
హాస్య ప్రియులందరి
తరపున
శుభాకాంక్షలతో...



హాసం



హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

Also available on net - www.haasam.com

## హాస్యం - సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'ఇంద్ర'
'జయం'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో







అనుబంధంగా సి.నారాయణరెడ్డి, రఫీ, గీతాదత్, చిత్రపాటలు...70,55,58,59 పేజీలలో

ముఖచిత్రం:'ఇంద్ర' సినిమాలో చిరంజీవి




"నేను మీ పత్రిక ఇటీవలనే చూసాను. నాకు చాలా బాగా నచ్చినది. మీ "హాసం" చూసిన తరువాత నాకు 'జోక్స్ క్లబ్' పెట్టాలని ఆలోచన వచ్చినది. అది పెట్టాను. మీకు నా అభినందనలు మరియు కృతజ్ఞతలు. చాలా సంవత్సరాల తరువాత మంచి పుస్తకాన్ని పాఠకులకు, హాస్య సంగీత ప్రియులకు అందజేసారు.

-జి.ఎన్.రావు, అమలాపురం

మాసములో రెండుసార్లు మీ 'హాసం' వలన ఉదయం సమయానికి లేవలేక డ్యూటీకి ఆలస్యంగా వెళ్లి మా ఆఫీసరు ముందు లాస్యం చేయాల్సి వస్తున్నది. అవి 6 మరియు 21వ తేదీలు. ఆ ముందు తేదీల్లోనే మీ సంచిక పోస్టులో నా హస్తమునందు అలంకరించేది. రాత్రి భోంచేసి తొమ్మిదన్నరకు మొదలు పెడితే, అన్ని శీర్షికలు చదివి, అన్ని పాటలు పాడుకుని నిద్దురోయే సరికి రెండున్నరో అయి తొలి కాకి అరుస్తుంది. ( ఈ చుట్టుప్రక్కల కోళ్ళు లేవు) వీటికి నివారోణ పాయాలు.

1. పత్రిక పేజీలు పెంచి మరో మూడు గంటలు నన్ను జాగరణ చేయించడం. పడుకునేది లేదు కాబట్టి లేచే ప్రసక్తిలేదు.

2. మరుసటి రోజు రాత్రుళ్ళు కూడా చదువుకునేలా కొన్ని, అంతగా ప్రాధాన్యతలేని శీర్షికలు ప్రచురించడం. నిర్ణయం మీదే - ఆచరణ మీదే

హాస్యాభివందనములతో

-ఎం.మస్తాన్‌రెడ్డి, పూణె -25

16-30 జూన్ సంచికలో శ్రీమతి వాలి హిరణ్మయీదేవి గారి రచన 'చచ్చేదాకా చచ్చే చావే' చదివిన తర్వాత ఈ ఉత్తరం సమకాలీన సమాజంలో మానవుడు ఎదుర్కొనే ఎన్నో సమస్యలను (పవర్‌కట్) రచయిత్రి తనదైన హాస్యధోరణిలో చమత్కారంగా విమర్శించారు. ఈ కథ ఆద్యంతమూ ఎంతో నవ్వించడమే కాకుండా, ఇంటా బయటా మెషీన్లకన్నా శ్రమిస్తూ అవస్థపడుతున్న ఇల్లాలు / ఉద్యోగిని అయిన స్త్రీ జీవిత విధానం గురించీ, ఇండైరెక్ట్‌గా ఫ్యామిలీ కోసం ఆమె చేస్తున్న 'త్యాగం' గురించీ వివరించింది. హిరణ్మయి గారి కలం నుంచి ఇలాంటి రచనలు ఎన్నో ఎన్నో ఇంకా రావాలి. రచయిత్రికి, హాసానికి థాంక్స్, థాంక్స్, థాంక్స్.

-వై.ఎస్.నాగమణి, సికింద్రాబాదు

జూన్ 16-30 సంచిక చదివాను. కె.వి.మహదేవన్‌తో తనకున్న అనుబంధాన్ని చాలా చక్కగా వ్యక్తపరిచారు యువచిత్ర మురారి గారు. నిజంగా చాలా అరుదైన విషయం - ఒకో మ్యూజిక్ డైరెక్టర్‌ను తన సినిమాలన్నింటికీ మార్చకుండా వినియోగించుకోవడం. ఇది మురారి గారి ఉత్తమాభిరుచికి నిదర్శనం - ఎక్కడో చదివిన జ్ఞాపకం - "మహదేవన్ మనసెరిగి మ్రోగిన మహతి వుహళేంది'' అని అలాంటి వుహళేందికి శంకరాభరణం విజయోత్సవ యాత్రలో జరిగిన చేదు అనుభవం ఆశ్చర్యాన్ని కల్గించింది. ఈ విషయాల్ని చాలా నిర్మొహమాటంగా రాసి మురారి ఆ వ్యాసంలో ఆర్తి కురిపించారు. ఆదుర్తి, ఆత్రేయ, మహదేవన్, ఘంటసాల, సావిత్రి వీరంతా కారణజన్ములు.

-జి.ఎస్.జి.రావు, చెన్నై

జులై 1-15 'హాసం' సంచికలో వచ్చిన వివిధ సంగీత దర్శకులు గురించి చక్కగా పాఠకులకి వివరించారు. ఆపాతమధురం 'మిస్సమ్మ'ని హృదయాలకి హత్తుకునేలా వ్రాసారు. మిస్సమ్మ చిత్రంలో ఫోటోలను పాటలకు తగినట్లుగా చిత్రీకరించి వేశారు. మంచి పత్రికను పాఠకులకు అందించిన సంపాదకులకు మా కృతజ్ఞతలు. పరుచూరి బ్రదర్స్ గారి నాటిక బాగుంది.

-పి.టి.రాజు, పాచిపెంట

ప్రా'మిస్ - మిస్' కాకుండా 'హాసం'ను సర్వాంగ సుందరంగా అందిస్తున్నారు. మిస్సమ్మ గురించి అన్ని విషయాలు మిస్సవ్వకుండా వ్రాసారు. విజయావారి అందమైన "చందమామ'ను ప్రత్యేకంగా బంధించి అందించారు. "హాసం'ను చదవని వారు (కొని) చాలా మిస్ పొర్చున్నే.

-వి.ఎస్.జగపతిరాజు, విజయవాడ -3

మూడు సంచికలుగా మీ పత్రిక చదువుతున్నాను. సంగీత, సాహితీ ప్రియుడైన నాకు మీ పత్రికెంతో నచ్చింది. కథలు, సీరియల్స్ చదవడం లేదా టి.వి.లో చూడడం అసలు యిష్టపడని విలక్షణ వ్యక్తిత్వం నాది. అవి మనకందించే విజ్ఞానం, ఆనందం కన్నా ఎన్నో విధాలుగా నష్టాన్నే కలుగచేస్తాయని నా ప్రగాఢ విశ్వాసం. అందుకే వాటికి కూడా దూరం. మొన్న ఈ మధ్య హాస్య సంగీత పత్రిక అనే పద సముదాయం నన్నాకర్షించి, కొని చదివాను. ఎంతో విజ్ఞాన దాయకంగాను, సంతృప్తిగాను అనిపించింది. ఇందులో కూడా కథలు చదవక పోయినా, మీరు పొందుపరుస్తున్న గొప్ప విద్వాంసుల జీవితాలు ప్రత్యేకించి పాత పాటలు నన్నెంతో ఆకట్టుకుంటున్నాయి. మంచి పత్రికను మా పాఠకలోకం ముందుకు తెచ్చినందుకు మిమ్ములను అభినందిస్తున్నాను.

-కె.జానకిరామ్, కోడుమూరు

'హాసం' పత్రిక సంగీత, సాహిత్య, హాస్య ప్రియులకు ప్రియమిత్రుడు అనడంలో అతిశయోక్తి లేదు. "ఆపాట (త) మధురం"లో తెలుగు చిత్రాల మధుర గీతాలు, సంగీతం సమకూర్చిన తీరు, రాగఛాయలు తదితర సందర్భోచిత వివరణలు ఆసక్తికరంగా వుంటున్నాయి. అంతేకాకుండా "అర్థం చేసు కుందాం - ఆస్వాదిద్దాం"లో ప్రముఖ హిందీ చిత్రాల మధుర గీతాలను తెలుగులోనికి అనువదించి అందించడమే కాకుండా, హిందీ పదాలకు తెలుగు అర్ధాలను వివరించి మరీ శ్రమ కోర్చి మా కోసం మీరుచేస్తున్న కృషిని అభినం దించకుండా ఉండలేం.

-నీలంరాజు రామ్‌బాబు, అద్దంకి

1-15 జులై 'హాసం' పత్రిక ఎప్పటిలా ఎన్నో వైవిధ్యమైన హాస్య సంగీత శీర్షికలతో మమ్మల్ని ఎంతగానో అలరించింది. సుప్రసిద్ధ సంగీత దర్శకుడైన 'మదన్‌మోహన్' వర్ధంతి సందర్భంగా అందించిన వ్యాసం, పాటలు చాలా బాగా ఉన్నాయి. మదన్‌మోహన్ సంగీతంలో విలక్షణమైన బాణీలు గల పాటలు లభిస్తాయి. అదే విధంగా హిందీ సినీ సంగీతానికి జన్మదాత లాంటి వాడైన 'అనిల్ బిశ్వాస్' 88వ పుట్టినరోజు సందర్భంగా అందించిన వ్యాసం ఆకర్షణీయంగా ఆకట్టుకొంది.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్హాపూర్

హాసం

పాత సంచికలు కావలసిన వారు కాపీకి రూ॥ 10-00 చొప్పున మాకు పంపి పోస్టులో తెప్పించుకొనవచ్చును. లేదా మా ఆఫీసులో నేరుగా గాని, స్థానిక ఈనాడు ఏజెంటు ద్వారా గానీ 10 శాతం డిస్కౌంట్ సౌకర్యంతో పొందవచ్చును.



హాసం

కాపీలు దొరటకం లేదా?

స్థానిక ఈనాడు ఏజెంటును అడగండి.

సంపుటి :1 సంచిక: 20

16- 31 జులై 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక 20

నిత్యజీవితంలో రాగద్వేషాలు, ఆవేశకావేషాలు పెరిగిన కొద్దీ వాటి దుష్ప్రభావాల నుండి తప్పించుకోవ డానికి నవ్వుకునే సందర్భాలకై వెతుకులాట మరింత పెరుగుతోంది. హాస్యం ఏ రూపంలో కనబడినా ఆస్వాదించి చూద్దామనే కుతూహలం పెరుగుతోంది. స్త్రీ, పురుష, వయోభేదం లేకుండా హాస్యం అందరినీ అలరిస్తుందని మనకు తెలుసు. ప్రధానమంత్రి నుండి ప్రాథమిక పాఠశాల విద్యార్థి వరకూ చింతలు మరచి రిలాక్స్ కావడానికి హాస్యాన్ని మించిన టానిక్ లేదని కూడా తెలుసు. మన శారీరక, మానసిక వ్యవస్థకు నవ్వు ఎంత మేలు చేస్తుందో సైకియాట్రిస్టులే కాదు, మామూలు వైద్యులు కూడా శాస్త్రీయంగా నిరూపించారు. తోలుబొమ్మలాటలలో కేతిగాడు, నాటకాలలో విదూషకుడు, సినిమాలలో కమెడియన్ - ఇలా హాస్యాన్ని అందించే సాధనం లేనిదే ఏ ప్రక్రియా జనరంజకం కాని స్థితి నెలకొంది. అంతెందుకు, రాజకీయ వార్తలందించడం ప్రధాన కార్యకలాపంగా గల దినపత్రికలలో కూడా పాకెట్ కార్టూన్ వేయడం తప్పనిసరి వ్యవహారం అయింది.

హాస్యం యెక్క అవసరం ఇంత వున్నా మనకు సరిపడినంత, మనం కోరుకునేంత హాస్యరచనలు ఎందుకు వెలువడటం లేదన్న ప్రశ్న వస్తుంది. దానికి కారణం - హాస్య రచనలు సృష్టించడంలో ఉన్న క్లిష్టత, హాస్యాస్వాదనకు పాఠకులలో ఉన్న స్థాయీభేదం! రసాస్వాదనలో స్థాయీ భేదం అన్ని కళారూపాలలోనూ ప్రతిబింబిస్తుంది. శాస్త్రీయంగా పాడిన ఒక పాట పండితుడిని అలరించినట్టు, పామరుణ్ని అలరించక పోవచ్చు. ఆధునిక చిత్రకళ చదువుకున్నవాడిని ఆకర్షించినట్టు చదువురానివాడిని ఆకర్షించక పోవచ్చు. కానీ హాస్యం విషయంలో ఈ స్థాయీభేదం మరింత కొట్టవచ్చినట్టు కనబడుతుంది.

సంభాషణల్లో చతురత అనేది ప్రాంతం బట్టి కూడా మారుతుంది. నీటి వసతి బాగా ఉన్న ప్రాంతాల్లో తీరిక ఎక్కువగా ఉండి కళలపై, వాక్చాతుర్యంపై ఆసక్తి పెరుగుతుంది. తక్కిన ప్రాంతాల ప్రజలు వక్రత, వ్యంజనం లేకుండా సూటిగా చెప్పడానికి అలవాటు పడతారు. చమత్కృతి ఉన్నచోట హాస్యం పండినట్టు, వేరే చోట పండదు. నర్మగర్భంగా, సూచన ప్రాయంగా చెప్పి నవ్వు పుట్టించటం రసజ్ఞుల మధ్య సాధ్యం కానీ, తక్కిన వారికి సీదాగా, సాదాగా చెప్పవలసినదే. అలాగని చమత్కారికి సీదాగా చెప్పబోతే నోరు చప్పరించి ఆసక్తి కనబరచడు. పదప్రయోగంలో కూడా ఈ ఇబ్బంది వస్తుంది.

జోకు వివరించబూనడం కంటె పెద్ద హింస లేదు. ఈ కష్టాలన్నీ చాలనట్టు, జోకులో తాజాదనం సమస్య ఒకటి ఉంది. నచ్చినపాటను ఎన్నిసార్లయినా వింటాం. కానీ తెలిసిన జోకును రెండవ సారి భరించలేం.

కుటుంబంలో చూడబోతే కుటుంబ పెద్దకు వయస్సు రీత్యా, అనుభవం రీత్యా అనేక జోకులు తెలిసిపోయి, పత్రికలో, సినిమాలో చోటుచేసుకునే సాధారణ జోకులకు తక్కువగా స్పందిస్తాడు. కానీ అవే జోకులు - కొత్తగా వింటాడు కాబట్టి - చిన్న వయసువానికి ఎంతగానో నవ్వు పుట్టిస్తాయి. పన్‌గానీ, పేరడీ గానీ ఆ కుటుంబపు పెద్ద ఎంజాయ్ చేసినంతగా కుర్రవాడు చేయలేడు. ఎందుకంటే పన్ తెలియాలంటే భాష బాగా రావాలి, పేరడీ తెలియాలంటే మూలం గురించి జ్ఞానం ఉండాలి. ఈ విధంగా కుటుంబంలోనే ఇన్ని తేడాలు ఉన్నప్పుడు సమాజంలో వివిధ వర్గాల మధ్య ఎంత వైవిధ్యం ఉంటుందో ఊహించుకోవచ్చు. ఈ తేడాలు ప్రపంచమంతటా ఉన్నవే! గ్రూచోమార్క్స్‌ను అభిమానించే వారూ, లారెల్-హార్డీను అభిమానించే వారూ ఒకరు కానక్కరలేదు.

"హాసం" విషయానికొస్తే 'క్లాసిక్ రీటోల్డ్' అభిమానులూ, 'చౌ చౌ చౌరస్తా' అభిమానులూ ఒకరు కానక్కరలేదు. ఇంతటి వైవిధ్యమైన శీర్షికలు రెండూ "హాసం"లోనే కనబడడానికి కారణం - హాస్యంలో వివిధరకాలైన షేడ్స్ గురించి "హాసం"కు పూర్తి అవగాహన ఉండడం., హాస్యం అనే టానిక్ అందరికీ అందుబాటు చేయాలని "హాసం" అభిలషించడం!



# నగరంలో గరం గరం

-రావు కృష్ణారావు

జంయ్...మని వచ్చేస్తున్నాడు సుబ్బారావు. విజిల్ వేసి ఆగమంటూ సైగచేశాడు పోలీసు కానిస్టేబులు. రోడ్డు కిరువైపులా స్కూటర్లు, మోటారు సైకిళ్ళు పార్కుచేసి ఉన్నాయి. ఒక చోట జనం చాలామంది గుమికూడి ఉన్నారు.

"లైసెన్సు, సీ బుక్కూ అన్నీ ఎస్.ఐ. గారికి చూపించండి" అన్నాడు కానిస్టేబులు.

"ఓరి దేవుడోయ్! ఇదో అరగంట పడుతుంది" అనుకుంటూ స్కూటరు స్టాండు వేసి "సార్... సార్... డా॥ ఏవీరావు గారి అప్పాయింటుమెంటుకి టైమై పోతోంది. అన్నీ ఉన్నాయి. ఒక్కసారి మీరు చూసేయండి ప్లీజ్!" అని బతిమాలాడు సుబ్బారావు.

"అలా కుదరదు. వాళ్ళందరికి పనిలేక అక్కడ నిలుచున్నారా? అయినా ఎస్.ఐ. గారుండగా అని నేను చూడకూడదు. రూల్సొప్పుకోవు. గాడిద పని గాడిదే చేయాలి" అన్నాడు కానిస్టేబులు

జనం గుమికూడి వున్న వైపు పరిగెట్టాడు సుబ్బారావు. ఎస్.ఐ. కనిపించడం లేదు. అభిమన్యుడ్ని తలుచుకొని మధ్యకు దూసుకుపోయాడు.

కనుబొమ్మలు పైకెత్తి కళ్ళెర్ర చేశాడు ఎస్.ఐ.

"సారీ... సర్! మూడు నెల్లక్రితం ఫిక్స్ చేసుకున్న డా॥ ఏ.వీ.రావుగారి అప్పాయింటుమెంటు ఆరు గంటలకుంది. ఈ ఛాన్స్ మిస్సయితే మళ్ళీ మూడు నెల్ల వరకూ దొరకదు. నా లైసెన్సూ అవీ చూసి పంపించేయండి సార్!" చాలా దీనంగా బతిమాలాడు సుబ్బారావు.

"ఏమిటి ప్రాబ్లమ్?" అడిగాడు ఎస్.ఐ.

"కడుపు నొప్పి సార్! మా మిసెస్‌కి!" చెప్పాడు సుబ్బారావు.

"మూడు నెల్ల నుండి తగ్గలేదా? ఎలా భరించిందయ్యా ఆ మహాతల్లి?" చేతులు జోడిస్తూ అన్నాడు ఎస్.ఐ.

"అబ్బే.... అప్పుడే తగ్గిపోయింది సార్!" చెప్పాడు సుబ్బారావు.

"మరెందుకు?" కొంత ఆశ్చర్యబోతూ అడిగాడు ఎస్.ఐ.

"మళ్ళీ వస్తే ఏం చెయ్యాలో... రాకుండా ఏం చెయ్యాలో... అయినా దొరక్కదొరికిన ఏవీ రావుగారప్పాయింటుమెంటెలా వదిలేసుకుంటాం సార్!" అన్నాడు సుబ్బారావు.

"సరే... ఇలా ఇయ్యి.... ఏమిటివి? జిరాక్స్ కాపీలా? రూల్సొప్పుకోవు! ఒరిజనల్సుండాలి" విసుగ్గా అన్నాడు ఎస్.ఐ.

"అవీ ఉన్నాయి సార్!" అంటూ అందించాడు సుబ్బారావు.

"ఒరిజినల్సుంచుకొని కాపీలు చూపిస్తున్నావా? ఏం తమాషాగా ఉందా? లేక ఏదైనా మతలబుందా?" కళ్ళెర్ర చేస్తూ అడిగాడు ఎస్.ఐ.

"లేద్సార్... ఓ సారి బ్రేకిన్సపెక్టరుకు ఒరిజనల్సు చూపిస్తే 'బండ్లో ఒరిజినల్సెందుకు? పాడయితే మళ్ళీ డూప్లికేట్స్ కావాలంటూ మమ్మల్ని చంపడానికా! కాపీలుంచుకో చాలు' అని తిట్టాడు సార్! అందుకని పోలీసుల కోసం ఒరిజినల్స్, బ్రేకిన్సపెక్టర్ కోసం జిరాక్స్ కాపీలు రెండూ ఉంచుతున్నాను. కంగారులో మీకు కాపీలందించాను అంతే" చెప్పాడు సుబ్బారావు.

"కాపీలు చాలన్న వెధవనిలా రమ్మను. బూటుకాలితో తంతాను... సరే! వెళ్ళు" అన్నాడు ఎస్.ఐ.

సుబ్బారావు ఆగమేఘాలమీదింటికి, అక్కడ్నుంచి సరితను తీసుకొని డా॥ ఏ.వీ.రావుగారి క్లినిక్కి పరిగెట్టించాడు స్కూటర్ని.

"సారీ! యువార్ వెరీ లేట్!" అంది రిసెప్షనిస్టు.

"టైముకే వచ్చాం కదా మేడమ్?" అన్నాడు సుబ్బారావు.

"మీ అప్పాయింట్‌మెంటు ఆరుగంటలా ఒక్క నిముషానికి. మీరు తొంభై సెకన్లు ఆలస్యంగా వచ్చారు." చెప్పిందావిడ.

"సారీ! మేడమ్... ఏదోలా చూడండి... ప్లీజ్" బతిమాలాడు సుబ్బారావు.

"వీల్లేదండీ!... రూలు ప్రకారం పది నిముషాలు ముందే మీరిక్కడుండాలి. అయినా ముప్పై సెకండ్ల వరకు ఆలస్యాన్ని పర్మిట్ చేస్తున్నాం. ఆ తర్వాత మా చేతుల్లో లేదు. రూల్సొపుకోవు. నెక్స్ట్‌టైమ్ అప్పాయింట్‌మెంటు ఆరునెల్ల తర్వాతుంది ఇవ్వమంటారా?" అడిగింది రిసెప్షనిస్టు.

"వద్దులెండి" అనేసింది సరిత.

హాలంతా ఖాళీగా ఉండటం గమనించిన సుబ్బారావు "పేషెంట్లెవరూ లేరు కదా! లోపలున్న వాళ్ళు వచ్చింతర్వాతైనా పంపండి ప్లీజ్!" బతిమాలుతున్నట్టు అన్నాడు సుబ్బారావు.

"లోపలెవరూ లేరు.

మీరే ఆఖరిపేషంటీ రోజుకి. డాక్టరుగారు కూడా స్టెత్ గిల్లుకుంటూ కూర్చున్నారు" చెప్పిందావిడ.

"మరింకేం మమ్మల్ని పంపొచ్చు కదా!" ఆశగా అడిగాడు సుబ్బారావు.



"రూల్సొప్పుకోవు. ముప్పై సెకండ్లు దాటి ఒక్క సెకను లేటయినా పంపం" చెప్పిందావిడ.

"మరయితే డాక్టరు గారెళ్ళిపోవచ్చు కదా!" ఏడుపూ, కోపం కలగలిసిన గొంతుతో అడిగాడు సుబ్బారావు.

"అన్నీ టైము ప్రకారం జరగాలి. ఆరు గంటలా ముప్పై తొమ్మిది నిముషాలకే డాక్టరు గారు రూమ్‌లో నుండి బయటకు వస్తారు. ఆరు గంటలా నలభైయ్యేదు నిముషాలకు 'జలూక' నర్సింగ్ హోమ్‌కి చేరతారు" అని ఒక నిముషమాగి "మీ కంతగా అర్జెంటయితే మీరెళ్ళి ఆ నర్సింగ్ హోమ్‌లో అడ్మిట్ అయితే డాక్టరు గారు చూస్తారు" చెప్పింది రిసెప్షనిస్టు.

"అడ్మిట్ అవ్వాలా?" ఆశ్చర్యంగా అడిగాడు సుబ్బారావు.

"అవును. నర్సింగ్ హోమ్‌లో అవుట్‌పేషంట్స్ చూడరు. రూల్సొప్పుకోవు" చెప్పిందావిడ.

"అడ్మిషనంటే చాలా తతంగం కదా! రూము, బెడ్డూ, టెస్ట్‌లు....." నసిగాడు సుబ్బారావు.

"మీరొట్టి అమాయకుల్లా ఉన్నారే.... రూలు ప్రకారం ఇన్‌పేషంట్లను మాత్రమే చూడాలి. కాబట్టి అడ్మిషను పేపరు మీదే చూపిస్తారు. దానికి రెండొందలు అదనంగా కట్టాలి. అంతేగాని రూములూ, బెడ్లూ ఏమీ అక్కర్లేదు." నవ్వుతూ చెప్పిందావిడ.

"మీ రూల్సు మండిపోనూ...." సన్నగా దీర్ఘం తీసింది సరిత.

"వా... ట్?" కోపంగా గర్జించింది రిసెప్షనిస్టు.

"ఏమీ లేదు..." అంటూ సరిత జబ్బపుచ్చుకొని బయటకు లాక్కొచ్చాడు సుబ్బారావు.

"ఎలాగూ వచ్చాం. 'ప్రియా బ్రదర్స్' ఇక్కడికి దగ్గరే కదా! వెళ్ళి చీరలు చూద్దామండీ" అంది సరిత.

"సరే పద" అన్నాడు సుబ్బారావు.

ప్రియా బ్రదర్స్ షాపుకి అర కిలోమీటరు దూరంలో పార్కింగ్ ప్లేస్ దొరికింది. స్కూటరు పార్క్ చేసి నడుచుకుంటూ షాపు దగ్గరకు చేరారు. పెద్ద క్యూలో చివర్న నుంచున్నారు. అరగంట తర్వాత గేటు దగ్గరకు చేరుకున్నారు. ఒకావిడెవరో బయటకు వచ్చింది.

"ఒకరెళ్ళండి" అన్నాడు గేట్‌మన్.

"మేం ఇద్దరం వెళ్ళాలి" అన్నాడు సుబ్బారావు.

"ఇంకో మనిషి బయటకొస్తే గాని మీ ఇద్దర్నీ పంపను. రూల్సొప్పుకోవు" అన్నాడు గేట్‌మన్.

"భార్యాభర్తలొచ్చినప్పుడు ఒకర్నే పంపుతానంటే ఎలా?" కోపంగా అడిగాడు సుబ్బారావు.

"లోపల వెయ్యిమంది కంటే ఒక్కరూ కూడా ఎక్కువుండటానికి వీల్లేదు. ఊపిరాడక ఛస్తారు".

మరొకావిడ బయటకొచ్చింది. సుబ్బారావు, సరిత లోపలికెళ్ళారు. చాలా పెద్ద హాలు. రకరకాల విభాగాలున్నాయి. అన్ని చోట్ల జనం గుమిగూడి ఉన్నారు. 'అబ్బ ఎంత జనం' అనుకున్నాడు సుబ్బారావు. హాలులో ఓ మూల ఫెన్సింగుంది. లోపల ఇసకేస్తే రాలనంత మందున్నారు.

కుతూహలంగా అటు వెళ్ళబోయారిద్దరూ! మగవాళ్ళు వెళ్ళ కూడదంటూ అడ్డుపడ్డాడో సైంధవుడు.



"ఈ మందలో తప్పిపోతే వెతికి పట్టుకోడానికో గంట పడుతుంది" సాలోచనగా అన్నాడు సుబ్బారావు. అప్పుడే సుందరమ్మగారు చేతిలో సంచితో వగర్చుతూ ఫెన్సింగ్ లోపలి నుండి బయటకొచ్చారు.

"ఏమిటండీ విశేషం?" అనడిగింది సరిత.

"ఒకటికొంటే నాలుగు ఫ్రీ. 'శనిప్రియ' స్కీము కింద ప్రతి శనివారం ఉంటుందీ ఆఫర్. నేను ప్రతి శనివారం వస్తాను. తోసుకొనెళ్ళి ఇవి తీసుకునే సరికి ప్రాణం పోయినంత పనైంది" ఆయాస పడుతూ చెప్పిందావిడ. అయినా ఆవిడ మొహంలో ఆనందం కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"ఇంతకీ ఏమేం ఉన్నాయి?" అడిగింది సరిత.

"ఈ వారం మిడీలు, జీన్స్ పెట్టారు. ఒక్కో వారం ఒక్కోరకం పెడతారీ స్కీముల్లో"

"అవి మీకెందుకు? మీ ఇంట్లో పిల్లల్లేరు కదా?" అడిగింది సరిత.

"ఒకటికి నాలుగు ఫ్రీ అంటే మాటలా?" సంతోషంగా చెప్పింది సుందరమ్మగారు.

ఇక చాలు పదమన్నట్టు సరితను మోచేయితో పొడిచాడు సుబ్బారావు.

ఒక చోట చీరలు ఓ కొండలా పోసున్నాయి. దాని చుట్టూ జనం.

ఓ చీరందుకుని దాని పైన స్లిప్ చూసి కళ్ళు తిరిగినట్టయ్యి పక్కావిడ మీద పడబోయాడు సుబ్బారావు. సరిత అతని చెయ్యి పట్టి పడకుండా ఆపి "ఏమిటి? ఏమయింది?" అనడిగింది.



"ఈ చీర ఖరీదు ఇరవై వేలట" ఆశ్చర్యంగానూ, నీరసంగానూ చెప్పాడు సుబ్బారావు.

"కంగారు పడకండి. నైంటీనైన్ పెర్సెంటు డిస్కౌంటు. అంటే ఆ చీరను మనకు రెండొందల కొస్తుంది". భర్త అమాయకత్వానికి అందరూ నవ్వుతారేమోనని అటు ఇటూ చూస్తూ నెమ్మదిగా చెప్పింది సరిత. కాని ఎవరూ వీళ్ళని పట్టించుకొనే స్థితిలో లేరు.

సుబ్బారావు సిగ్గుపడిపోయి ఒకడుగు వెనక్కువేసి దిక్కులు చూడసాగాడు. ఓ మూల పెద్ద బేనరు కట్టుంది. దానికింద చాలామంది మగవాళ్ళున్నారు. ఆ బేనరు మీద "యాసో జీన్స్ ముష్టి మూడు వేలకే" అని రాసుంది. ఆశ్చర్యంగా నోరు తెరుచుకొని ఉండి పోయాడు సుబ్బారావు.

"అవి మీకు బాగుంటాయేమో చూస్తారా?" అడిగింది సరిత.

సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. వెంటనే కోపంగా... "ఏం వేళాకోళమా" అన్నాడు.

అతనికెందుక్కోపం వచ్చిందో ముందు సరితకర్థం కాలేదు. తర్వాత అర్థమయి "సారీ, నేనా ఉద్దేశ్యంతో అనలేదు" అంది.

"ఇంకే ఉద్దేశ్యంలో అన్నావు? నేను జీన్స్ ఎప్పుడైనా తొడిగానా?" కోపంగా ప్రశ్నించాడు. సరిత మొహం చిన్నబోయింది." అదికాదండీ మీకు ఖరీదయిన బట్టలు లేవుకదా అని అన్నాను అంతే. నన్ను నమ్మండి" అంది. ఆమె మొహం చూసి సుబ్బారావు కోపం తగ్గింది.

"నీక్కావలసినవి త్వరగా తీసుకో, వెళ్దాం" అన్నాడు.

ఇద్దరూ బయటపడి స్కూటరు వేపు నడుస్తున్నారు. కూల్‌డ్రింకుల షాపు దగ్గరకు రాగానే 'దాహం వేస్తోంది కూల్ డ్రింక్ తాగుదాం' అంటూ షాపు దగ్గరాగి జిప్సి డ్రింకు లిమ్మన్నాడు సుబ్బారావు. అవి లేవన్నాడు షాపువాడు. షాపు దగ్గర నిలబడి 'హేండ్సప్' డ్రింకులు తాగుతున్న నలుగురు యువకులలో ఒకడు "అది చిన్న పిల్లల డ్రింకు బుజ్జీ! చిల్డ్రన్స్ పార్క్ దగ్గరమ్ముతారు వెళ్ళు" అన్నాడు. మిగతా ముగ్గురూ గొల్లున నవ్వారు. సుబ్బారావుకి కోపం వచ్చి ఏదో అనబోయేంతలో సరిత 'వెళ్దాం పదండి' అంటూ లాక్కుపోసాగింది.

వెనుకనుండి "ఎదగాలోయ్! ఎన్నాళ్ళిలా! చిన్నపిల్లాడిలా" అని కేకేశాడొకడు. సుబ్బారావు వెనక్కు చూశాడు. మరొకడు హేండ్సప్ డ్రింకు బాటిలు చూపిస్తూ "నీకిది తాగేంత దమ్ముందా బుజ్జీ" అన్నాడు. మళ్ళీ నవ్వారు వెకిలిగా.

సరిత వదలకుండా లాక్కుపోయింది సుబ్బారావుని.

స్కూటరు పార్కు చేసిం దగ్గర కెళ్ళేసరికి సాయంత్రం సుబ్బారావు స్కూటరాపిన కానిస్టేబులు నవ్వుతూ స్కూటరు పక్కనే నుంచుని ఉన్నాడు.

"ఏవీ రావుగారి అప్పాయింటుమెంట్ అయిపోయిందా?" వెటకారంగా అడిగాడు పోలీసతను.

"లేదు. తొంభై సెకండ్లు ఆలస్యమయిందని పొమ్మందా రాక్షసి" చెప్పాడు సుబ్బారావు.

"నిజంగా?" అన్నాడు పోలీసు.

సరిత తన బాగ్‌లోంచి స్లిప్ తీసి చూపించింది.

"ఆవిడెవరో మా అక్కలాగుందే. ఓసారెళ్ళి చూడాలి... సరే గాని... డబ్బులేమైనా మిగిలాయా?" అడిగాడు పోలీసు.

"ఎందుకు?" తన స్కూటరు పార్కింగు మార్జిను దాటలేదని కన్‌ఫర్మ్ చేసుకొంటూ అనుమానంగా అడిగాడు సుబ్బారావు.

"ఫైను కట్టడానికి! వంద చాలులే!" చిరునవ్వుతో అన్నాడా కానిస్టేబులు.

"స్కూటరు పార్కింగ్ మార్జినులోనే ఉంది కదా! ఫైనెందుకు?" కోపంగా అడిగాడు సుబ్బారావు.

"స్కూటరు మార్జిన్లోనే ఉంది. కాని స్కూటరు నీడ గీతదాటి రోడ్డు మీదికొచ్చేసింది. రూలు ప్రకారం స్కూటరుకు సంబంధించినది ఏదీగీత దాటి బయటకు రాకూడదు" అన్నాడు పోలీసు.

"స్ట్రీట్ లైట్ కాంతిలో స్కూటరు నీడ గీత దాటితే దానికే ఫైనేమిటండీ నా బొంద!... అలా చూడండి పడవంత కారు రోడ్డు మీదే పార్క్ చేశారు వాళ్ళనేమీ చెయ్యరు.... మేమే లోకువ...." ఉక్రోషంగా అన్నాడు సుబ్బారావు.

"కారా?... ఏదీ.... నాకు కనబడదేం? అయినా మాకు కార్ బ్లయిండ్‌నెస్సుంటుందిలే... నీ మంచికోసం చెబుతున్నా.... నాతో మాటాడితే మాటాడేవు కాని.... ఎప్పుడూ అలా మాట్లాడకు! పోలీసులకు ఎదురు ప్రశ్నలేయకు! పెద్దకార్లను వేలెత్తి చూపకు! పోటా కింద అరెస్ట్ చేసేస్తారు. నేను మంచోడ్ని కాబట్టి సరిపోయింది. నువ్వైనా చెప్పు చెల్లెమ్మా" అంటూ స్కూటరింజను డోరు తీసే ప్రయత్నం చేయసాగాడు పోలీసతను.

"అది తీయకండి!" అని వందనోటు అందిచ్చాడు సుబ్బారావు.

"రేపోసారి స్టేషనుకొచ్చి రశీదు తీసుకో! ఇక వెళ్ళండి... నేనిదిగో ఈ స్కూటర్లు గల వాళ్ళంతా వచ్చే వరకూ ఇక్కడే చావాలి!" అన్నాడు పోలీసతను.

ఉస్సురంటూ స్కూటరు తీసి స్టార్ట్ చేశాడు సుబ్బారావు.


**SUBSCRIPTION COUPON**

Name :.............................................................. Age: .....................Profession.......................

Address:...........................................................................................................

...........................Ph. No. ............... (O) ...................... (R) email:.........................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No......................... Dated ......................... for Rs. 200/- favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No...... (.............................. month, 2002)

Date: Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 383 1388 / 657 0215, email: haasammag@hotmail.com

Note: Add Rs. 25/- for outstation Cheques



## 16-31 మే 2002లో శ్రీ భువనచంద్ర రాసిన



మా ఆవిడ ఇంతే... మరి మీ ఆవిడ?



## కథకు వచ్చిన స్పందన

కొన్ని సినిమాల్లో మీ పాటల సాహిత్యం విని మీ సాహిత్యం మీద సదభిప్రాయం పోయింది. ఇలాంటి పాటలు కూడా రాస్తారా! అనే ఆశ్చర్యం కలిగింది. పక్కన మగవారెవ్వరైనా ఉంటే వినడానికి, చూడడానికి భయం, సిగ్గు కలిగించే అలాంటి పాటలు సాహిత్యంపైన సదభిప్రాయాన్ని పోగొట్టడంలో ఆశ్చర్యం లేదు.

అలాంటి మీరు ఇంత హాస్యభరితమైన కథను రాసి, ఇంతవరకు చదవడమేగాని ఏ పత్రికకు నా అభిప్రాయాన్ని రాయని నా చేత ఉత్తరం రాయించారు. ఇంత అద్భుతంగా హాస్యాన్ని కురిపించి ఈ కథని ఇన్నిసార్లు చదివించారు. వాస్తు గురించి చాలా చక్కగా వివరించారు. పైగా "ముఖవాస్తు" అంటూ ఇంతవరకు ఎవరూ కనిపెట్టని కొత్త ప్రక్రియని కనిపెట్టారు. మీ 'వా.వి' గారు "మీదసలే బొర్రముక్కు. పైగా కూలిపోయే విమానంలా ముందుకు వాలి ఉంది" అని చెప్పినప్పుడు నా చూపు అప్రయత్నంగానే మీ ఫొటో మీదకు వెళ్ళిపోయింది. మీ ముక్కు మీద మీరే కామెంట్ చేసుకున్నందుకు మీ ధైర్యాన్ని మెచ్చుకొని తీరాలి.

మీ వా.వి. గారు మీ ఎడమవైపు మీసాన్ని మాత్రమేగాక పాపం మీ అందమైన ఉంగరాల జుత్తుని కాలువలు కట్టించి మీకు మహోపకారమైనా చేసారేమో అనుకున్నాను. పాపం తీరా చూస్తే 'ఎడ్డెం' అనేలోగానే 'తెడ్డం' అనే మీ "భార్యారత్నం" గారు మీకు (వాస్తు సరిచేయించుకున్న తరువాత) 'చారు' అనబడే రసాన్ని అనుగ్రహించే సరికి మా నరనరాల్లోనూ హాస్య'రసం' నిండిపోయి దాదాపు ఒక అరగంట సేపు హాస్యానుభూతిలో ఉండేలా చేసింది.

భువనచంద్రగారూ మీకు సలహాలనిచ్చేంత పెద్దదాన్ని కాకపోయినా 'హాస్యం' మీద అభిమానం కొద్దీ ఈ మాట రాయకుండా ఉండలేకపోతున్నాను. ఇంత మంచి 'హాస్యాన్ని' పండించ గల మీరు సాహిత్యాన్ని మాత్రం వినడానికి వీలులేని విధంగా రాయడం నాలాంటి కుటుంబ తరహా సాహిత్యాన్ని ఇష్టపడేవారికి కష్టం కలిగించవచ్చు. దయచేసి ఇక మీదటైనా సాహిత్యాన్ని అందరూ విని ఆనందించేలా వ్రాయమని మనవి. "జంధ్యాల" గారి తరువాత హాస్యం గతి అధోగతే అయ్యింది. ఇంత మంచి రచనలు ఉంటే హాస్యం మళ్ళీ జీవిస్తుందన్న నమ్మకాన్ని కలుగజేసారు. నేను, మా కుటుంబం అంతా జంధ్యాల గారి అభిమానులం. ఆయన సినిమాలు వేం అందరం కూర్చుని చూసి ఆనందిస్తాం.

ఇది వరకు సినిమాలలో పాటలు చూడటానికి (కుటుంబంతో సహా) వీలులేని విధంగా ఉండేవి. ఈ తరం సినిమాలలో వినడానికి కూడా వీలు లేని విధంగా అయిపోయాయి. మీరు మంచి సాహిత్యం రాయాలని కోరుకుంటున్నాము. మీరు వ్రాసిన పాటని మా ఇంట్లో అందరం వినగలిగితే బాగుంటుందని కోరుకుంటున్నాము.

ఇదే నా మొదటి ఉత్తరం. మీకు రాసే భాగ్యం కల్గించారు. తప్పులుంటే క్షమించవలసిందిగా మనవి. తెలియక చేసిన తప్పుగా భావించి మన్నించాలి. హాస్య కథని ఇంత అద్భుతంగా మలిచిన మీరు సాహిత్యాన్ని కూడా అద్భుతంగా రాస్తారని ఆకాంక్షిస్తున్నాను. మీలోని కథకుడ్ని బయటకు రప్పించిన 'హాసం'వారికి నమస్కారాలు.

-విద్యున్మాల, వైజాగ్

'హాసం' సంచికలో మీ కథ చదివి పది కాలాల పాటు గుర్తుండే నవ్వు కల్పించారు. కథ చదవటం మీ ఫోటో చూపడం వర్ణన చూడడం నాకు ఇంటి వాస్తు కాదు. దేశానికే వాస్తు బాగుండలేదు అని అన్నాడు ఒకాయన దక్షిణం పల్లం సముద్రం, తూర్పు పల్లం, ఉత్తరం ఎత్తు హిమాలయాలు అన్నాడు. దేశం బాగు పడుతుందంటారా మరి? అదీ నా బెంగ. మొత్తం మీద రచనా విధము హ్యూమరస్‌గా వుంది. మీరు నా రిజల్టు ప్రకారం 80 శాతం పాస్ అయినారు. నేను మాష్టారులెండి యీ మార్కులు వేసాను. వాస్తులో నీటి పారుదల నవ్వు వచ్చింది. కవులు చమత్కారులు గదా!

-ఉప్పాల మోహనబాబు, అవనిగడ్డ

మీ మొదటి కథ 'హాసం'లో చదివాను. బాగుంది. మీరు హాస్యం రాయగలరని రుజువు చేసుకున్నారు. వాస్తుకే ముఖవాస్తుని కల్పించి దానికే ముడిపెట్టి 'మీసం' సగం గీయించి బుర్ర గొరిగించి వాస్తు ఛాందసులకి అన్యాపదేశంగా బుద్ధి చెప్పారు. మీరు గేయకవులు గనక సినారే గారిలాగా పత్రికలకి గేయాలు కూడా రాయవచ్చును. సినిమాలకి రాసేటప్పుడు కొన్ని పరిధులకు లోబడి దర్శక నిర్మాతల ఆంక్షలకి లోబడి రాయాల్సి వుంటుంది. పత్రికలకి రాసేటప్పుడు మీ ఆత్మ ప్రబోధానికి అనుగుణంగా స్వేచ్ఛగా తెలుగు సాహిత్యానికీ మీ సమిధలను మీరు వేసి వెలిగించవచ్చును. పురాణ గాథలనో, సాంఘిక దురాచార ఘటనలనో కథాంశంగా తీసుకుని గేయాలు రాయవచ్చును. మీరు యిప్పటికే సాధించిన గ్లామరు తోడవుతుంది. అందరూ చదివి మీ సత్తా యేమిటో తెలుసుకోగలరు. (సినిమా పాటల ద్వారా మీ సత్తా ఏమిటో మీ హిట్ సాంగ్స్ విన్న నా లాంటి వారికి తెలుసుననుకోండి. ఆ సంగతి వేరు).

-రాపేటి రామకృష్ణారావు, విశాఖపట్నం

ఏంటండీ చంద్రగారూ మీ 'మీమాంస'? మా ఆవిడ ఇదీ మరి మీ ఆవిడ!! అంటూ ప్రశ్నార్థకంగా నిలిచిన మీ వాలకం అమాయకత్వంలా ఉంది. లేకపోతే, ఎడ్డెం అంటే తెడ్డెం అంటేనే కదా ఆమె 'భార్య' అని తెలిసేదీ! 'పాటల భువనం' నుంచి 'కథల చంద్ర' లోక విహారంలోకి వచ్చి భువన చంద్రగారి కలంలోని హాస్య కథనం చదవ గలిగాం. మీరు పరీక్షలో మంచి మార్కులే కొట్టేసారు. డిస్టింక్షన్‌కు ఆల్ ది బెస్ట్.

-నేమాన సుభాస్ చంద్రబోస్,

శ్రీకాకుళం టౌన్, ఇసిలిపురం జంక్షన్

(మీ) తొలి ప్రయత్నం - మలి యత్నానికి చక్కని 'పునాది'గా నిలిచిందనాలి. హృద్యం గమ కథా భవనాలకు ఈ 'భువన' విజయం ఓ ప్రతీక. మంద 'హాసం' చిందే 'చంద్ర' బింబంలా ఉందీ. మీ చమత్కార - ముఖవాస్తు. పరీక్ష కోసం - మంచి 'ఎటెన్షన్ పే' చేసి డిస్టింక్షన్ కొట్టేసారు. మీసం మెలి వెయ్యొచ్చు.

వేసవి మండుటెండల్లో కూడా
కాసిని మంచ తీర్థం తాగి
కాస్తారు పాఠకలోకం - మీ కోసం.
క్యూలైన్లో - 'హాసం' పుస్తకం కోసం.
రాస్తారని - నవ భరత - కథా రంగవల్లి
వెయిట్ చేస్తారో పక్షం - బాధతో సొమ్మసిల్లి.

-శ్రీమాన్ శ్రీకాశ్యప్, సింహాచలం

**అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**

**క్లాసిక్స్ రీటోల్డ్**

కాళ్లకూరి నారాయణరావు గారి

# వరవిక్రయం

నాటకం

### జరిగిన కథ

పురుషోత్తమరావు అనే ఆయన తన పెద్ద కూతురు కాళిందికి బసవరాజు అనే అబ్బాయితో పెళ్లి నిశ్చయం చేస్తాడు. బసవరాజు పెంపుడు తండ్రి సింగరాజు లింగరాజు లోభి. కట్నం బాగా గుంజడానికి పెళ్లిళ్ల పేరయ్య, వివాహాల వీరయ్యల సహాయంతో వేలం పాట ఏర్పాటు చేస్తాడు. 5,500 రూ॥లకు కట్నం ఖరారవుతుంది. దానికోసమై తండ్రి పొలం అమ్ముడన్నా వార్త విని కాళింది ఆత్మహత్య చేసుకుంటుంది. కట్నం డబ్బు తిరిగి ఇవ్వనక్కరలేకుండా ఉండడానికి లింగరాజు చిన్నకూతురు కమలను కోడలిగా చేసుకుంటానంటాడు. కమల సరేనంటుంది. పెళ్ళి నిశ్చయమవుతుంది.

**(గత సంచిక తరువాయి)**

లింగరాజువద్దకు భార్య సుభద్ర వచ్చి 'పెళ్లి కదా నగలిమ్మంటుంది - పెళ్లిలో బోల్డు లాంఛనాలు' వస్తాయంటూ పెద్దలిస్టు అప్పచెప్పాడతను.

అయిదురోజులు పెళ్లి కాబట్టి అయిదు రోజులు అయిదు మొహిరీలు, అయిదు కాసులు, అయిదు వెండి పలుదోము పుల్లలు, అయిదు బంగారు తాటి ఆకులు, అయిదు వెండి పుల్లలు, అయిదు వెండి కాఫీ కప్పులు, అయిదు వెండి ఉప్మా ప్లేట్లు, అయిదు కుర్చీలు, అయిదు కాలి పీటలు, అయిదు మెత్తలు, అయిదు బాలీసులు, అయిదు బొట్టు పెట్టెలు, అయిదు అద్దాలు, అయిదు దంతపు దువ్వెనలు, అయిదు కుంకుమ భరిణెలు, అయిదు కాటుకాయలు, అయిదు గంధపు గిన్నెలు, అయిదు తలనూనె బుడ్లు, అయిదు సెంటు బుడ్లు, అయిదు సబ్బు పెట్టెలు, అయిదు పవుడరు డబ్బీలు, అయిదు చేతిరుమాళ్ళు, అయిదు గంధపు చెక్కలు, అయిదు జేనా విసనకర్రలు, భోజనంలో వెండిచేపలు, ఫలహారంలో పసిడి పీతలు ఈలాంటి వెన్నో వస్తాయి.

దీన్ని బట్టి అప్పటి లాంఛనాల గురించి ఒక ఐడియా వస్తుంది.

పెళ్లి ప్రారంభమయిన మూడో రోజున పురుషోత్తమరావు ఒక్కడూ కూచుని బాధపడుతుంటాడు.

'ఆడపిల్ల పెళ్లి చేయడం కంటె అశ్వమేధయాగం చేయడం సులభం. తెల్లవారగానే బిందెలతో నీళ్లు, పలుదోము పుల్లలు పంపాలి. ఆ వెనక కాఫీ, దోసె, ఇడ్డన్లు, ఉప్మా కావిళ్లతో నడిపించాలి. తర్వాత భోజనానికి రండి రండని పిలిచిన వారినే పిలవాలి. తినేటప్పుడు పంక్తుల మధ్య పెళ్లి వారి కోరికలు కనిపెట్టాలి. వాళ్ళలో ఒకడు రాకపోయినా మనం మంచినీళ్లయినా ముట్టకుండా చూడాలి. ఇంత చేసినా, వేలు గుమ్మరించినా నిష్ఠూరాలు పడాల్సిందే!"

అంతలోనే ఘంటయ్య (లింగరాజు గాడి వంటవాడు) వియ్యపురాలు గారు లేచే వేళయింది. అమ్మగార్ని పంపలేదేం అంటూ వస్తాడు. ఎందుకురా అంటే చెయ్యాల్సిన పనులేమిటో వివరిస్తాడు.

ఘంట: యెందుకోసం అంటారేమిటి? వియ్యపురాలు గారికి తెలివిరాగానే కండ్లు తుడవాలి, కాళ్ళు మడవాలి, కోక సర్దాలి, కిందకు దింపాలి, పెరట్లోకి పంపాలి, నీళ్ళ చెంబందివ్వాలి, రాగానే కాళ్ళు కడగాలి, పండ్లు తోమాలి, మొహం తొలవాలి, నీళ్ళు పోయాలి, వళ్ళు తుడవాలి, తల దువ్వాలి, కొత్త చీరకట్టాలి, కుర్చీ వేయాలి, కూర్చోబెట్టాలి, పారాణి రాయాలి, గంధం పూయాలి, అత్తర్లివ్వాలి, పన్నీరు చల్లాలి, మొహాన్ని మొహిరీలద్దాలి, కళ్లకు కాసులద్దాలి, వంటిని వరహాలద్దాలి, వెండి పలుపు వెనుకకు కట్టాలి. బంగారు బలుపు పక్కకు చుట్టాలి. దిష్టి తియ్యాలి. హారతివ్వాలి, అద్దాన్నమివ్వాలి, యిల్లాంటి వింకా నా తలవెంట్రుకలన్ని వున్నాయి. ఆలశ్యమయితే అలక కట్నం చెల్లించవలసి వస్తుంది. త్వరగా పంపించండి.

ఇంతలోనే వివాహాల వీరయ్య వచ్చి మగపెళ్లి వారి కోరికల జాబితా చదువుతాడు.

వీర: (ప్రవేశించి) అయ్యా! ఫలహారాల కావిళ్ళింకా పంపించారే కాదు. పెళ్ళివారెంతసేపు ఆగుతారు? ఎవరిమటుకు వాళ్ళు కాఫీ హోటళ్ళకు ప్రయాణమవుతుంటే, పరుగు పరుగున నేను చక్కా వచ్చాను. మగ పెండ్లి వారినిలా చూస్తే మర్యాద దక్కుతుందా?

పురు: ఇదుగో ఇప్పుడే పంపుతాను. ఈ పాటికి సిద్ధమయ్యే ఉంటాయి.

వీర: ఏమి కావడమో! నిన్నటి ఉప్మాలో నిమ్మ పండ్ల రసమే లేదట. ఇడ్డెన్లలో అల్లం ముక్కలు లేవట. కాఫీలో పంచదార లేదట. ఈ పూటయినా కాస్త యింపుగా వుండకపోతే పట్టుకు వచ్చిన వాళ్ల మొహాన్ని పెట్టికొట్టాలని వదిమందీ



ఆలోచిస్తున్నారు. ఖారా కిల్లీలు కాస్త ఎక్కువగా పంపండి. చీట్ల పేకలు నిన్ననే చిరిగి పోయాయి. ఈ పూటింకో నాలుగెక్కువ పంపండి. మదరాసు నశ్యము మాట మరచిపోకండి. సెలవు. మరి ఆలస్యమైతే మాట దక్కదు అని వెళ్లిపోతాడు.

ఇదంతా విని పురుషోత్తమరావు మగపెళ్లి వారా? మరిడీ దేవతలా అనుకుంటూ ఆశ్చర్యపడతాడు.

మధ్యవర్తిగా వ్యవహరించిన పేరయ్య తను కాస్త వెనకేసుకోవడానికి ఇదే తరుణమనీ ఆడ పిల్ల పెళ్లి చేసాక ఆడపిల్ల తండ్రి వద్ద మిగిలేది ఏమీ ఉండదంటూ పదహారు రోజులు పండుగను మరో రకంగా నిర్వచిస్తాడీ విధంగా-

పేర: ఎనిమిది వేలకూ, యేభయ్యో, వందో మిగిలి వుంటాయి. ఇంత వరకు నా చేతిలో పైసా పడలేదు. ఇప్పుడే నాది నేను వడుక్కోవాలి కాని ఆనక వీరిచ్చేదేమిటి చచ్చేదేమిటి? ఆనక వీరికి అన్నముంటే గదా! ఈ రోజుల్లో ఆడపిల్ల పెండ్లి చేశాక యింకా వుండేదేమిటి. వుద్దరి! తొలినాడు హడావిడి, మలినాడు ఆయాసం, మూడు మంగళాష్టకాలు, నాలుగు సిగపట్ల గోత్రాలు, (కొట్లాటలు) అయిదు అప్పగింతలు, ఆరు అంపకాలు, ఏడు వంట బ్రాహ్మణుల తగవు, ఎనిమిది ఋణదాత నోటీసు, తొమ్మిది జవాబు, పది దావా, పదకొండు స్టేటుమెంటు, పన్నెండు విచారణ, పదమూడు డిక్రీ, పద్నాలుగు టమటమా, పదిహేను వేలం, పదహారు చిప్ప! ఈ రోజుల్లో యిదే పదహారు రోజుల పండుగ.




ఇక భోజనాల తంతు ఎలా ఉందో చూడబోతే- మధ్యాహ్నం రెండు గంటలయినా ఊళ్ళో వారు ఎవ్వరూ భోజనానికి రాలేదని పురుషోత్తమరావు వర్రీ అవుతూంటాడు.

పురు: పిలిచినా పలకకుండా లోపల ముసుగుపెట్టి బిగదన్నుకుని పడుకునే శుద్ధ మూర్ఖుడొకడు. ఇదిగో మీ వెనకనే వస్తున్నా వెళ్లండి అంటూ చుట్ట ముట్టించే శుంఠ ఒకడు, తన కోసం వెయిట్ చేసి చూస్తారో లేదోనని కావాలని ఆలస్యం చేసే అల్పుడొకడు, ముందు వస్తే పరువు పోతుందనుకొని, ఆఖరుగా వద్దామనుకునే పశువొకడు, ఇంట్లోనే భోజనం చేసేసి వస్తాననో, రాననో చెప్పని దౌర్భాగ్యుడొకడు, వచ్చి కోపగించుకొని వెళ్ళిపోయే నిర్భాగ్యుడు ఒకడు. పెళ్లివారి విందు తీరులిలా ఏడ్చాయి.

ఇంతలో పేరయ్య వచ్చి పెళ్లివారు ఎందుకు రావటం లేదో పాఠం చదువుతాడు.

పేర: లింగరాజుగారి మొదటి భార్య మేనమామ బావమరిది తోడల్లుడు తమ్ముడట. ఆయనకీపూట యిడ్డెన్లలో అల్లం ముక్కలు తక్కువైనాయట. అందుకోసం అలిగి కూర్చున్నాడు. పెళ్ళి కొడుకు జనక సంబంధము బాపతు పినతండ్రి గారి సవతి తల్లి తమ్ముడు బావమరిది వేలువిడిచిన మేనమామ కొడుకట. ఆయనకు రాత్రి చిన్నపీట వేశారట. అందుకోసం భీష్మించి కూర్చున్నాడు. వియ్యపురాలి గారి అన్న పిన్నత్తగారి ఆడపడుచు తోడికోడలు సవతి తల్లి తమ్ముడు మేనమామగారి మేనత్తకొడుకు మేష్టరుగారితో వచ్చిన స్నేహితుడు గారట. ఆయున్ను రాత్రి మీరందరితోపాటు ఆదరించలేదట. అందుకోసం రైలుకు పోతానని రంకెలు వేస్తున్నాడు. స్టూడెంట్లకు రాత్రి బంగాళా దుంపల కూరా, పకోడీల పులుసూ చేయించారు కారుట. అందుకోసం వారీపూట వెళ్ళడం, మానేద్దామా అని ఆలోచిస్తూ ఉన్నారు. వారంత రానిది మేమెలా వస్తామని కడంవాళ్ళు కాళ్ళు కాచుకుని కూర్చున్నారు. ఇక తమరు వెళ్ళి తంటాలు పడవలసినదే కాని నా వల్ల కాదు.

పురు: ఊరివారు?

పేర: ఊరువారు మామూలు పాటే "యిదుగో వస్తున్నాము - పదండి"

పురు: రామమూర్తిగారు రాలేదేమీ?

పేర: పట్టుబట్ట మరచెంబూ తేవడానికీ బ్రాహ్మడు దొరకలేదట! బ్రాహ్మణ్ణి వెతికించడానికి కూలి మనిషి కోసం బయలుదేరాడు.

పురు: షైనులుగారో?

పేర: నిన్న తలవెంట్రుకలున్న పూర్వసువాసిని ఎవరో వంటశాల వైపుకు వచ్చినదంట. పాపం అందుకోసం ప్రాయశ్చిత్తం చేయించుకుంటున్నారు. ఈ పూట శాకపాకాలేమిటని అడిగితే, పనసకాయకూర, పులిహోర, బొబ్బట్లు, బూంది, మిఠాయి అని చెప్పాను. అయితే అయిదు నిమిషాలలో వస్తాను పదమన్నారు.

పురు: అచ్యుతరామయ్యగారో!

పేర: ఈ మధ్య బ్రహ్మసమాజిగాడెవరో పై అధికారిగా వస్తే ఆయనకోసం యజ్ఞోపవీతాలు తీసిపారవేశారట. నిన్న చొక్కాతో వస్తే నలుగురూ నవ్వారట. సాయంకాలానికి జంధ్యము సంపాయించుకొని వస్తానన్నారు.



భ్రమ: (కోపంతో ప్రవేశించి) పేరయ్యగారూ! ఏరి ఏరి చివరికెంత చక్కని సంబంధం సంపాదించినారండి! వారి లాంఛనాలు వారు పుంజాలు తెంపి పుచ్చుకొంటున్నారు. మనకీయవలసి వచ్చినప్పుడు "మా కానవాయితీ లే" దంటున్నారు. మనం ఇచ్చిన కట్నమును బట్టి మంగళహారతిలో మనకైదు నూటపదహారులు రావాలి! గదా! వారు వరహాకంటె వేయరట!!

పురు: ఈ మాట చెప్పడానికా నువ్విప్పుడు వచ్చినది?

భ్రమ: ఇది కాదు. ఈ పూట వియ్యపురాలి పినతల్లి కూతురు తోడికోడలి అక్క ఆడబిడ్డ సవతి మొగాన అద్దిన మొహిరీ మోటుగా ఉన్నదట. అందులకై ఆమె అలిగిందట. వియ్యపురాలు విచారించుచు కూర్చున్నదట. అమ్మలక్కలందరు చుట్టు మూగి ఆమెకు పురెక్కిస్తున్నారట.

మగ పెళ్లి వాళ్ల సాధింపుల మధ్య, లింగరాజు గారి మొదటి భార్య మేనమామ బావమరిది తోడల్లుడి తమ్ముడి అలకలతో, పెళ్లికొడుకు జనక స్థానపు పినతండ్రి సవతి తల్లి తమ్ముడి బావమరిది వేలు విడిచిన మేనమామ కొడుకుగారి రుసరుసలతో, ప్రాయశ్చిత్తం కోసం ఉపవాసం వుంటూ, పనసకాయ కూర పేర చెప్పగానే పరిగెత్తుకొచ్చిన 'నిష్ఠాపరులైన' వూరి శిష్ఠుల హడావిడితో - పెళ్లి అయిపోతుంది.

పెళ్లయ్యాక కమల కాపురానికి వెళ్లదు.

తను పెళ్లిలో పెట్టిన నగలు కాజెయ్యడానికి పురుషోత్తమరావే ఆమెని కాపరానికి పంపడం లేదని లింగరాజు కోర్టులో దావా వేయిస్తాడు.

అసలు సంగతేఁవిటంటే లింగరాజు ఆ నగలు నిజంగా కొని కోడలికివ్వలేదు. తన దగ్గర ఎవరో తాకట్టు పెట్టిన నగలు ఆ సమయానికి పెట్టి కాపరానికి రాగానే లాగేసుకుందామనుకున్నాడు.

మధ్యలో ఓ చిన్న ఉపాఖ్యానం

లింగరాజు తరపు వకీలు పేరు వె(రిబు(ర్రల వెంగళప్ప. ఈ వెంగళప్ప వకీలే కాకుండా తాలూకా బోర్డు ప్రెసిడెంటు గూడా. అతని దగ్గరికి ఒక టీచరు వచ్చి రెండు రోజులు శలవు కావాలంటాడు.

వెంగ:- ఎందుకు?

టీచ:- నా భార్యకి కాన్పు కష్టం అయిందండీ! నేనా వూరికి వెళ్లాలి.

లింగ:- నీ భార్య కష్టపడుతూంటే నీవెందుకు వెళ్లడం? దగ్గరుండి కనిపిస్తావా? లేక వకాల్తా పుచ్చుకుని నీవే కంటావా?

టీచ:- పెద్ద డాక్టరమ్మని తీసికెళ్తానండి!

వెంగ:- అబ్బో! నీ మొహానికి అది కూడానా! ఇన్స్పెక్టరుగార్ని చూశావా?

టీచ:- చూశానండీ! వారు తమతో మనవి చేసుకోమన్నారు.

వెంగ:- అయితే ముందు ఆ పిడతని చూసి వాడు వెళ్లమంటే వచ్చావన్నమాట! ఫో! శలవూ లేదు, గిలవూ లేదు!

టీచ:- అయ్యా! తమరు ఎలాగైనా కటాక్షించాలి.

వెంగ:- పొమ్మంటే పోలేదు గనుక రెండు రూపాయల ఫైను.

టీచ:- బాబూ! తమరు దయతలవాలి!

వెంగ:- ఫైనన్నా కదలలేదు. గనుక పదిహేనురోజులు సస్పెండు.

టీచ:- అయ్యా! అయ్యా! తమరు ఆగ్రహిస్తే నేను ఆగగలనా? అనుగ్రహించాలి!

వెంగ:- సస్పెండన్నా జంకలేదు గనుక డిస్మిస్ చేశాను ఫో!

టీచ:- ఆరి ఛండాలుడా! అంత మాట అనేశావా? అంతేనా అంతకంటే యింకేమైనా చెయ్యగలవా? నీలాంటి అధముడి ఏలుబడిలో పనిచేయడం కన్నా ముష్టెత్తుకోడం మంచిది! ఈ మూణ్ణాళ్ళ ముచ్చటకే మిడిసిపడి పోతున్నావు! ఈసారి నిన్నెలాగా యూడ్చి పారేస్తారు. ఇన్స్పెక్టరునెందుకు తిడతావ్? ఆ మహానుభావుడే లేకపోతే నీలాంటి నీచులు యింకెన్ని అక్రమాలు చేసేవారో! ప్రతీవాడినీ పిడత, పిడత, అంటావ్ పిడతేంటి. నీ పిండా కూడు? నువు బాగుపడవ్. ఈ మాటలు మాత్రం గుర్తుంచుకో! -(ఇంకా వుంది)

-నిశాపతి




## పన్‌డితుడు శంకర నారాయణ



పన్ చేయడానికి భాషపై మంచి పట్టు ఉండాలి. మాటను విరిచో, వేరే అర్థంలో ప్రయోగించే చమత్కారాన్ని పన్‌డించడం అంత సులభ మేమీ కాదు. శంకరనారాయణ ఈ విద్యలో సిద్ధహస్తులని ఇప్పటికే ఋజువు చేసుకున్నారు. తెలుగు, ఇంగ్లీషు కొండొకచో హిందీ, సంస్కృతం భాషా పరిజ్ఞానాలను కలగలపి ఈయన అనేక ప్రయోగాలు చేశారు. 'పన్‌పరాగ్' అనే ఆయన పుస్తకంలో వివిధ అధ్యాయాలను పరికించి చూస్తే ఒకే మాటను తెలుగు, ఇంగ్లీషు అర్థాలలో వేర్వేరుగా ప్రయోగించి ఆయన పుట్టించిన హాస్యానికి కొన్ని ఉదాహరణలు.

★ కాముడన్న పేరే గానీ 'కామ్' గా ఉండడు, ఉండనీయడు
★ కాల్‌గరల్ - కాలుజారిన గరల్
★ పని లేకున్నా 'పని'ష్మెంటే
★ పతి నుంచి సతి కోరుకునేది సిం'పతి'
★ 'అప్పు' అయితే 'డౌను' కాక తప్పదు
★ ఎన్‌కౌంటర్లు పోలీసుల 'గన్'కార్యం!
★ ఫ్లాప్ అయితే 'శని'మా
★ సూర్యుడు పూరించేది 'సమ్మర్ శంఖం'
★ ఐ.ఎం.ఎఫ్. పై పార్లమెంటులో 'అప్పు'రోర్
★ వానరాలు శ్రీరాముడి 'వాలం'టీర్లు
★ రోడ్ల మధ్య 'తారు'తమ్యాలు
★ కిరాయి వాళ్లను పీడించేది ఓనర సంతతి
★ వేశ్యలకు డబ్బే 'విట'మిన్
★ పక్కింటికి నీళ్ళు ఎక్కువ వచ్చినా 'జల'సీ!
★ సింగరేణి గనుల్లో 'కోల్‌మాల్'
★ 'ఇల్లు' అందరికీ 'కొంప'ల్సరీ!
★ గాయకుల్లో ఎవరి 'పిచ్' వారికానందం
★ డ్రైవర్లు ఆడేవి 'రాష్' క్రీడలు
★ భగ్గుమనడం అగ్నిదేవుడి 'మంటా'లిటీ
★ పొల్టీలకు ఎప్పుడూ 'గుడ్డు మార్నింగే'
★ ఫంక్షన్లు జరిపితే 'గిఫ్టు'బాటు కావాలి
★ కూతవేటు దూరం - 'వాగబుల్ డిస్టెన్స్'
★ ఈ రోజుల్లో అరుదయింది ని'స్కామ్'కర్మ
★ నేత్ర వైద్యులు అందరికీ 'ఐ'నవారు.
★ పజిల్ అంటే 'గడిసాము'
★ ఆడవాళ్ళు కోరుకునేది 'ఫెమినిష్టా రాజ్యం'
★ స్త్రీలకు తెలిసినవి 'ఫిమెలు'కువలు
★ వయసు ప్రకృతి - వైస్ వికృతి
★ 'కొర్రీ' వేయడం 'అడ్డు'మినిస్ట్రేషన్
★ మేధావులు చేసేవి 'థాటాకు' చప్పుళ్ళు
★ విమర్శలది కా'మెంటాలిటీ'
★ 'వీల్'ను బట్టి నడిచేది జనతాదళ్
★ తాపీమేస్త్రీలవీ 'వాల్'చూపులే
★ రొట్టెలు పెడితే అందరూ 'బన్'ధువులే
★ పెళ్ళాం లేకపోతే 'వన్'టరితనమే
★ ప్రేయసీ ప్రియులు చేసేవి 'కిస్'కిస ధ్వనులు
★ 'కీ' పొజిషన్లో ఉన్నవాళ్ళకే తాళం చెవులు


చదువుల్రావు
సత్యమూర్తి BV
నా వాచ్ పాడైపోయింది
స్మగుల్డ్ రిస్ట్ వాచీలు చవగ్గా వస్తున్నాయి. నేనొకటి కొనుక్కుంటానమ్మా
ఎందుకురా అనవసరంగా
నీ పెళ్ళికి మీ మామయ్య ఎలాగా కొనిస్తానన్నాడు కదురా
పెళ్తే నాకు తొందరగా వాచీ కావాలమ్మా



# రాంపండు లీలలు

## రాంపండు - బ్రిలియంటు అయిడియా

**అనంత్ రాంపండుని అయిడియాలు వాడుకున్న దాఖలాలు లేవు. కానీ కామేశం బాబయ్య విషయంలో మాత్రం సలహా అడగడం సంభవించింది. దానికి కారణం - రాంపండూ పూర్వానుభవం!**

రాంపండు అనుభవం తక్కిన వాటిల్లో ఎలా ఉన్నా ప్రేమ వ్యవహారాల్లో మహాగట్టిది. అంటే ఆపాటి అనుభవం కామేశం బాబయ్యకు లేదని కాదు. ఆ మాటకొస్తే బాబయ్య రాంపండు కంటె ఎంతో సీనియర్. నలభై యేళ్లుగా, అంటే తన పదహారో ఏటి నుండీ ఆయన ఎంతమందితో ప్రేమలో పడ్డాడో లెక్కేలేదు. బాబయ్య వరుస అవుతాడు కాబట్టి అతని గురించి అనంత్ చిన్నప్పటినుండీ వింటూనే ఉన్నాడు. విన్నదానిలో చెప్పుకోదగ్గదీ, మెచ్చుకోదగ్గదీ ఏమీ కనబడలేదు. ముఖ్యంగా ఆ చెప్పేది మాంకాళి అత్తయ్య అయినప్పుడు!

కనబడ్డప్పుడల్లా పాఠం ఒప్పగించేది - "ఒరేయ్ అనంతూ! మీ కామేశం బాబాయ్‌ని చూసి నేర్చుకో అంటున్నావంటే అలా ఉండమని కాదు. అలా ఉండకూడదని చెబుతున్నాను. ఎవరు కనబడితే వాళ్లను ప్రేమించానని వెంటబడడం. మనం ఏమిటి, మన వంశం ఏమిటి అన్న ఆలోచనే లేకపోవడం - ఇది మంచి పద్ధతి కాదు. దాన్నెవత్తినో ప్రేమించాను, పెళ్లి చేసుకుంటాను అని వీడు అనడం. మేమంతా వెళ్లి అడ్డుపడడం. ముఖ్యంగా ఆ రికార్డింగ్ డాన్సర్ అచ్చమ్మ విషయంలో అయితే మరీనూ. గుళ్లో పెళ్లి చేసుకుంటానని అన్ని ఏర్పాట్లు చేసేసుకున్నాడు కూడా! దాన్ని వదుల్చుకునేటప్పటికి తలప్రాణం తోకకి వచ్చింది. నువ్వూ అలాటి వేషాలు వేశావో వీపు చీరేస్తాను జాగ్రత్త!".

కామేశం లాగానే అనంత్ కూడా బ్రహ్మచారిగా ఉండిపోవడంతో మాంకాళి అత్తయ్య ఇలా హెచ్చరిస్తూ ఉండేది. కానీ నిజానికి అనంత్ పెళ్లి చేసుకోక పోవడానికి కారణం - బద్ధకం, సంసారం చూసుకోవలసి వస్తుందనే భయం! కామేశం విషయంలో అయితే - అతనికి నచ్చిన పిల్లలెవర్నీ కుటుంబం ఆమోదించక పోవడమే అతన్ని బ్రహ్మచారిగా మిగిల్చింది. అందునా ఈ మధ్య బాగా ఒళ్లు రావడంతో వివాహేచ్ఛ నశించి ఉంటుందని అనంత్ అనుకుంటూండగానే ఓ రోజు బాబయ్య దిగబడ్డాడు.

అనంత్ క్లబ్బు నుండి ఇంటికి వచ్చేసరికి బాబయ్య అద్దం ముందు నిలబడి ఈలవేసు కుంటూ తల దువ్వుకుంటున్నాడు. అనంత్ పలకరించాడు. - "ఏమిటి బాబయ్యా, ఈ మధ్య బాగా ఒళ్లు చేసినట్టున్నావ్! ఎవరైనా టైలర్ స్లిమ్ అవుదామనుకుంటే వారానికోసారి నీ కొలతలు తీసుకుంటే సరి!".

"ఏడిశావ్ లేవోయ్! ఈ మధ్య గ్యాస్ట్రిక్ ప్రాబ్లెమ్ వల్ల తినడం తగ్గించేశాను. నీకు తెలుసా? ఎసిడిటీ వల్ల స్టమక్ లైనింగ్ చెడిపోయి, వేళకు అన్నం తినకపోతే అరగని స్టేజికి వచ్చేశాను" అన్నాడు బాబయ్య అద్దం నుండి దృష్టి మరల్చకుండానే!

బాబయ్యతో ఇదొకటి చిక్కు. ఎప్పుడు చూసినా స్టమక్ లైనింగ్ గురించి తెగ మాట్లాడతాడు.

"పోన్లే బాబాయ్, ఇంక ముస్తాబు ఆపు. నీ ఇమేజ్ బరువు మోయలేక అద్దం పగిలి పోయేట్టుంది. అయినా పెళ్లికొడుకులా అంత ముస్తాబయ్యావేమిటి?" అని జోక్ చేశాడు అనంత్.



"పెళ్లికొడుకుని కాబట్టే పెళ్లి కొడుకుగా ముస్తాబవుతున్నానురా చవటా" అంటూ కామేశం బాబాయ్ అనంత్‌ను జెల్లకాయ కొట్టబోయేడు.

ఇది జోకో, సీరియస్సో అనంత్‌కు అర్థం కాలేదు. "ఈ వయస్సులో నీకు పెళ్లేమిటి బాబాయ్? నిన్ను చేసుకోవడానికి ఏ అమ్మాయ్ ఒప్పుకుంటుంది కనక!" అన్నాడు.

కామేశం బాబాయ్ అనంత్ కేసి జాలిగా చూశాడు. "పిచ్చివాడా, ఈనాటి యంగ్ గర్ల్స్‌కి కావాల్సినది ఉఫ్ అని ఊదితే పడిపోయే కుర్రసజ్జు కాదు, నాలాగ స్ట్రాంగ్‌గా, రాక్ లైక్ సపోర్ట్‌గా నిలబడగల అనుభవజ్ఞుడు. అందుకనే ఓ అందమైన అమ్మాయి నేనంటే ఇష్టపడింది. నాకు నచ్చింది. డిన్నర్‌కు హోటల్‌కి రమ్మనమన్నాను. పెళ్లి చేసుకుంటావా? అని అడగబోతున్నాను. సరేనంటే వచ్చే నెలలోనే పెళ్లి. నువ్వు తోడు పెళ్లి కొడుకుగా కూచోవలసి వస్తుంది. మంచి బట్టలు అవీ కుట్టించుకో." అంటూనే బయటకు వెళ్లడానికి రెడీ అయ్యాడు.

అనంత్‌కి కళ్లు తిరిగినట్టయింది. "ఎవరావిడ? ఐమీన్ అమ్మాయ్?"

"సుబ్బి అని గాంధీపార్కు పక్కన పెసరట్లు వేస్తూంటుంది. వెరీ బ్యూటీఫుల్ గళ్".

"బాబోయ్ బాబాయ్, అటువంటి అమ్మాయిని చేసుకోవడానికి మాంకాళి అత్తయ్య ఒప్పుకుంటుందా?"

బాబాయ్ మంచి ధైర్యంగా ఉన్నాడు. "మాంకాళి అక్కయ్య ఒప్పుకుంటే... కుంది... లేకపోతే లేదు. నిన్న రాత్రే చెప్పేశాను. తాంబూలాలు వేసేసుకుంటున్నాం. తన్నుకు ఛావండి అని ఈసారి మాత్రం తను అడ్డుపడితే ఊరుకోను. ఖబడ్దార్ అని చెబుతాను. నాకూ ఏభై ఏళ్లు దాటాయ్. అయినా ఇంకా తన మాట వినాలా? వినను. నాకూ స్వతంత్రం వచ్చింది. జైహింద్. ఛలో సుబ్బీ" అని నినాదం ఇచ్చేసి కామేశం బాబాయ్ రోడ్డున పడ్డాడు.

'ఈ వరస చూస్తూంటే ఈసారి బాబాయ్‌ను ఆపడం ఎవరితరం కాదు. పాపం ఎవడు అడ్డుపడడానికి ప్రయత్నిస్తాడో కానీ వాడు మసి అయిపోతాడు'' అనుకున్నాడు అనంత్, కాస్సేపటిలోనే మాంకాళి అత్తయ్య ఫోన్ వస్తుందని తెలియక.

ఫోన్ చేస్తూనే అత్తయ్య లంకించుకుంది. "ఏరా అనంతూ, కామేశం గాడు అక్కడ లవ్ ఎఫైయిర్స్ నడుపుతూంటే నువ్వు గాడిదలు కాస్తున్నావా? కనిపెట్టి నాకు ముందుగానే చెప్పవద్దా? పోయి



పోయి దోసెలు పోసేదాన్నా వరించడం?" అంటూ అత్తయ్య ఆ సుబ్బి వంశాన్ని తిట్టనారంభించింది.




దోసలు కాదు, పెసరట్లు అని సవరించబోయి అనంత్ మరిన్ని చివాట్లు తిన్నాడు.

"పోనీ, దోసెలు పోసేదాన్ని నువ్వు వరించు! పెళ్లిపెటాకులు లేకుండా ఆంబోతుల్లా తిరిగితే అటువంటి వాళ్లే దొరుకుతారు. ఈ పెళ్లి ఆపకపోతే నేనూరుకోను. నిన్ను కొరతవేస్తాను చూడు."

అనంత్ అభ్యంతరం తెలపబోయాడు. "సుబ్బి పెళ్లి ఎంకి చావుకి వచ్చిందని - సుబ్బితో బాబాయ్ పెళ్లి నా చావుకి వచ్చినట్టుంది. మధ్యలో నేనేం చేయగలను?"

"అది నేను చెప్తాను లేరా. మా వూరి కుర్రాడితో నీకో బ్లాంక్ చెక్కు పంపిస్తున్నాను. కాస్సేపటిలో నీ దగ్గరకు వస్తాడు. నువ్వా చెక్కు పట్టుకెళ్లి ఆ దోసలదాని.... సర్లేరా... పెసరట్ల దాని మొహాన్న కొట్టు. అలాగే అంటూ ఆ చెక్కు ఆ పళాన ఇచ్చేయడం కాదు. మా బాబాయ్‌ని వదలడానికి ఎంతుచ్చుకుంటావ్ అని అడిగి, ఆ అంకె వేసి మరీ ఇయ్యి. మరీ ఎక్కువ ఇవ్వకు. బేరమాడు. ఇలాటి అలగా జనానికి ఓ వంద మొహానా పడేసినా చాలు..." అని మాంకాళి అత్తయ్య చెబుతూండగానే

"... అత్తయ్యా, ఈ స్కీము బాగాలేదు. సినిమాల్లో ఈ సీను వచ్చినప్పుడల్లా ప్రేక్షకుల సింపతీ ఆ అమ్మాయి మీదే ఉంటుంది. ఆ అమ్మాయి 'నా ప్రేమను తూచగలిగే త్రాసు ఇంకా చేయబడలేదు. చెక్కు ఇంకా రాయబడలేదు' లాటి డైలాగులు కొట్టినప్పుడు ప్రేక్షకులు తెగ చప్పట్లు కొడతారు".

"ఒరేయ్, నువ్వు ప్రేక్షకుల నెవరినైనా

తీసుకువెళదామనుకుంటూ ఉంటే ఆ ఐడియా డ్రాప్ చేసుకో. మనకు కుటుంబ గౌరవం ముఖ్యం. ఇది ఎవరికీ తెలియడం నా కిష్టం లేదు..."

"నువ్వు అపార్థం చేసుకుంటున్నావ్ అత్తయ్యా.... నేను ఆడియన్స్‌ను తీసుకెళతాననటం లేదు. సినిమాల్లో అటువంటి సందర్భం గురించి చెబుతున్నాను. అలాటి సీన్లలో ఆ సదరు ప్రేమికురాలు డబ్బు పట్టుకొచ్చిన వాణ్ని క్రేన్‌షాట్‌లో పురుగుని చూసినట్టు చూసి..."

"...చూస్తే చూడనీయ్. నేనేం అనుకోనులే!" అత్తయ్య హామీ ఇచ్చింది.

"కానీ నేను అనుకోవచ్చుగా" అని అనంత్ అభ్యంతరం లేవనెత్తులోగానే అత్తయ్య వార్నింగ్ ఇచ్చేసింది. "నువ్వా చెక్కు దాని మొహాన్న తగలేసి పెళ్లి జరక్కుండా చేయకపోతే నేను నిన్ను పురుగున్నరగా చూస్తాను. జాగ్రత్త" అని ఫోన్ పెట్టేసింది అత్తయ్య.

***

రెండురోజులు పోయాక, ఇక వాయిదా వేయడం కుదరదని తేల్చుకున్నాక అనంత్ సుబ్బి ఇంటికి వెళ్లాడు. తలుపు తట్టేసరికి ఓ నలభై ఏళ్ల పైబడినావిడ తలుపు తీసింది. మొహం అందంగానే ఉన్నా మనిషి చాలా భారీగా ఉంది. అక్కడక్కడ నెరిసిన జుట్టు, కాస్త పల్చని చీర. అనంత్‌ను చూస్తూనే "వచ్చారా, రండి రండి" అంది.

ఘాటు ఘాటు డైలాగులు ఎదురుచూస్తున్న అనంత్ కాస్త ఆశ్చర్యపడుతూ "వచ్చేశా" అన్నాడు చెక్కు స్కీము వాళ్లకూ అలవాటేనేమో అనుకుంటూ.

"నా పేరే అచ్యుతశ్రీ. సుబ్బి మా మేనకోడలే. పాపం ఇప్పుడే కాస్త కునుకుపట్టింది. కాస్సేపు ఆగుతారా? రాత్రంతా జ్వరం వల్ల నిద్రలేదు" అందామె.

"పర్వాలేదు లెండి. కాసేపు ఆగుతాను" అన్నాడు అనంత్.

"పోనీ ఎలాగూ ఖాళీగా కూచున్నారు కదా. నా మోకాలు కాస్త చూడండి." అందామె చీర కాస్త పైకి లాగుతూ.

వీళ్లింటికి వచ్చిన వాళ్లందరూ ఈవిడ మోకాలు చూడడం ఆనవాయితీ యేమో అనుకుంటూ అనంత్ ఆ మోకాలి కేసి తదేకంగా చూశాడు. "మీ ఉద్దేశ్యం ఏమిటి?" అని ఆవిడ అడగగానే ఏదో ఒకటి చెప్పాలని "ఏముంది? బాగుంది" అన్నాడు మెచ్చుకోలుగా.

"ఇప్పుడు బాగానే ఉన్నట్టు కనబడుతుంది. రాత్రి పూట ఒకటే సలపరం. రెండు నెలలుగా అవస్థ. సూదులు గుచ్చినట్టు ఒకటే నొప్పి" అంది అచ్యుతశ్రీ.

దీనికి ఏం సమాధానం చెప్పాలో తెలియక సానుభూతి ప్రకటిన్తూ అనంత్ నోరు చప్పరించాడు. కానీ ఆవిడ తృప్తి పడ్డట్టు కనబడలేదు. "తమాషా ఏమిటంటే వారం రోజుల్నుంచి ఇక్కడ కూడా సేమ్ అదేరకం నొప్పి" అందామె చెయ్యి వెనక్కుపోనిస్తూ.

"ఎక్కడ?" అన్నాడు అనంత్ ఏపాటి ఉత్సాహమూ కనబరచకుండా. ఈ గోలంతా ఎందుకు, బేరసారాలు లేకుండా ఫిక్సెడ్‌రేటు ఎంతో చెప్పేస్తే చెక్కు గిలికేసి పోవచ్చు కదాని అనంత్ తొందర.

"ఇక్కడే... వెన్నెముక క్రింద! కాస్త చూడండి. మీకే తెలుస్తుంది' అంటూ ఆవిడ లేచి నిలబడింది.

'ఎంత ఆనవాయితీ అయినా కొన్ని హద్దులుంటాయి. మోకాలు చూడమన్నారు పోన్లేనని చూశాను. బొత్తిగా...'' అనంత్ మాటలకోసం వెతుకుతున్నాడు. "... ఎక్కడ పడితే అక్కడ చూడమంటే నేను చూడను." అన్నాడు మొహం మాడ్చుకుంటూ.

అచ్యుతశ్రీ కూడా మొహం మాడ్చుకుంది. "డాక్టరన్నాక పేషంటు బాధలన్నీ చూడాలి. అలా గిరి గీసుకుని కూచుంటే ఎలా?" అంది.

అనంత్‌కి కథ కాస్త అర్థమయింది. "ఛంపారు పొండి. నేను డాక్టర్నీ కాను, యాక్టర్నీ కాను".

ఆవిడా తెల్లబోయి అంతలోనే ఫెళ్లున నవ్వింది. "సుబ్బికి జ్వరంగా ఉంది కదాని నేను డాక్టరు కోసం కబురంపాను. మీరు వస్తే మీరే డాక్టరనుకున్నాను. పోనీ మోకాలు చూపించినప్పుడే నేను డాక్టర్నికానని చెప్పవచ్చుగా. గడుసుగా ఊరుకున్నారేం? చిలిపి'' అంటూ అనంత్ చేతి మీద చిన్నగా కొట్టింది కూడా.

ఈ అచ్యుతం వరస అనంత్‌కి అర్థం కాలేదు. కోప్పడేబదులు ఇలా మాట్లాడుతుందేమిటాని అనుమానం వచ్చింది. ఇలాటి టైములో చెక్కు ఆఫర్ చేస్తే సుబ్బి డైలాగుల మాట ఎలాగున్నా మరోరకమైన ఇబ్బంది వచ్చేట్లు ఉందని భయం వేసింది. "అబ్బే, అదేం కాదు, సుబ్బి గారితో పని ఉండి వచ్చాను లెండి. మళ్ళీ రేపు వస్తాను" అని ఇంటికి పరిగెట్టుకు పారిపోయి వచ్చేశాడు.

'వాళ్ల దగ్గర్నుంచి పారిపోగలను కానీ మాంకాళి అత్తయ్య దగ్గర్నుంచి పారిపోలేనుగా. కాస్సేపటిలో ఆమె దగ్గర్నుంచి ఫోన్ వస్తుంది. ఏం చెప్పాలా' అని అనంత్ అనుకుంటూండగానే రాంపండు వచ్చాడు. అతన్ని చూడగానే అనంత్‌కి గుర్తుకు వచ్చింది - ఈ సదరు సుబ్బిని రాంపండు కూడా గతంలో ప్రేమించాడని.

విషయం చెప్పి. " సమయానికి అచలపతి కూడా ఊళ్లో లేడురా. ఏదైనా మంచి అయిడియా చెప్పి బాబయ్యను దీంట్లోంచి బయపడేట్టు చెయ్యి" అన్నాడు.

రాంపండు చిరునవ్వు చిందించాడు - "అన్నిటికీ అచలపతి అక్కర్లేదురా! ఐడియా చెప్తాను కానీ దాని కాపీరైటు నా దగ్గరే ఉంచుకుంటున్నాను. మీ మాంకాళి అత్తయ్యకు చెప్పినప్పుడు 'ఇది రాంపండు ఐడియా' అని చెప్పి తీరాలి. లేకపోతే నా ఇంటలెక్చువల్ ప్రాపర్టీ రైట్స్‌కు భంగం కలుగుతుంది"

"తప్పకుండా చెప్తాను కానీ ముందా ఐడియా చెప్పి చావు" అన్నాడు అనంత్ విసుగ్గా.



"సింపుల్. ఇప్పటిదాకా అచ్యుతశ్రీ, కామేశం బాబయ్య కలవలేదు. వాళ్లిద్దరికీ ఓ భేటీ ఏర్పాటు చేయ్. సుబ్బి అందగత్తె కావచ్చు. మీ బాబాయ్‌ను ఆకర్షించవచ్చు. కానీ ఈ అచ్యుతశ్రీ - నాకు గుర్తుందిలే - బొత్తిగా దారుణంగా ఉంటుంది. అడ్డపడి తింటుంది. సిగ్గూ, ఎగ్గూ కాస్త తక్కువ. నువ్వే చూశావ్‌గా! కామేశం గారు ఈ అత్తయ్యను, ఆవిడ విధానాలను చూడగానే చికాకు పడతాడు. సుబ్బిని కట్టుకుంటే ఈ లెవెల్ మనుష్యులతో మసలవలసి వస్తుందని ఒక్కసారి జ్ఞానోదయం అవుతుంది. దెబ్బకి సుబ్బికి గుడ్‌బై చెప్తాడు" అని అమోఘమైన అయిడియా చెప్పాడు రాంపండు.

ఇంతలోనే అత్తయ్య నుండి ఫోన్ వచ్చింది. అనంత్ తన పర్యటన విషయాలను అతి క్లుప్తంగా చెబుతూ (అప్పటికే బోల్డన్ని అక్షింతలు పడ్డాయి) ఈ అచ్యుతశ్రీను భోజనానికి పిలిచే ప్లాను గురించి చాలా విశదంగా చెప్పాడు. చెబుతూ ఇది రాంపండు కొచ్చిన బ్రిలియంటు ఐడియా అని కూడా చెప్పి రాంపండుకి తన నిజాయితీని నిరూపించుకున్నాడు. మాంకాళి అత్తయ్య 'సరే, అలా కూడా చూద్దాం. గత ముప్ఫయేళ్లుగా ఈ కామేశం గాడి ఎఫైయిర్స్ మీద బోల్డంత ఖర్చయింది. చెక్కు ఇంకా ఇవ్వలేదంటున్నావు కాబట్టి ఈసారి ఖర్చు మిగిలినా మిగిలినట్టే!" అంటూ ఫోన్ పెట్టేసింది.

రాంపండు చాలా సంతోషించాడు. "మీ మాంకాళి అత్తయ్య తిట్టకుండా సరేనందంటే ఇది చాలా గొప్ప అయిడియాయే నన్నమాట. పేటెంటు చేయించుకోవాలి. త్వరలోనే నా బుర్ర గట్టిదని గ్రహించి మీ అత్తయ్య నాకో మంచి ఉద్యోగం చూసి పెడుతుందేమో!" అంటూ గాలిమేడలకు పునాదులు తవ్వనారంభించాడు.

మాంకాళి అత్తయ్య దగ్గర్నుంచి గ్రీన్ సిగ్నలు వచ్చేసింది కాబట్టి పనులు చకచక అయిపోయాయి. అనంత్ సుబ్బి ఇంటికి వెళ్లి అచ్యుతశ్రీని భోజనానికి ఆహ్వానించాడు. 'సుబ్బి లేకుండా నేనొక్కత్తినీ రావడం ఏమిటి? పైగా మీరు నాకు బొత్తిగా తెలియదు కూడా" అంటూనే "అయితే మీ ఇంటికి ఎన్ని గంటలకు రమ్మంటారు?" అనేసింది. కామేశం బాబాయ్ కూడా "అసలే సుబ్బికి ఒంట్లో బాగాలేదన్చెప్పి నా మనసు బాగాలేదురా, ఇప్పుడీ విందు భోజనాలేమిటి?" అంటూనే "సరే, వస్తానులే. గుత్తొంకాయ కూర స్పెషల్‌గా చేయించు" అంటూ ఆర్డరేశాడు.

అచ్యుతశ్రీ వచ్చేసరికి రాత్రి ఎనిమిదయింది. "అప్పుడే భోజనం వద్దు. నా స్టమక్ లైనింగ్ కాస్త వీక్. ముందు ఏమైనా డ్రింక్స్ ఉంటే తీసుకుని, ఆ తర్వాత అన్నం సంగతి చూద్దాం" అంది. 'కామేశం బాబాయ్ డైలాగులే నువ్వూ కాపీ కొడుతున్నావా తల్లీ, నీకివాళ డిన్నర్ దగ్గర మంచి కంపెనీయే దొరుకుతుందిలే' అనుకుంటూ డ్రింక్స్ ఏర్పాటు చేశాడు అనంత్. ఇంకో పావుగంటకు కామేశం బాబాయ్ వచ్చాడు. డైనింగ్ రూమ్‌లోకి ప్రవేశిస్తూనే అచ్యుతశ్రీని చూసి కొయ్యబారిపోయాడు.

కాస్సేపటికి తేరుకుని "అచ్చమ్మా! నువ్వు ఇంకా ఉన్నావా? ఎక్కడికి వెళ్లిపోయావ్ ఇన్నాళ్లూ? నీకు పెళ్లయిపోయిందన్నారే! పిల్లలా?" అంటూ ప్రశ్నలు కురిపించాడు.

కొద్దిసేపటిలోనే విషయాలన్నీ బయట పడ్డాయి. ఈ అచ్యుతశ్రీ వేరెవరో కాదు, కామేశం బాబాయ్ యవ్వనంలో అత్యంత గాఢంగా ప్రేమించి, గుళ్లో పెళ్లి చేసుకోవడానికి కూడా సిద్ధపడ్డ రికార్డింగు డాన్సర్ అచ్చమ్మే! ఆ పెళ్లి ఎలాగైనా చెడగొట్టాలని మాంకాళి అత్తయ్య అచ్చమ్మ వద్దకు వచ్చి బోల్డంత డబ్బిచ్చింది. (చిన్నతనం, ప్రేమ విలువ గుర్తించలేక వెధవ డబ్బుకి లొంగిపోయాను' అంటోంది అచ్చుతశ్రీ ఇప్పుడు, దెబ్బకి అచ్చమ్మ ఊళ్లోంచి మాయమయిపోయింది. ఆమె వేరెవర్నో కట్టుకుందని అబద్ధం చెప్పి మాంకాళి అత్తయ్య కామేశం బాబాయ్ మనసు మార్చేసింది. ఇన్నాళ్లకు మళ్లీ వాళ్లు ఇలా తారసిల్లారు.

జీర్ణశత్రుల గురించి ఒకరినొకరు పరామర్శించుకుంటూండగానే తమ మధ్య ఒకప్పుడు ఉన్న గాఢమైన ప్రేమ ఇంకా సజీవంగానే ఉందని ఇద్దరూ తేల్చుకున్నారు. సుబ్బిని మనస్సులోంచి తుడిచేసి, అచ్చమ్మను పెళ్లాడతానన్నాడు కామేశం బాబాయ్! అంతకంటే భాగ్యమా అంది అచ్చమ్మ.

తన కొత్త నిర్ణయం గురించి కామేశం బాబాయ్ మాంకాళి అత్తయ్యకు ఎప్పుడు చెప్పాడో ఏమో, పొద్దునే మాంకాళి అత్తయ్య అనంత్‌కు ఫోన్ చేసింది. "నేనెప్పుడో కష్టపడి వదుల్చుకున్న ఆ రికార్డింగు డాన్సర్‌ను ఇంటికి భోజనానికి పిలిచి కామేశానికి పరిచయం చేయమని ఎవడ్రా నీకు చెప్పింది? చెక్కు మొహాన పడేసి పెసరట్లదాన్ని వదల్చుకోరా అని చెబితే నువ్వు వినకుండా మళ్లీ అచ్చమ్మను సీన్లోకి లాక్కొస్తావా? అది జలగ. ఆ రోజుల్లోనే నన్ను ముప్పుతిప్పలు పెట్టింది. ఇప్పుడు వీడు బిర్రబిగిశాడు. ఇన్నేళ్లుగా నేను పడ్డ కష్టమంతా వేస్టయింది. ఎవడ్రా నీకి ఐడియా ఇచ్చింది?" అంటూఅత్తయ్య అరవ నారంభించింది.

"రాంపండు అని మా ఫ్రెండు... నువ్వు చూసే వుంటావ్.... వాడే ఇది బ్రిలియెంటు అయిడియా అని చెబితేనూ.." అంటూ అనంత్ నానుస్తుండగానే "వాడూ, వాడి అయిడియానూ. రాంపండో, జాంపండో వాడి తాట తీయకపోతే నన్నడుగు. ఇప్పుడే కార్లో బయలుదేరి వస్తున్నాను. వాడు కనబడితే వాణ్ని, కనపడకపోతే నిన్ను కైమా చేయిస్తాను. ఉండు" అని గర్జిస్తూ అత్తయ్య ఫోన్ పెట్టేసింది.

ఫోన్ పెట్టగానే అనంత్ రాంపండు కోసం పరిగెట్టాడు. అత్తయ్య సంగతి తెలుసుకాబట్టి ఆ కైమా ఏదో రాంపండునే చేస్తే మంచిదని అతని అభిప్రాయం.

-ఎమ్బీయస్ ప్రసాద్

(పి.జి. ఉడ్‌హవుస్ రాసిన "ఇండియన్ సమ్మర్ ఆఫ్ యాన్ అంకుల్" అనే కథ ఆధారంగా)




బాపురమణీయం
Bapu Ramaneeyam
బుడుగు
మాటల్లో
ఓ కథ...
పెరట్లో_ అసలు నిజెంగా ఆపాప నిద్దర పోటంలేదు! ఉత్తినే కళ్లు మూసుకుంది
మరి వాళ్లమ్మకి తెలీదు కదా!
పడుకుంది కదా అని ఇంట్లో కెళ్లింది
పాపాయి కోపం ఖద.
- నే చెప్తే రాసిపెట్టినవాడు నండూరి రామమోహన రావు
అమ్మ వెళ్లగానే దొంగపాప కళ్లు తెరిచి నవ్వేసింది - మరి వాళ్ల రాధ చూస్తేగా! (రాధంటే అమ్మతే)
మరి పాపాయి నవ్వితే అమ్మ అందరూ ముద్దెట్టుకోవాలిగా! మరి పాపని ఎవరూ చూస్తే - అందుకు వాడికోపం వచ్చింది
రాము మరి! ఇంతలోకి వాళ్లన్న వచ్చి ఇలా గిల్లి వెళ్ళపోయాడు ముద్దు కూడా అడగలేదు మరి!
మరి కోపం వస్తే చెప్పాలిగా! అందుకు వాడు కేరు కేరు మనీ యాయా అని ఘట్టిగా చాలా సేపు చెప్పాడు
ఏం_ అప్పుడేమో ఓ బంగారు పిచిక పాపని చూసింది
కిచ్ కిచ్ కిచా కిచ్?
అంటే తెలుగు అర్థం ఎందుకేడుస్తావ్ పాపా! అని-
మాఉంగావా_ పాట ఏ ఆఆఆ!!
తెలుగులో:- ఏడుపు కాదూ- ఖోపం! అమ్మ నాన్న నన్ను ముద్దెట్టుకోకుంటే నేను రేచినా - అందుకనీ —


కిచ్ కీచి కిచ్చి క్వేవా!
"ఈ మనుషులంతా ఇంతే—
నిజెం - మరేం - నువు నాతో
మాయింటికి వచ్చెయ్ - ఏం!"
అఊ దాదా!
అంటే: "మాయిల్లెక్కడుం మరి?"
కీచ్ కీచ్ చ్ చ్
కికీ చ్ చ్
ట్వీట్ ట్వీట్
ఎఏ దా
ఆఆ దా!
అదుగో - ఆ కొండ లేదూ - అక్కడ చెరువుందా! అక్కడ చింతచెట్టుంది! దాని మీద!
చెట్టుమీద ఎలా వుంటారమ్మా!
చ్ చ్చీ చీ కీ క్చ్ క్చ్
టచీ చిక్ ట్వీట్వీక్
మా యిల్లు బలే వుంటుందిలే! అడుగు నించి లోపల కెలా దూరి పోవాలి. అక్కడుంచకొం వెచ్చగా పడుకోవచ్చు. చెరువు గట్టు మీద ఆడుకోవచ్చు
క్వా!
వ్వావ్వా ఆ!
వస్తావా మరి!
ఓ! వచ్చేస్తా!
కవ కిచ్
కీచ్ కీ
అయితే నేను ఇంకో పిచికని తీసుకొస్తా - ఇద్దరం నిన్ను తీసుకు వెడతాం - ఏం! (అంది పిచిక)
ఇంతలోకే అమ్మవచ్చి పాపనిలా ఎత్తేసుకుని ముద్దెట్టేసుకుంది
నా బంగారు తండ్రే! ఏడవకమ్మా
డుంగ డుంగా కీఊ
ఎవడేంటి బాబు - హు (ఇది కోపం) ఇప్పుడె రావటం! (అంటున్నమాట పాప)
వాళ్లమ్మ ఇలా ముద్దెట్టేసుకుని అప్పుడేమో పాలిచ్చింది
క్వైకిచ్ క్వా!
(వస్తావా పాపా
వచ్చునెళ్లిపోదాం!)
డుంగా దా ఆఁ
ఆంవమా
డుంగా డుంగా
డుంగా
పాప అన్న దానికర్థం:
నేను రాను పోవాయ్. మా అమ్మదగ్గిరే నాకు బాంటుంది. నేను రాను రాను రాను




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు
నటుడు

**రావికొండలరావు**

రాసిన వ్యాసమిది



# షూటింగ్‌లో టింగ టింగ్‌లు

ఒక చిన్న నటుడికి కొంతకాలం క్రితం - షూటింగ్ వచ్చింది. ఆ సినిమా పేరు "బృందావనం". చందమామా విజయా వారిది. ఆ చిన్ననటుడి పేరు ప్రకాష్. ఒకసారి వేశాడు. ఆ వేషం మళ్లీ రావడంతో అతనికి షూటింగ్ వచ్చింది. ప్రొడక్షన్ వాళ్లు అతన్ని కాంటాక్ట్ చేశారు. అతను ఇంట్లో లేడు. - అంటే రూములో లేడు. మర్నాడు తిరుపతి బయల్దేరాలి - షూటింగ్ అక్కడ. "రాత్రికి వస్తాడు. మీరు లెటర్ రాసి తలుపుకింద నుంచి తోసేయండి" అని పక్కవాళ్లు చెప్పారు. ఆమాట ప్రొడక్షన్ వాళ్లు డైరక్టోరియల్ డిపార్ట్‌మెంట్‌కి విన్నవించారు. "అయితే ఓ లెటర్రాసి పంపేయండి. రేపు అతను బయల్దేరాలి " అన్నారు దర్శక శాఖ వారు. కాని ఓ చిక్కొచ్చింది. ఆ ప్రకాష్ అనే ఉప వేషధారికి ఇంగ్లీషు రాదనీ, తెలుగులోనే సుబ్బరంగా ఈ లేఖ రాయమనీ ప్రొడక్షన్ వారు చెప్పగా, దర్శక శాఖలో కొత్తగా చేరిన ఒక అబ్బాయికి (పేరు చెబితే అతను బాధపడతాడమో - అయినా ఇది సరదాగా తీసుకోవలసిందే గనక చెప్పొచ్చు) పేరు గోపాల్రావు - చెప్పారు.

కంపెనీ లెటర్ హెడ్‌మీద రాసి, అతన్నే తీసుకెళ్లి ఆ రూము తలుపుకింద నుంచి లోపలికి తోసేయమన్నారు. తెలుగులోనే రాయాలన్నారు. గోపాల్రావు లెటర్ హెడ్ పట్టుకుని కూచుని, గంట గంటన్నర సేపు తెలుగు భాషతో కుస్తీ పట్టి, ఎలాగైతేనేం లెటర్ రాసి తీసుకెళ్లి తలుపు సందులోంచి నెట్టాడు. మర్నాడు ఉదయం - ప్రకాష్ అనే ఆ చిన్ననటుడు ఆ లేఖ తెచ్చి అందరికీ చూపించాడు. అందులో ఇలా ఉంది.

**చందమామ విజయా కంబైన్స్**
**విరేచన చిత్రాల నిర్మాతలు**
**వాహినీ స్టూడియోలు, మదరాసు -26.**
**శ్రీ ప్రకాష్ గారికి,**

**సహాయ దర్శకుడినైన నేను గోపాలరావు తెలియజేయుచున్నాను. ఆర్యా! రేపు తమకు కాల్పులు గలవు. మన చిత్రము యొక్క కాల్పులు తిరుపతిలో జరుగును. కాల్పులలో మొదటి దెబ్బ మీదే. అందువలన రాత్రికే బయల్దేరవలెను. కాల్పులు రెండు రోజులు జరిగిన తర్వాత మీరు తిరిగి రాగలరు. ఈ లేఖ అందిన వెంటనే మా కార్యాలయమునకు విచ్చేసి ఖర్చులు అందుకొన గలరు.**

**ఇట్లు,**
**శిక్షణలో వున్న సహాయ దర్శకుడు**
**జి.గోపాలరావు**

ఈ లేఖ చూసి అందరూ ఒకటే నవ్వు. గోపాలరావు "విరేచన చిత్రాల నిర్మాతలు" అన్నది లెటర్ హెడ్ మీద వున్న మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్‌కి తెలుగు అన్నమాట! అలాగే షూటింగ్ అన్నదానికి 'కాల్పులు' అన్నాడు. "మొదటి దెబ్బ మీదే" అంటే ఫస్ట్ షాటులోనే మీరుంటారనిట! ఆలోచించి ఆలోచించి సత్యానువాదం (ట్రూ ట్రాన్స్‌లేషన్) చేసిన గోపాలరావును చూసి నవ్వాలో ఏడవాలో తెలీలేదు. దీనిమీద వచ్చిన ఆలోచనతో, షూటింగ్‌లో వచ్చే ఇంగ్లీషు పదాలకు తెలుగు పడితే ఎలా వుంటుంది?

| | | |
|---|---|---|
| **సైలెన్స్** | : | **నిశ్శబ్దము** |
| **ఆల్‌లైట్స్** | : | **అన్ని దీపములూ** |
| **రెడీ ఫర్ టేక్** | : | **తీతకు సిద్ధము** |
| **క్లాప్** | : | **చప్పట్లు** |
| **యాక్షన్** | : | **నటించు!** |
| **కట్** | : | **కోయుము!** |
| **క్లోజ్‌షాట్** | : | **మూతదెబ్బ** |
| **లాంగ్ షాట్** | : | **దూరపు దెబ్బ** |
| **మిడ్ షాట్** | : | **మధ్య దెబ్బ** |
| **క్రేన్ షాట్** | : | **కొంగ దెబ్బ** |
| **ట్రాలీషాట్** | : | **బండి దెబ్బ** |

ఇలా రాసుకుని తెలుగులోనే షూటింగ్ చేస్తే ఎలా వుంటుందో చూడాలనిపించింది.

***

ఒక సినిమా అవుడ్డోర్ షూటింగు. నెల్లూరు దగ్గర. నేనూ వేశాను అందులో. నా పాత్రకి (అంటే నాకే) మీసం వుంది. లంచ్ బ్రేక్ వరకూ షూటింగ్ చేసి, భోజనం చెయ్యమన్నారు. అప్పుడు మీసం తీసేసి, భోజనం కానిచ్చి 'రెడీ' అవమన్నంత వరకూ కూచున్నాం. అంతలో ఇంకో లొకేషన్‌కి పదండి పదండన్నారు. మీరు బయల్దేరండన్నారు నన్నూనూ. 'మీసం పెట్టుకోవాలే' అని నసిగాను. మేకప్ అసిస్టెంట్ మీసం క్లీన్ చేసి వెనకాలే వస్తానన్నాడు. ఈలోగా కార్లు బయల్దేరు తున్నాయి ఎక్కండంటే ఎక్కండన్నారు. ఆ లొకేషన్‌లో అంతా అడావుడిగా వుంది. కారణం ఏమిటంటే హీరోయిన్ మూడు గంటలకి వెళ్ళి

పోవాలిట! ఆమె కాంబినేషన్‌లో వున్న సీను తియ్యాలి. ఆ సీన్‌లో నేనూ వున్నాను. ఓ పక్క నుంచి జనం. ఇంకో పక్క నుంచి



ఎండ తగ్గుట, హెచ్చుట. ఈ టెన్షన్‌లకి మించిన టెన్షను హీరోయిన్‌ని పంపాలి! డైరెక్టరు రెడీ రెడీ అని అరుస్తున్నారు. "డైలాగులు చూసుకోండి సార్, ఏదో ఒకటి చెప్పండి... తర్వాత చూసుకుందాం... రడీ - "రండీ" అన్నాడాయన రడీ మధ్య సున్నపెట్టి నావేపు చూసి. "నా... మీసం..." అని గొణిగాను. "ఏమైంది మీసం?... ఏయ్... ఎవరయ్యా మీసం?" అని అరిచాడు డైరక్టరు. "మీసం అసిస్టెంటు దగ్గరుంది. అతను వెనకాల జీపులో వస్తున్నానన్నాడు... రాలేదు మరి" అని ఈసారి సణిగాను. "పర్వాలేదు. మీసం గురించి ఆలోచించకండి.... రండి... డైలాగు చెప్పండి" అదెలా? అంతకుముందున్న సీన్లలో మీసం వుండీ, ఈ సీన్లో లేకపోతే?... మొహానికి చెయ్యి అడ్డం పెట్టుకుని, యాక్షన్లో ఇరికించేస్తూ డైలాగు చెబుతూ వుంటే, డైరెక్టరు గారు మండి పడ్డారు. "ఎందుకుసార్ మీకా బాధ? మీసం లేకపోతే ఏమైంది? ప్రజలు మీ మీసం కోసమే పట్టించుకుంటారా - రండి, రడీ" అంటున్నాడాయన. నేనింకా ఆశగా మేకప్ అస్సిటెంటు వస్తున్న జీపుకోసం చూస్తున్నాను. "రెడీ... షాట్ రెడీ.... రండి కొండలరావుగారూ! ఎవరు చూస్తారు?"

అంతే! నేను అలాగే వెళ్లి మీస రహితుడినై నటించేశాను. అయిపోయింది, హీరోయిన్ వెళ్లి పోయింది! "ఎవరు చూస్తారు?" అని డైరక్టరన్నట్టే అయింది - ఆ సినిమా మరి, ఎవరూ చూడలేదు!

నాకు ప్రాక్టికల్ జోకులు సరదా. అని చెప్పుకుంటే నా గొప్పనేను చెప్పుకున్నట్టువుతుందా? చెప్పుకోక పోతే నా ప్రజ్ఞ నాలోనే ఇరుక్కుపోయి ఊపిరి స్తంభింప జేసుకోదా? అని గిరీశం పడ్డ అవస్థలో పడుతూ వుంటాను. ఐనా, తెగించాలి, మొహమాట పడకూడదు.

విశాఖపట్నంలో ఆ మధ్య మిత్రులతో స్టీల్ ప్లాంట్‌కి వెళ్లాం. ఆ కబుర్లూ ఈ కబుర్లూ



చెప్పుకుని బయల్దేరే ముందు, అటూ ఇటూ చూసి, అక్కడో చిన్న ముక్కవుంటే, వేళ్లతో లాగేసి జేబులో పెట్టుకుంటుందే - "అరెరె! ఏమిటిది? నో నో - తప్పు" అని మందలించారు మిత్రులు.

"మరేం లేదు, STEAL PLANT అన్నారు గదా అని..."

***

ఇలాంటి జోకులో, చతురోక్తులో ఎవరో ఒకరు చెప్పకపోతే ఎలా తెలుస్తాయి? - ఘటోత్కచుడు చెప్పినట్టు అవతల వాళ్లేనా చెప్పాలి - సొంతదారులేనా చెప్పుకోవాలి.

ఒక అవుడ్డోరు షూటింగ్‌లో ఓసాయంకాలం. గ్రామంలోని పెద్దాయన ఇంట్లో మా బస. అందరూ అంటే తోటినటులు -



స్నానాలు చేసి హాల్లో పేకాట మొదలు పెట్టారు. నేను ఆడను. పక్కనే కూచున్నాను. ప్రారంభంలో పేక పంచుతున్న పెద్దమనిషి - "సార్, కొండలరావు గారూ - మీరు ఆడతారా?" అని అడిగాడు.

"అబ్బే - నేను మగతారను"

***

మద్రాసు చేరిన కొత్తలో పనీ పాటా ఏమీ వుండేది కాదు. వేషాలు వెతుక్కోవడమా - స్క్రిప్టులో, కథలో రాసేయడమా - అనే ఆలోచనల్లోనే తెల్లారి పోయేది. అసిస్టెంట్ డైరెక్టరు ఉద్యోగం వున్నా, షూటింగ్ లేని రోజుల్లో ఖాళీ. పొట్టి ప్రసాదు, నేనూ పొద్దున్నే బయల్దేరి నుంగంబాకం నుంచి టీ నగర్ వరకు తిరిగేవాళ్లం. బస్సెక్కితే డబ్బులు దండగ. ఆ డబ్బుల్తో కాఫీలు తాగొచ్చు. బయటివాళ్లు అడిగితే, "మార్నింగ్ వాక్". నుంగంబాకం జంక్షన్‌లో పెద్ద తూము గట్టుండేది. దానిమీద కొంత సేపు కూచుని, తర్వాత నిలబడి కార్లలో వెళ్లే వాళ్లకీ వచ్చే వాళ్లకీ 'సాల్యూట్'లు చేస్తూ కాలక్షేపం. కొందరు వూరికే ఓసారి చెయ్యెత్తి నుదుటికి తగిలించుకునే వారు. మేమెవరమో ఎందుకు సాల్యూట్ చేస్తున్నామా వాళ్లకి తెలీదు. వాళ్లెవరో మాకు తెలీదు. ఓ రోజు ఒక పెద్దాయన కారాపి "సౌఖ్యమా?" అని అడిగాడు తమిళంలో. "ఓ" అన్నాం. "అప్పా అమ్మా సౌగ్యమా? అప్పా ఎంగే - ఇంగేదానా?" అని ఏదో అడిగేస్తున్నాడు. మాకు ఓ ముక్కా, అర ముక్కా తెలుసుగాని, తమిళం రాదు. అన్నింటికీ తల్లూపేశాం చిరు నవ్వుల్తో. ఆయన ఇంకా ఏదేదో మాట్లాడి, ఉపన్యసించి, ప్రసంగించి - బయల్దేరాడు. మాకు ఆ భాష అర్థం కాలేదు. ఆయన ఎందుకలా తెలిసినట్టు మాట్లాడాడో అదీ అర్థం కాలేదు. "నా ఉద్దేశం, మనం ప్రాక్టికల్‌గా జోక్ చేశాం గదా, అతనూ ప్రాక్టికల్ జోక్ చేశాడేమోరా" అన్నాను ప్రసాద్‌తో. ఏమైనా ఆ తర్వాత మళ్లీ ఆ సాల్యూట్‌ల విన్యాసాలు చెయ్యలేదు.

జులై 20 జరుక్‌శాస్త్రి వర్ధంతి సందర్భంగా

# పేరడీకి మారుపేరు జరుక్ శాస్త్రి




హాస్యప్రక్రియలలో క్లిష్టమైనది పేరడీ. మూలంలోని అపహాస్యం చేయదగ్గ ఒక గుణాన్ని వెతికి పట్టుకుని, దాన్ని ఉత్ప్రేక్షించి, పాఠకుడికి ఒరిజినల్‌ను గుర్తు చేసేట్లా రాయగలగాలి. అప్పటిదాకా ఒరిజనల్‌ను ఆ కోణంలో చూడని పాఠకుడి చేత 'అవును, ఇది టూమచ్‌గా ఉంది. దీన్ని వెక్కిరించ వచ్చు' అనిపించి అతని ఆమోదాన్ని పొందగలగాలి. కార్టూనిస్టు ఒక నాయకుడికి మొహంలోని ఏ భాగాన్ని హైలెట్ చేసి కారికేచర్ గీయాలా అని తాపత్రయ పడినట్లు, ఒక మిమిక్రీ ఆర్టిస్టు ఒక హీరో గొంతులో ప్రత్యేకంగా కనిపించే జాడను పసిగట్టాలని వెతికినట్లు, పేరడీ రచయిత కూడా కనబడ్డ ప్రతీ గొప్ప రచననూ చదువుతూ, దానిలో తనకు కావాల్సిన ప్రత్యేక గుణం గురించి వెతుకుతూ ఉండాలి. అందుకే పేరడీ రచయితలు అంత తక్కువ మంది ఉన్నారు.

వారిలో అగ్రగణ్యుడు - **జరుక్‌శాస్త్రిగా** పేరుపొందిన జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి

ఆయన పేరడీలు కొన్ని -

### శ్రీశ్రీ రాసిన 'నవకవిత'

ఘూటెక్కిన గంధక ధూమం
పోటెత్తిన సప్త సముద్రాల్
రగులు కొనే రాక్షసి బొగ్గు
బుగులు కొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం
చెలరేగిన జన సమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి

కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పెనునిద్దర వదిలించేదీ
మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ
కావాలోయ్ నవ కవనానికి

### దానికి పేరడీ - 'సరదాపాట'

నడి నిశిలో తీతువు కూతా
పడిపోయిన బెబ్బులి వేటా
కర్రెక్కిన నల్లి నెత్తురూ
జుర్రేసిన వుల్లి కారమూ
చించేశిన కాలెండర్ షీట్
నపుంసకుడి థాట్ డెవలప్మెంట్
సామానోయ్ సరదాపాటకు



త్రుళ్ళనిదీ కుళ్ళనిదీనీ
మళ్లనదీ వెళ్ళనదీనీ
చచ్చేదీ లాభం లేనిది
ఈ జన్మకు పనికిరానిదీ
మనకెప్పుడు కలిసిరానిది
సామానోయ్ సరదాపాటకు

### మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'శంఖనాదం'

"పలికింది పలికింది పరపార వరతీర
పర్జన్య దుర్జేయ వాజ్రేయ శంఖం
పరిభూత నరపుంఖ పునరుద్యమాంకం, చిరనిరాతంకం
శంఖం శంఖం పలికింది పలికింది"




### దానికి పేరడీ కష్ + కష్

పలికింది శంఖం పలికింది ఖంఖం
పరపార వరతీర పర్జన్య గర్జన్య
దుర్జన్య వజ్రేయ వాజ్రేయ శంఖం
పలికింది శంఖం
పలికింది పలికింది పలికింది పలికింది.....
కర్జన్య ఖర్జన్య గర్జన్య శంఖం
చర్జన్య ఛర్జన్య జర్జన్య శంఖం
ఝుర్జన్య శంఖం

దేవులపల్లి కృష్ణశాస్త్రి "కాలమే...."

తొలి వియోగిని నేనె
తొలి ప్రేయసిని నేనె
ఆ నాటి కీనాటి
కేను నీ దాననే

పేరడీ

తులసి మొక్కను నేనె
తురక వేపను నేనె
ఆ నాటికీ నాటి
కేను మృత్కణమేను

శ్రీశ్రీ జయభేరి

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!
నేను సైతం
విశ్వసృష్టికి
అశ్రువొక్కటి ధారపోశాను

పేరడీ

నేను సైతం
కిళ్లీ కొట్లో
పాత బాకీ లెగరగొట్టాను
నేను సైతం
సంఖ్యనొక్కటి
వృద్ధిచేశాను

బుక్కులు

ప్రపంచ మొక పద్మవ్యూహం
కవిత్వమొక తీరనిదాహం

పేరడీ

ప్రపంచమొక సర్కస్‌డేరా
కవిత్వమొక వర్కర్ బూరా

దేశచరిత్రలు

తాజ్‌మహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీలెవ్వరు?

పేరడీ

పిరదౌసీ వ్రాసేటప్పుడు
తగలేసిన బీడీలెన్నో

అద్వైతం

"ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపుటంచులు చూస్తాం
ఆనందపు లోతులు తీస్తాం"

"వాసంత సమీరం నీవై
హేమంత తుషారం నేనై

"హసనానికి రాణివినీవై
వ్యసనానికి బానిసనేనై



దానికి పేరడీ - విశిష్టాద్వైతం

"ఆనందం అంబరమైతే
అనురాగం బంభరమైతే
అనురాగం రెక్కలు చూస్తాం
ఆనందం ముక్కలు చేస్తాం"

C, a, t - కేటువి నీవై
R, a, t - రేటుని నేనై
రాతగ్గ కవిత్వం నీవై
పోతగ్గ ప్రభుత్వం నేనై

1914 సెప్టెంబరు 7న బందరులో జన్మించిన రుక్మిణీనాథ శాస్త్రి స్వయంకృషితో సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యాన్ని గడించి, 'కృష్ణాపత్రిక' ముట్నూరి కృష్ణారావుగారి దర్బారులో ప్రముఖ స్థానం సంపాదించుకున్నారు. 'వాణి'లో, 'ఆంధ్రపత్రిక'లో సహాయ సంపాదకుడుగా పనిచేస్తూ కవిగా, వికట కవిగా కూడా పేరు పొందారు. ఆయన రాసిన కథలు 'శరత్ పూర్ణిమ' అనే పేరుతో సంపుటంగా వెలువడ్డాయి. 1968 జులై 20న హృద్రోగంతో కన్ను మూశారు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు



నిశాపతి - హైదరాబాద్

(1) ప్ర॥ దున్న గలిగిన వాడిదే భూమి... కామెంట్

జ॥ మరి ఎద్దు కలిగిన వాడేం పాపం చేశాడు!?

బి.శ్రీనివాసాచారి - హైదరాబాద్

(2) ప్ర॥ బ్యాంకు మేనేజర్ బిత్తరపోయేదెప్పుడు?

జ॥ ఓ గృహిణి వచ్చి 'ఆవకాయ పెట్టుకోవడానికి లోన్ ఇస్తారా' అని అన్నప్పుడు

పి.ప్రదీప్‌సాయి - హైదరాబాద్

(3) ప్ర॥ మనిషికి కంప్యూటర్‌కి ఉన్న తేడా!?

జ॥ సెన్సుకి సైన్సుకి ఉన్న తేడాయే

## ఈ రూటే వేరు



Swimming Fruits = ఈతపళ్లు

-బి.రామ్‌శంకర్, విశాఖపట్నం

Truth God Moon= సత్యహరిశ్చంద్ర

-డి.రామమూర్తి, విజయవాడ

Sum Put = లెక్కపెట్టు

-డి.సతీష్‌కుమార్, జగిత్యాల



## పేరు - రిపేరు




అడవి రాముడు - అల్లరి రాముడు - తాతామనవడు

-బి.రామ్‌శంకర్, విశాఖపట్నం

ఓ చినదాన - నీతో - ప్రేమంటే - అల్లరి

అమృత - నీ ప్రేమకై - లాహిరి లాహిరి లాహిరిలో - నిన్నే చేరుకుంటా

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ

## చిలిపిలిపి



A మ్మిగ 100= ఎమ్మిగనూరు

-మామిడి శ్రీలత, రేపల్లె

Way 2 రి = వేటూరి

శ్రేష్ఠ, హైదరాబాద్

Camel Street Chain = ఒంటిపేట గొలుసు

-జెయసెయన్‌స్వామి, హైదరాబాద్

# డబుల్ రోల్




'కలరా' సోకిన వారెవరైనా ఈ గ్రామమున 'కలరా'!?

-డి.సతీష్‌కుమార్, జగిత్యాల

మీ 'సుమంత్' ఈ 'మంత్'లో ఒక్కరోజు కూడా కాలేజీకి రాలేదు.

-కె.శివరామకృష్ణప్రసాద్, మదనపల్లి

'ఆ వల'కు'ఆవల' ఏముందో చూడు.

-అమృత అండ్ అనూష, విశాఖపట్నం

# చిలిపి కవిత




చేసిందో రోజు మా ఆవిడ
ఓ చల్లని చిల్లి ఆవడ
తిన్నవెంటనే మొదలయింది కడుపులో గడబిడ
కోపంతో తిట్టేశాను ఛడామడా
అప్పట్నించీ ఆవిడకు, ఆవడకు
నేను మొయిన్‌టెయిన్ చేసే దూరం ఓ ఆమడ

- బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్

# పేరడీ పేరేడ్




జిలలాంటిది జగటైనది
పదవి పరువెన దారుల కోసం
బలిచేయకు
ఓట్లు తరిగి నీ పదవేమో నేలరాలిపోగా
సిగ్గుపడి అటులే దాని వదలివైతువా
ఓ.. ఓ... ఓ... పార్టి మార్చి గుర్తు చేర్చి
చిగురించనీయవా ॥జిల॥
అలవిమానినభిమానంతో అలమటించనేల
మర్యాదకు లొంగిపోయి కలువరించనేల
ఓ... ఓ... ఓ... నిర్లజ్జను జ్యోతిని చేకొని సాగిపో ॥జిల॥
కంపుగొట్టు కల్మషమందు పేడ పురుగులున్నటులే
మంత్రి పదవి మరుగున దాగి పవరున్నదిలే
ఏది తనంత తానై నీ దరికి రాదు
శోకించి సాధించాలి అదియే జారగుణం ॥జిల॥

('వెలుగునీడలు' లోని 'కలకానిది విలువైనది' పాటకు పేరడీగా....)

-ఎమ్.శ్రేష్ఠ,
హైదరాబాద్

# లలిత సంగీతం

## చిరునవ్వును పలికించే



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ చిరునవ్వును పలికించే స్వరకల్పనలెన్నెన్నో
హృదయాలను ఒలికించే మృదు చిత్రణలెన్నెన్నో

1. చ॥ శిలలాగా పడి వున్నా తెలవారని బ్రతుకైనా
అగుపించక ఎగసిపడే ఆ స్పందనలెన్నెన్నో

2. చ॥ ఆ మాటే విషమైనా ఆ మనిషే వెగటైనా
కసిమాటున సాగించే కరచాలన లెన్నెన్నో

3. చ॥ వికసించిన ప్రతి కుసుమం ప్రకటించదు తన హృదయం
అరుదైన 'సినారె'పై ఆరాధనలెన్నెన్నో

| | | |
|---|---|---|
| రచన | : | డా॥ సి.నారాయణరెడ్డి |
| గానం, సంగీతం | : | ఎం.చిత్తరంజన్ |
| రాగం | : | బేహాగ్, యమన్ కల్యాణ్‌ల మిశ్రమం |
| తాళం | : | చతురస్ర ఏక (కర్ణాటక సం॥) |
| | | -కహరువా: (హిందుస్తాని సం॥) |

**బేహాగ్:**

| | | |
|---|---|---|
| ఆరోహణ | : | స గ మ$^{1}$ ప ని$^{2}$ ద ని$^{2}$ స |
| అవరోహణ | : | స ని$^{2}$ ద ప మ$^{2}$ గ మ$^{1}$ గ రి స |

-షడ్జము, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలి నిషాదం, చతుశృతి దైవతం, కాకలి నిషాదం - ఆరోహణలోను,

కాకలి నిషాదం చతుశృతి దైవతం, పంచమం, ప్రతిమధ్యమం, అంతరగాంధారం, శుద్ధమధ్యమం, అంతరగాంధారం, చతుశృతి రిషభం -

అవరోహణలోను వుంటాయి. యీ రాగంలోని స్వరాలు.

ని$^{1}$ - కైశికి నిషాదం కూడా
యీరాగంలో వాడబడుతుంది.
మ$^{2}$ = శుద్ధమధ్యమం, మ$^{2}$ = ప్రతిమధ్యమం
ని$^{1}$ = కైశికి నిషాదం, ని$^{2}$ = కాకలినిషాదం

### యమన్ కల్యాణ్

| | | |
|---|---|---|
| ఆరోహణ | : | స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : | స ని ద ప మ గ రి స |

-షడ్జము, చతుశృతి రిషభం, అంతరగాంధారం, ప్రతి మధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కాకలి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

హిందుస్తాని సంగీతంలో కల్యాణ్ థాట్ (మేళకర్తరాగం - కర్ణాటక సంగీతంలోని 65వ మేళకర్త మేచ కల్యాణి (కల్యాణి)) రాగాన్నే యమన్ కల్యాణ్ అని, యమన్ అని వ్యవహరిస్తూంటారు. లలిత సంగీతంలో యీ రాగానికి శుద్ధమధ్యమాన్ని కూడా చేర్చి పాడడం పరిపాటి అయింది.

కొన్ని శతాబ్దాల నుండి ఉర్దూ, పారశీక భాషలలో రచింపబడుతున్న సుప్రసిద్ధ గేయ కవిత 'గజల్'. సరసమైన భావనతో, పదప్రయోగ చమత్కృతితో సాహితీ సౌరభాలను వెదజల్లే గజల్ ఉర్దూభాషకే వన్నె చేకూర్చిన ఒక విశిష్ట ప్రక్రియ. ప్రణయ భావనలే కాక, తాత్త్విక స్పర్శ కూడా కలిగి వుంటాయి కొన్ని గజళ్ళు. ఆ తత్త్వరచనలను 'నాత్' అని అంటారు.

ఈ రచనలోని పల్లవిని 'మత్లా' అని, చివరి చరణాన్ని 'మక్తా' అని అంటారు. చివరి చరణంలో కవి నామముద్ర ఉంటుంది. దీనిని 'తఖల్లుస్' అని అంటారు.

పల్లవికి చివర ఉన్న పదం ప్రతి చరణం చివర అంత్యప్రాసను రూపొందిస్తుంది. కొన్నిట్లో అంత్యప్రాసకు ముందు మరో ప్రాసపదం కూడా వుంటుంది. దీనికి 'రదీఫ్ ఖాఫియా' - అని పేరు. గజల్‌కు సంగీతం (బాణీ) కూర్చడంలో కూడా ఒక నియమం పాటించాల్సి వుంటుంది. పల్లవి లోని మొదటి పంక్తి యొక్క, లేక 2వ పంక్తి యొక్క బాణీని ప్రతి చరణంలోని చివరి పంక్తికి అన్వయించాలి. అదే గజల్ యొక్క ప్రత్యేకత. గీత్ (సాధారణ లలిత గీతం)కి గజల్‌కి గల తేడాకూడా అదే. తెలుగులో గజల్ ప్రక్రియను చేపట్టిన వారు కొద్దిమందే మనకు కనిపిస్తారు. దాశరథిగారు మీర్జాగాలిబ్ రచనలను తెలుగులో 'గాలిబ్ గీతాలు'గా అనువదించారు. గాలిబ్, బహదూర్ షా జఫర్, ఖుమార్ బారాబాంకి, ఫిరాక్, షకీల్ బదయూని, ఫైజ్ అహ్మద్ ఫైజ్, ఖతీల్ షిఫాయి మున్నగు సుప్రసిద్ధ కవులలో కొంతమంది రచించిన గజళ్ళకు పటేల్ అనంతయ్య తెలుగు

; స గ | మ ద ద ద | ; ద నీ ద నీ | పా, ద మ ద ప మ |
. స్వర | కె . ల్పన | . తె . న్నె . | నో . . . . . . |

గా గ ప | నీ ద ప నీ ద నీ నీ | నీ నీ సా నీ సా | దా నీ ద పా మా |
. హృద | యా . . . . . ల | ను ఒంటి తెం . | చే . . . . . |

దా నీ ద | ప మే మే మే | ; మే పా స దా | పా ద ప మా ప మ |
. మృదు | చి . త్ర ణ | . తె . న్నె . | నో . . . . . |

గా
. ॥ చరణమ్ము ॥

1.చ ॥ ; ; | ; ప ప | సా సా | ; నీ సా రి సా | నీ స ద నీ ; , |
. . | . శి ల | లా గా | . ప డి వు . | న్నా . . . . |

; గ ప | ద నీ నీ నీ | దా ద నీ స నీ | ద నీ ప దా ; , |
. తె ల | వా . ర ని | . బ్రతుకై . | నా . . . . . |

; ప నీ | స గ రి మ గ రి సా | ; నీ సా రి సా | నీ స ద నీ ; , |
. శి ల | లా . . . . గా . | . ప డి వు . | న్నా . . . . |

; గ ప | ద నీ నీ నీ | దా ద నీ స నీ | ద నీ ప దా ; , |
. తె ల | వా . ర ని | బ బ్రతుకై . | నా . . . . |

; నీ ద | ప మే మే మే | ; మే పా స దా | పా ద ప మా ప మ |
. తె ల | వా . ర ని | . బ్రతుకై . | నా . . . . |

గా
.
తరువాతి పంక్తి పల్లవిలోని మొదటి పంక్తివలె పాడాలి.

2చ ॥ ; ; | ; మే ప | స నీ | దా ద నీ స నీ | నీ ; | ; ప ద | సా రి నీ నీ ; |
. . | . ఆ . | మా టే | . విషమై . | నా . | . ఆ . | మ ని . షి . |

; ద నీ ప ద ప | పా, ద ప | మే రి మే | మే మే మా | ; మే పా స దా |
. వె గ టై . . | నా . . . | . ఆ . | మ ని షే | . వె గ టై . |

పా ద ప మా ప మ | గా
నా . . . . . | .

తరువాతి పంక్తి పల్లవిలోని మొదటి పంక్తివలె పాడాలి.
తరువాతి పంక్తి మొదటి చరణం లాగే పాడాలి.
3వ చరణం మొదటి చరణం లాగే పాడాలి.

నీ = కైశికి నిషాదం    మ = శుద్ధ మధ్యమం
నీ = కాకలి నిషాదం    మే = ప్రతి మధ్యమం



అనువాదం గావించారు. డా॥ సి.నారాయణరెడ్డిగారు తమ గజళ్ళతో ప్రణయానికి బదులుగా మానవీయ దృక్పథాన్ని, ప్రగతి శీలాన్ని ప్రవేశ పెట్టారు.

"పదం నాదంగా, భావం రాగంగా, అనుభూతి స్వరరీతిగా గుండెతో పలికించినవి" నారాయణరెడ్డిగారి యీ అత్యంత ప్రతిభావంతమైన 'తెలుగు గజళ్ళు'. వాటిలోని ఒక సుమధుర భావాకృతియే 'చిరునవ్వును పలికించే స్వర కల్పనలెన్నెన్నో' అంటూ రసిక జనహృదయాలలో రవళించే మృదుపద చిత్రగీతం. రెడ్డిగారి 'తఖల్లుస్' (నామముద్ర) 'సినారె'. బేహాగ్, యమన్ రాగాలనే మేళవించి నేను స్వరరచన గావించి ఆకాశవాణిలో గానం చేశాను యీ గజల్‌ను-

## డా॥ సి.నారాయణరెడ్డి

ఆధునికాంధ్ర సాహితీ సాగరాన్ని ఆపోశన పట్టిన అభినవ అగస్త్యుడైన శ్రీ నారాయణరెడ్డి గారిని గురించి చెప్పడమంటే ఆకసంలో వెలిగే అహస్కరుని దీపం వెలుగులో చూపడమే అవుతుంది. అయినా యీ శీర్షికలో పాటకు స్వరంతో పాటు రచయితను గురించి చెప్పడం అలవాటైంది గనుక నారాయణరెడ్డిగారిని గురించి నాలుగు మాటలు-

సాహిత్యంలో అత్యున్నత పీఠం 'జ్ఞానపీఠం'. దానిని అధిరోహించిన డా॥ సి.నారాయణరెడ్డి గారి పరిశోధన గ్రంథం "ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయమలు, ప్రయోగములు" సాహితీ విద్యార్థులకు పాఠ్య గ్రంథం, సామాన్యులకు సైతం ఆదరణీయ గ్రంథం. రెడ్డిగారు గొప్ప పరిశోధకులు, పాండితీకవిత్వాల సవ్యసాచి. నాగార్జున సాగరం, కర్పూర వసంతరాయలు, అజంతా సుందరి, వెన్నెలవాడ, నవ్వని పువ్వు మొ॥ అనేక గేయ నాటికలు ఆయన లేఖిని నుండి జాలువారినవి. సినిమా, ఆకాశవాణి, దూరదర్శన్‌ల కోసం ఆయన రచించిన గేయాలు అసంఖ్యాకాలు.



1954లో ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఇంటర్ కాలేజియేట్ కాంపెటిషన్స్‌లో లలిత సంగీతంలో నేను ప్రథమ బహుమతి పొందిన సందర్భంలో నాకు ఆయన పరిచయ భాగ్యం కలిగింది. ఆ తరువాత ఆయన నాకు 4 పాటలు వ్రాసి యిచ్చారు. వాటిలో రెండిటికి తొలిసారిగా బాణీ కూర్చి ఆకాశవాణిలో పాడి గాయకుడిగానే కాక స్వరకర్తగా అవతరించాను. ఆ పాటలు "ఏలా యీ మధుమాసము" (దర్బారి కానడ రాగం), "ఓహో నా కలువ కన్నెలారా" (సారంగరాగం) నేటికీ శ్రోతలకు జ్ఞాపకమున్న పాటలు. 1955లో తెలంగాణా రచయితల సంఘం వారికోత్సవాలలో రెడ్డిగారి "వెన్నెలవాడ" సంగీత నృత్యరూపకంగా (పాలగుమ్మి విశ్వనాథం గారి సంగీతం) ప్రదర్శించబడినప్పుడు అందులో పాటలు నేను కూడా పాడాను. 1958లో 'రామప్ప' సంగీత నాటికలో బాలమురళిగారు, కమలాచంద్రబాబు నటించి గానం చేశారు. పాలగుమ్మి వారి సంగీతంతో "రాలలో పలపూలు పూచిన రామమందిర లీల", "ఈ నల్లని రాలలో ఏ కన్నులు దాగెనో" వంటి మధురమైన పాటలు గల ఆ నాటిక ఆకాశవాణిలో ప్రసారమై శ్రోతల మన్నలను పొందింది. నారాయణరెడ్డి గారి ఆ నాటికను వివిధ భాషలలోకి అనువదించి జాతీయ కార్యక్రమం (National Programme) గా అన్ని ఆకాశవాణి కేంద్రాలలో ప్రసారం చేశారు. ఆ తరువాత రెడ్డిగారు రచించిన ఎన్నో సంగీత రూపకాలకు, గేయాలకు మంచాళ జగన్నాథరావు, ఉపద్రష్ట కృష్ణమూర్తి మొదలగు ఎందరో స్వరకర్తలు సంగీతం కూర్చారు. వారిలో నేనూ వున్నాను. 1975లో హైదరాబాద్‌లో ప్రపంచ తెలుగు మహాసభలు జరుగుతుండగా రెడ్డిగారు రూపొందించిన 'తరతరాల తెలుగు వెలుగు' రూపకం నా సంగీత సారథ్యంలో ఆకాశవాణిలో విశిష్ట కార్యక్రమంగా ప్రసారమైంది.

దేశంలో ఏ సంఘటన జరిగినా స్పందించే భావుక హృదయం రెడ్డిగారిది. 1965లో పాకిస్తాన్ యుద్ధం సందర్భంలో యునైటెడ్ నేషన్స్ సభలో పాకిస్తాన్ ప్రతినిధి భుట్టో "Indian Dogs" అని భారతీయులను దూషించాడు. వెంటనే రెడ్డిగారి "కుక్క మొరిగిందిరా పిచ్చి కుక్క మొరిగిందిరా" అంటూ గర్జించారు. ఆ పాట విశ్వనాథంగారి స్వరకల్పనలో ఆకాశవాణిలో ప్రసారమై ప్రశంసలందుకుంది. అదేవిధంగా ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలు సంభవించినప్పుడు నారాయణరెడ్డి గారి కలం సమైక్యవాణినే వినిపించింది. 1987లో 40 ఏళ్ళ స్వతంత్ర దినోత్సవ వేడుకల కోసం రెడ్డిగారు ఇక్బాల్ రచించిన 'సారే జహాఁ సే అచ్చా' గీతంలోని పల్లవిని యధాతథంగా గ్రహించి "విశ్వం కన్నువిప్పని నాడే వేదం పలికిన ధరణియిది - జగములు మెచ్చిన భగవద్గీతకు జన్మనిచ్చిన జనని యిది" అంటూ మరికొన్ని చరణాలను చేర్చిపాట వ్రాయగా నేను స్వరకల్పన చేసి బృంద గీతంగా పాడించాను. "ఈ ఏడాది పాటగా" ఆకాశవాణిలో ఒక సంవత్సరం పాటు ప్రసారమైంది. తరువాత దూరదర్శన్‌లో కూడా ఆ పాటను ప్రసారం చేశారు.

ఇలా ఎన్నో పాటలే కాక అనేక ఉద్గ్రంథాలు రచించిన శ్రీ నారాయణరెడ్డి గారి ప్రతిభను గ్రహించి అనేక పదవులు ఆయనను వరించాయి. ఉస్మానియా యూనివర్శిటీ తెలుగు శాఖ నుండి Open University ఉపాధ్యక్షులుగాను, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగాను, రాజ్యసభ సభ్యులు గాను, రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులుగాను ఆయన ప్రస్థానం సాగుతోంది. అనేక గౌరవ డాక్టరేట్లు, పద్మభూషణ్ బిరుదు, జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నారు. సాహితీ రంగంలో త్రివిక్రముడైన నారాయణరెడ్డిగారు ఆత్మీయతకు, ఆర్ద్రతకు అందివచ్చే అరచేతి ఆమలకం.

లలిత సంగీతానికి మొట్టమొదటి సారిగా నేను

రూపొందించిన 'లలిత సంగీతం డిప్లొమా కోర్సు" పాఠ్యప్రణాళిక (Syllabus)ను రెడ్డిగారు సునిశితంగా పరిశీలించి ఆమోదించారు. ఆ తరువాత తెలుగు విశ్వవిద్యాలయంలో ఆ కోర్సును ప్రవేశ పెట్టడానికి ఉపాధ్యక్షులు ఆచార్య గోపి గారు ఎంతో కృషి చేశారు. 28.10.2000నాడు ముఖ్యఅతిథిగా సహృదయంతో విచ్చేసిన నారాయణరెడ్డిగారి చేతులమీదుగా కోర్సు ప్రారంభించబడింది. ఆ విధంగా లలిత సంగీత విద్యాబోధనకు సంస్థాగతమైన స్థానాన్ని కల్పించిన నారాయణరెడ్డిగారికి, గోపిగారికి లలిత సంగీత కళాకారులందరమూ సదా ఋణపడివుంటాము.



## బేహాగ్, యమన్‌రాగాలు ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

### బేహాగ్

| | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. వరమొసగే వనమాలి | భక్తప్రహ్లాద | డా॥ బాలమురళీకృష్ణ | ఎస్.రాజేశ్వరరావు |
| 2. శ్రీదేవిని నీదు దేవేరిని | శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం | ఎస్.వరలక్ష్మి, పి.సుశీల | పెండ్యాల |

### యమన్

| | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. ఎవరివో నీవెవరివో | పునర్జన్మ | ఘంటసాల | టి.చలపతిరావు |
| 2. మనసున మల్లెల మాలలూగెనే | మల్లీశ్వరి | పి.భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 3. పెనుచీకటాయె లోకం | మాంగల్యబలం | ఘంటసాల, పి.సుశీల | మాస్టర్ వేణు |
| 4. పాలకడలిపై శేషతల్పమున | చెంచులక్ష్మి | పి.సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 5. సావిరహే తవదీనా | విప్రనారాయణ | పి.భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 6. చిగురులు వేసిన కలలన్నీ | పూలరంగడు | సుశీల, మోహన్‌రాజు | ఎస్.రాజేశ్వరరావు |
| 7. తిరుమల గిరివాసా | రహస్యం | ఘంటసాల | ఘంటసాల |
| 8. రావెరావే వయారి ఓ చెలి | కులదైవం | సుశీల, చిత్తరంజన్ | మాస్టర్ వేణు |
| 9. పయనించే ఓ చిలుకా | కులదైవం | ఘంటసాల | మాస్టర్ వేణు |
| 10. చెలికాడు నిన్నే రమ్మని పిలువ చేరరావేల | కులగోత్రాలు | ఘంటసాల,సుశీల | ఎస్.రాజేశ్వరరావు |




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్ధంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి **బాలూ** గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.

1. ఎలనాగ (ఏకవీర.... తోటలో నా రాజు)
ఎ) కోడెనాగు బి) స్త్రీ
సి) తాచుపాము డి) ఎరుపెక్కిన

2. పాటలాధర (ఏకవీర - తోటలో నా రాజు)
ఎ) ఎర్రని పెదాలు కలిగినది
బి) పాటపాడే పెదాలు కలిగినది
సి) ఆరోగ్యవంతమైన పెదవులు కలిగినది
డి) చురుకైన పెదవులు కలిగినది

3. తరువు (పూజాఫలము - నిన్నలేని అందమేదో)
ఎ) పూవు బి) లత
సి) శరీరము డి) చెట్టు

4. భాసుర కీర్తి (కంచుకోట - సరిలేరు)
ఎ) చిరకీర్తి బి) గొప్పదైన కీర్తి
సి) ప్రకాశించేకీర్తి డి) వ్యాపించే కీర్తి

5. నీటు (కంచుకోట... సరిలేరు)
ఎ) విలాసము బి) మధువు
సి) పరిశుభ్రము డి) గర్వము

6. వతంసుడు (కంచుకోట - సరిలేరు)
ఎ) రాజు బి) శ్రేష్ఠుడు
సి) జ్యేష్ఠుడు డి) కిరీటము ధరించిన వాడు

7. సైకతము (చెల్లెలి కాపురం... చరణ కింకిణులు)
ఎ) మంచు బి) లత
సి) శిల డి) ఇసుక

8. ప్రసవశరుడు (చెల్లెలికాపురం... చరణ కింకిణులు)
ఎ) పూలబాణము కలవాడు
బి) వాడియైన బాణము కలవాడు
సి) తిరిగిరాని బాణము కలవాడు
డి) పుట్టుకతోనే బాణము ధరించినవాడు

9. ఫేనము (విచిత్రదాంపత్యం... శ్రీ గౌరిశ్రీ గౌరియే)
ఎ) నీరు బి) ప్రవాహము
సి) నురుగు డి) రూపము

10. ధృతి (స్వాతికిరణం.... శ్రుతి నీవు గతి)
ఎ) ఛందస్సు బి) వెలుగు
సి) సంగీతము డి) భూమి

### జవాబులు

1) b 2) a 3) d
4) c 5) a 6) d
7) d 8) a 9) c
10) a

జులై 25న సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ 94వ జయంతి సందర్భంగా -

# స్వాతి తిరునాళ్ కీర్తనలను ప్రాచుర్యంలోకి తెచ్చిన సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్



1908 జులై 25న తంజావూరు సమీపం లోని సెమ్మంగుడిలో జన్మించిన శ్రీనివాస అయ్యర్ తన 31 వ యేట తిరువాన్కూరు మహారాజా వారికి ఆస్థాన విద్వాంసుడిగా నియమితులైనారు. 1941లో స్వాతి తిరునాళ్ కాలేజిలో సంగీత విభాగంలో చేరారు. ఈ కళాశాలలో చేరిన తరువాత ఆయన స్వాతి తిరునాళ్ కృతులను పరిశోధించి, పరిష్కరించి ప్రచురించారు. ఇది దక్షిణ భారత సంగీత ప్రపంచంలో మైలు రాయి అనదగిన పరిశోధనగా చెప్పుకుంటారు. ఈయన పరిశోధన తరువాతనే స్వాతి తిరునాళ్ కృతులను కచేరీలలో పాడటం ఎక్కువైంది. 1941 నుండి 1963 వరకు స్వాతి తిరునాళ్ కళాశాల ప్రధానా చార్యులుగా కొనసాగిన సెమ్మంగుడి వారు ఈ కాలంలోనే ఆకాశ వాణిలో మూడేళ్లపాటు సంగీత విభాగానికి చీఫ్ ప్రొడ్యూసర్‌గా కూడా పని చేశారు.

శ్రీనివాస అయ్యర్ తన 8వ ఏట 1916లో నారాయణస్వామి వద్ద సంగీత సాధన ప్రారంభించారు. అంతకుముందు చిన్ననాటనే తన తండ్రి గానం చేసే అష్టపదులను రాగయుక్తంగా పాడటం నేర్చుకున్నారాయన. ఆ తరువాత సుప్రసిద్ధ గోటు వాద్యనిపుణుడు సఖా రామారావు వద్ద శిష్యుడిగా చేరడంతో సెమ్మంగుడి వారి సంగీత శిక్షణ మంచి మలుపు తిరిగింది. ఆయనవద్ద రోజుకు పది గంటల పాటు సాధన చేసి సంగీతంలో పరిపూర్ణుడైనారు. తరువాత ఉమలాయపురం స్వామినాథయ్యర్ వద్ద చేరి త్యాగరాజ స్వాముల వారి కృతులు పాడటంలో శిక్షణ పొందారు. సెమ్మంగుడి వారి చివరి గురువు మహారాజపురం విశ్వనాథయ్యర్. 1926లో తొలి కచేరీ చేసిన తదుపరి 1927లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో కచేరీ చేయడంతో ఆ తరువాత మళ్లీ వెనక్కి తిరిగి చూసుకోలే దాయన. ఇంతకింత ఎదిగి 1939 లో తిరువాన్కూరు ఆస్థాన విద్వాంసుడయ్యారు.

స్వాతి తిరునాళ్ కృతి "భావయామి రఘు రామం" సావేరి రాగంలో కూర్చబడింది. దీనిని చిట్ట స్వరాలతో రాగమాలికగా రూపొందించారు. అలా ఎందుకు చేయవలసి వచ్చిందో ఆయనే



ఇలా అంటారు. "సాధారణంగా సంగీతజ్ఞులు ఈ కృతిలో ఒకటి, రెండు చరణాలు మాత్రమే ఆలపిస్తారు. మొత్తం రామాయణాన్ని ఒక వరుసక్రమంలో చక్కటి సంగీత కథగా మలిచినప్పుడు దానికి మనం మరింత ప్రాధాన్యత నివ్వాలి. పండితుల అనుమతితో నేను స్వేచ్ఛ తీసుకుని చిట్ట స్వరాలతో సహా రాగమాలికగా మార్చాను. రామాయణంలోని గొప్పతనానికి నా కృతజ్ఞతలు. ఈ రాగమాలిక సంగీత పండితులను, రసికులను సైతం ఆకట్టుకుని విశేష ప్రాముఖ్యాన్ని ఆర్జించింది. నా కృషి విజయవంత మైనందుకు నాకెంతో సంతోషంగా సంతృప్తిగా ఉంది" అని.

స్వాతి తిరునాళ్ కృతులతో బాటు శ్రీనివాస అయ్యర్ నారాయణ తీర్థల, సదాశివ బ్రహ్మేంద్రస్వామి, త్యాగరాయ కృతులను ఎక్కువగా గానం చేస్తారు. "భావయామి రఘురామం" (సప్త చరణాలలో రాగమాలిక) సెమ్మంగుడి వారు పాడగా వింటే శ్రోతలు రస జగత్తులో తేలిపోవలసిందే. గాత్ర శైలిలో ఆయన ప్రయోగాలు ఆదర్శప్రాయమైనవి. మంద్ర మధ్యస్థాయిలో గంభీరంగా, శ్రావ్యంగా ఉండే కంఠస్వరం తారా స్థాయికి చేరే సరికి నాసికాగ్రానికి చేరుకుని పలకడం, తార షడ్జమాన్ని ఆయన అనే తీరు సైతం మనకు విచిత్రంగా అనిపిస్తుంది. ఇటువంటి స్వర విన్యాసాలు సెమ్మంగుడి వారికి మాత్రమే సాధ్యమవుతాయి.

అయితే సెమ్మంగుడి వారు స్వాతి తిరునాళ్‌పై చేసిన పరిశోధన కొంత వాద వివాదాలకు దారితీసింది. "అసలు స్వాతి తిరునాళ్ వాగ్గేయకారుడు కాదని వారి వంశీకులు కీర్తి కండూతితో ఏవో కీర్తనలను "స్వాతి" రాసినట్లుగా చెప్పుకుంటున్నారని, నేషనల్ బుక్‌ట్రస్ట్ వారి కోసం సెమ్మంగుడి రాసిన స్వాతి తిరునాళ్‌పై రాసిన మూడు పుస్తకాలను నిషేధించాలని స్వర్గీయ వీణా బాలచందర్ ఏకంగా కోర్టుకెక్కారు. అయితే బాలచందర్ మరణంతో ఆ వివాదం సద్దుమణిగింది.

సెమ్మంగుడి వారి వద్ద సంగీతా భ్యాసం చేసి సుప్రసిద్ధులైన వారెందరో. భారతరత్న ఎమ్మెస్ సుబ్బులక్ష్మి ఈయన శిష్యురాలే. వయోలిన్ మేస్ట్రో టి.ఎన్.కృష్ణన్ కూడా వీరి శిష్యులే. తన సంగీత సేవలకు అకాడమి వారి సంగీత కళానిధి, 1988లో కేరళ ప్రభుత్వం "స్వాతి సంగీత" పురస్కారం, సంగీత భీష్మ వంటి బిరుదాలను అందుకున్న శ్రీనివాస అయ్యర్ తన శిష్యులకు చాలా సందర్భాల్లో చెప్పేదేమంటే - "నా వద్ద సంగీతాభ్యాసం చేయండి. కానీ అరియక్కుడి వారిలా పాడండి" అని! సాటి కళాకారుడి గురించి మరో గొప్ప కళాకారుడు పేర్కొనడం అందరికీ సాధ్యం కాదు. మత్సరం ఎరుగని మహోన్నత కళాకారుడాయన!

-హెచ్. రమేష్‌బాబు

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింత్ (2002)
సంగీతం : ఎ.ఆర్. రెహమాన్
రచన : సమీర్
1వపాట గానం : సోనూ నిగమ్, బృందం
2వపాట గానం : సోనూ నిగమ్, హరిహరన్
3వపాట గానం : అల్కాయాగ్నిక్, ఉదిత్‌నారాయణ్
అభినయం : అజయ్ దేవగన్ తదితరులు (1,2 పాటలు)
అమృతారావు, అజయ్‌దేవగన్ (3వ పాట)

# ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్ (2002)





### పాట: 1

సర్ఫరోషి కీ తమన్నా అబ్ హమారే దిల్ మేఁ హై
దేఖ్‌నా హై జోర్ కిత్నా బాజు-ఎ-కాతిల్ మేఁ హై
దేఖ్ సక్తాహైతో తూభీ దేఖ్‌లే అయె ఆస్మాఁ
హౌస్లా యే దేఖ్‌కే కాతిల్ బడీ ముష్కిల్ మేఁ హై
అప్నే హీ లహూ సే హమ్ లిఖేంగే అప్నీ దాస్తాఁ
జాలిమోఁ సే ఛీన్ లేంగే యే జమీఁ యే ఆస్మాఁ
సర్‌ఫిరే జవాన్ హమ్‌తో మౌత్ సే భీ నా డరేఁ
ఆంచ్ ఆయే దేశ్ పే యే క్యోఁ గవారా హమ్ కరేఁ
ముల్క్‌పే కుర్బాన్ హుయే ఆర్జూ దిల్‌దిల్ మేఁ హై ॥సర్ఫరోషి॥

### పాట: 2

సర్ఫరోషికీ తమన్నా అబ్ హమారే దిల్ మేఁ హై
దేఖ్‌నా హై జోర్ కిత్నా బాజు-ఎ-కాతిల్ మేఁ హై
వక్త్ ఆనేపే బతా దేంగే తుఝే అయె ఆస్మాఁ
క్యా బతాయేఁ హమ్ జునూన్-ఎ-షౌక్ కిస్ మంజిల్ మేఁ హై
డోరియాఁ ఉమ్మీద్ కీ న ఆజ్ హమ్‌సే ఛూట్ జాయేఁ
మిల్కే దేఖాహై జిన్హే వో సప్నే భీ న రూఠ్ జాయేఁ
హౌస్‌లే వో హౌస్‌లే క్యా జో సితమ్ సే టూట్ జాయేఁ ॥సర్ఫరోషి॥
తేరే సోనే రూప్ కో హమ్ ఏక్ నయీ బహార్ దేంగే
అప్నే హీ లహూసే తేరా రంగ్ హమ్ నిఖార్ దేంగే
దేస్ మేరే దేస్ తుఝ్‌పే జిందగీ భీ వార్ దేంగే ॥సర్ఫరోషి॥
ఖుష్బూ బన్‌కే మెహకా కరేంగే హమ్ లహ్‌లహాతీ హర్ ఫస్‌లోం మేఁ
సాంస్ బన్‌కే హమ్ గున్‌గునాయేంగే
ఆనేవాలీ హర్ నస్‌లోం మేఁ ॥సర్ఫరోషి॥

పాట: 3

ఆ: మాహివే... మాహివే (2)
మెహందీ కా రంగ్ నా ఛూటే కభీ సజ్‌నా
చాహూఁ మై తుఝే హీ సుబహ్ షామ్
హర్ ధడ్‌కన్ మేఁ తూహి మేరే మన్ మేఁ
సాఁసేఁ జప్‌తీ హైఁ తేరా నామ్
ఆ: యే బిందియా తుఝ్‌కో పుకారే హర్ పల్
యే కంగ్‌నా కహే ముఝే థామ్‌కే చల్
అ: తేరీ మేరీ రాహేఁ జుదా
ఏక్ హొూంగీ నా సారీ ఉమర్
తుఝ్‌కో నహీఁ కుఛ్ భీ పతా
ముష్కిల్ బడా మేరా సఫర్ ॥మెహందీ॥
ఆ: సనమ్ కీ బాహోఁ మేఁ బిఖర్ జావూంగీ
కసమ్‌సే టూట్‌కే మర్ జావూంగీ
అ: సున్ బావ్‌రీ మేరా వతన్
హై మేరా దిల్, హై మేరీ జాఁ
ఇస్‌కేలియే అబ్ తో ముఝే
జీనా యహాఁ మర్నా యహాఁ ॥మెహందీ॥



భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో గాంధీజీ అహింసావాదమే కాక కొందరు సమరయోధుల అతివాదం కూడా కీలకపాత్ర వహించింది. వీరిలో అగ్రగణ్యుడు భగత్‌సింగ్. 'ముల్లును ముల్లుతోనే తీయాలి' అనే సిద్ధాంతంతో బ్రిటిష్ వారి అరాచకాలకు తన తిరుగుబాటు చర్యలతో సమాధానం చెప్పాడు. భారత మాతకు బ్రిటిష్ పాలకుల చెరనుండి విముక్తి కలిగించటానికి తన ప్రాణాన్ని సైతం అర్పించిన ఈ ముద్దుబిడ్డ ఎందరో యువకులకు స్ఫూర్తి ప్రదాత అయ్యాడు. స్వాతంత్ర్యం సాధించిన తర్వాత బాధ్యతగా వ్యవహరించకపోతే కలిగే దుష్పరిణామాల గురించి కూడా ముందే హెచ్చరించిన మేధావి అతను. 23 సంవత్సరాల అతి పిన్న వయసులోనే నవ్వుతూ ఉరికంబం ఎక్కి తన అనన్య దేశభక్తిని చాటు కున్నాడు.

1907లో జన్మించిన భగత్‌సింగ్‌ను 1919లో జరిగిన జలియన్‌వాలాబాగ్ హింసాకాండ కుదిపివేసింది. అలా బాల్యంలోనే అతనిలో తెల్లవారి పట్ల ద్వేషం మొద లయింది. వయసు పెరిగే కొద్దీ మాతృభూమిని బానిస సంకెళ్ళ నుంచి విడి పించాలనే ఆకాంక్ష ఉధృతం అయింది. హిందుస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీలో చేరి ఎన్నో తిరుగుబాటు చర్యలతో బ్రిటిష్ వారి గుండెల్లో రైళ్ళు పరుగెత్తించాడు. సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో బాంబు దాడి చేశాడు. దేశంలోని మూలమూలలా యువతరంలో చైతన్యం కలిగించటానికే అతను ఈ పని చేశాడు. అతని మాటల్లోనే చెప్పాలంటే 'చెవిటి వారికి వినపడాలంటే పెద్దశబ్దం చేయాలి'. చివరికి బ్రిటిష్ వారికి చిక్కి 1931 మార్చి 23న ఉరి తీయబడ్డాడు.



భగత్‌సింగ్ కథను ఇంతకుముందు మూడుసార్లు సినిమాగా తీశారు. 1954లో ప్రేమ్ అదీబ్ హీరోగా 'షహీద్-ఎ-ఆజమ్ భగత్‌సింగ్', 1963లో షమ్మీ కపూర్ హీరోగా 'షహీద్ భగత్‌సింగ్', 1965లో మనోజ్‌కుమార్ హీరోగా 'షహీద్' వచ్చాయి. భగత్‌సింగ్ కథను ఇటీవల ఐదుగురు నిర్మాతలు వేరు వేరుగా తెరకెక్కించారు. ఒకేసారి ఐదు చిత్రాలు రావటం వింతే. ఇది సినీపరిశ్రమలో చర్చనీయాంశమైంది. ఈ చిత్రాల నిర్మాతలు ఎవరికి వారే తామే మొదట ఈ కథతో చిత్రాన్ని ప్రారంభిచామని అంటున్నారు. ఏదైతేనేం - ఇలా ఒకేసారి ఐదు చిత్రాలు రావడం విమర్శలకు కూడా దారితీసింది. ప్రముఖ హాస్యనటుడు, 'ఫ్లాప్ షో' అనే కామెడీ టీవీ సీరియల్‌ను రూపొందించిన జస్పాల్ భట్టీ ఈ విషయంపై స్పందిస్తూ "భవిష్యత్తులో నిర్మించబోయే భగత్‌సింగ్ ట్రెయినింగ్ ఇవ్వటానికి ఓ ఇన్‌స్టిట్యూట్ పెట్టబోతున్నాను" అని వ్యంగ్యంగా అన్నారు. ఈ ఐదు చిత్రాల వివరాల్లోకి వెళితే బాబీ దేవల్ హీరోగా '23 మార్చ్ 1931 షహీద్', సోనూ సూద్ హీరోగా 'షహీద్-ఎ-ఆజమ్', తరుణ్‌ఖన్నా హీరోగా 'షహీద్ భగత్‌సింగ్', దీపక్‌దత్తా హీరోగా 'భగత్‌సింగ్', అజయ్ దేవగన్ హీరోగా 'ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్' రూపొం దాయి. వీటిలో 'షహీద్-ఎ-ఆజమ్' 31మే 2002న మొదట రిలీజయింది. కానీ పరాజయం పొందింది. 7జూన్ 2002న '23 మార్చ్ 1931 షహీద్', 'ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్' ఒకేసారి విడుదలయ్యాయి. అందులో రాజ్‌కుమార్ సంతోషి దర్శకత్వంలో రూపొందిన 'ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్' విమర్శకుల మెప్పు పొంది ప్రజాదరణలో ముందుంది. రెండు సంవత్సరాల విస్తృత పరిశోధనతో వాస్తవాలకు దగ్గరగా అర్జున్ రాజాబాలి సమకూర్చిన స్క్రీన్‌ప్లేతో, ఎ.ఆర్. రెహమాన్ అందించిన చక్కని సంగీతంతో నిర్మించబడింది ఈ చిత్రం.

'ఘాయల్', 'దామిని', 'లజ్జా' వంటి ఉత్తమ చిత్రాలను రూపొందించిన సంతోషి ఎంతో శ్రద్ధతో ఈ చిత్రాన్ని మలిచారు.. 'జఖ్మ్' చిత్రానికి ఉత్తమ నటుడిగా 1999లో జాతీయ అవార్డు గెలుచుకున్న అజయ్ దేవగన్‌ను భగత్‌సింగ్ పాత్రకు ఎంపిక చేశారు. ఇక సంగీతం విషయానికి వస్తే 'వందేమాతరం' అనే ప్రైవేట్ ఆల్బమ్‌తో తనదైన శైలిలో దేశభక్తిని చాటిన ఎ.ఆర్.రెహమాన్ ఈ చిత్రంలో కూడా అద్భుతమైన సంగీతాన్ని అందించారు. 'లగాన్' చిత్రానికి ఎన్నో అవార్డులందుకున్న రెహమాన్ తదుపరి హిందీ చిత్రంగా అందరి అంచనాలకు తగ్గట్టు ఉన్నాయి ఈ చిత్రంలోని పాటలు. సమీర్ సాహిత్యం అనవసరమైన భావాలకు తావు ఇవ్వకుండా చిత్రంలోని పాత్రల ఉద్దేశానికి అనుగుణంగా సాగిపోతుంది.

'సర్ఫరోషి కీ తమన్నా' అనే పాట స్వాతంత్ర్య పోరాట కాలంలో రామ్‌ప్రసాద్ బిస్మిల్ వ్రాశారు. దీనిని అప్పుడు మార్చింగ్ సాంగ్‌లా పాడుకునేవారు. ఈ పాట బాణీ ఎంతో ప్రజాదరణ పొందింది. మనోజ్ కుమార్ 'షహీద్'లో ఈ పాటను అదే బాణీలో వాడుకున్నారు. '23 మార్చ్ 1931 షహీద్'లో కూడా అదే బాణీలో సాహిత్యం యథాతథంగా ఉంచి ఈ పాటను పొందుపరిచారు. ఈ చిత్రంలో ఈ పాట పల్లవి అలానే ఉంచి రెండు కొత్తపాటలు వ్రాశారు సమీర్. మొదటి పాట పాత బాణీలోనే కూర్చారు. రెండో పాటకు కొత్తబాణీ కట్టారు రెహమాన్. గాయకుడు సోనూ నిగమ్ ఈ కొత్త బాణీ విని "చిన్నప్పటి నుంచి ఒకే బాణీలో పాడుకుంటూ వేరే బాణీని ఊహించనైనా లేని ఈ పాటకి కొత్త బాణీ కట్టి ఒప్పించిన రెహమాన్ నిజంగా గ్రేట్" అన్నారు.

మొదటి పాట ఆవేశం నిండిన పాట. దేశంకోసం అన్నిటికీ తెగించి తమ రక్తాన్ని ధారపోయడానికి కూడా సిద్ధమని బ్రిటిష్ వారికి తెలియజెప్పే పాట ఇది.

'సర్ఫరోష్' అంటే 'తల అర్పించటం'. ఇది మన తెలుగు ప్రయోగం కాదు. ఆంగ్లంలో 'లే డౌన్ ద హెడ్' అనే ప్రయోగానికి ఉర్దూ పదమే 'సర్ఫరోష్'. 'తమన్నా' అంటే కోరిక. 'జోర్' అంటే బలం. 'బాజూ' అంటే బాహువులు, చేతులు. 'కాతిల్' అంటే ప్రాణాలు తీసేవాడు, హంత కుడు. బ్రిటిష్ వారిని 'హంతకుడు'గా అభివర్ణించి వారి అరాచకాలను ఎత్తి చూపారు. 'హౌస్‌లా' అంటే ధైర్యం. 'ముష్కిల్



మేఁ హై' అంటే 'ఇరుకున పడ్డాడు' అని 'మా తలలను అర్పించటానికి మేం సిద్ధమే. ఆ తల తెగనరికే శక్తి ఈ హంతకుడి బాహువుల్లో ఉందా?' అని సవాలు చేస్తున్నారు. ఇక్కడ భావం 'యువతరంలో పెల్లుబుకుతున్న ఉత్సాహాన్ని, విప్లవాన్ని ఆపగలరా?' అని. 'మా ధైర్యం చూసి హంతకుడు ఇరుకున పడ్డాడు' అని ఎగతాళి చేస్తున్నారు.

తలనే సమర్పించాలన్న కోరిక మా హృదయాల్లో
మరి ఏ పాటి సత్తావుందో చూడాలి శత్రువు బాహువుల్లో
చూడగలిగితే, ఓ గగనమా, నువ్వూ చూడు
మా ధైర్యం చూసి పగవాడు తల్లడిల్లాడు

'లహూ' అంటే రక్తం. 'దాస్తాన్' అంటే కథ. 'జాలిమ్' అంటే దుష్టులు. 'జమీన్' అంటే భూమి. 'ఆస్మాన్' అంటే ఆకాశం. 'సర్‌ఫిరే' అంటే 'తెగించినవారు, ఉన్మాదులు'. 'జవాన్' అంటే సైనికులు, వీరులు, తెలుగులో కూడా జవాన్లు అంటాం కదా. 'జవాన్' అంటే యువకులు అనే అర్థం కూడా ఉంది. 'మౌత్ సే భీ నా డరేఁ' అంటే 'చావుకు కూడా భయపడం' అని. 'ఆంచ్' అంటే ఆపద. 'గఁవారా కర్నా' అంటే 'పట్టించుకోకపోవటం',. 'ముల్క్' అంటే దేశం, జాతి. 'కుర్బాన్ హోనా' అంటే బలవ్వటం. 'ఆర్జు' అంటే కోరిక, ఆశ.

'మా రక్తంతో మా కథనే లిఖిస్తాం
దుష్టులనుండి ఈ భూమ్యాకాశాలు విడిపిస్తాం
తెగించిన వీరులం, మాకు చావంటే భయం లేదు
దేశానికి ఆపద వస్తే చూస్తూ ఊరుకునేది లేదు
జాతి కోసం బలి అవ్వాలనే కోరిక ప్రతి మనసులో ఉంది'

మా రక్తం ధారపోసి చరిత్రకెక్కుతాం. అన్నిటికీ తెగించిన వాళ్ళం, జాతికోసం బలి అయినా అయి బ్రిటిష్ వారి పాలన నుంచి విడిపిస్తాం. అంతే కానీ చూస్తూ ఊరుకోం అంటారు వారు.

రెండో పాట భగత్‌సింగ్ అనుచరులతో జైల్లో ఉన్నప్పుడు పాడే పాట. బ్రిటిష్ వారు పెట్టే హింసలకు బెదరకుండా ధైర్యంగా ఉండాలని, నిరాశ చెందకూడదని చెప్పే ప్రబోధాత్మక గీతం. ఈ పాటకు రెహమాన్ శాస్త్రీయ పద్ధతిలో అద్భుతమైన బాణీ కట్టారు. తబలా, సంతూర్, ఫ్లూట్‌లను ఉపయోగించి వీనుల విందుగా తీర్చిదిద్దారు.

'జునూన్' అంటే ఉన్మాదం. షౌక్ అంటే ఇష్టం. 'మంజిల్' అంటే గమ్యం'. 'ఓ ఆకాశమా! ఈ ఉన్మాదం ఎంత దాకా వచ్చిందో ఏం చెప్పను?' అంటున్నాడు. దేశభక్తి ఉన్మాదంలా మారి తమను జైలుపాలు చేసినా ఇంకా గమ్యం చేరలేదే అనే బాధ ఈ వాక్యంలో కనిపిస్తుంది.

'ఉమ్మీద్ కీ డోరియాఁ' అంటే ఆశల పగ్గాలు. 'సప్నే' అంటే కలలు, స్వప్నాలు. సితమ్ అంటే బాధలు.

'ఆశల పగ్గాలు నేడు చేజారకూడదు
కన్న కలలు కల్లలుగా మారకూడదు
కష్టాలకు కృంగిపోయే ధైర్యాలు ధైర్యాలా?'

ఆశలు, కలలే మనిషిని నడిపిస్తాయి. అనుకున్నది సాధించాలనే పట్టుదలతో సాగిపోవాలే గానీ ఆత్మ విశ్వాసం కోల్పోయి కష్టాలకు కృంగిపోయేవారు ధైర్యవంతులనిపించుకోరు. దేశంకోసం కన్న కలలను సాకారం చేసుకోవాలనే ఆశను పదిలంగా ఉంచుకోవాలని అంటున్నాడు.

పంజాబీలో 'సోనా' అంటే 'అందమైన' అని అర్థం. హిందీలో బంగారం అనే అర్థం ఉంది కానీ ఇక్కడ పంజాబీ అర్థమే సరైనది. 'కభీ ఖుషీ కభీ గమ్' చిత్రంలోని 'రూప్ హై తేరా సోనా సోనా' అనే పాటలో కూడా పంజాబీ అర్థమే వస్తుంది. 'బహార్' అంటే వసంతం. 'నిఖార్' అంటే నిగారింపు. 'జిందగీ భీ వార్ దేంగే' అంటే 'జీవితం కూడా పణంగా పెడతాం' అని.



'నీ అందమైన రూపానికి కొత్త వసంతం తెస్తాం
మా రక్తంతో నీ రంగుకు నిగారింపు తెస్తాం
ఓ నా దేశమా! నీ కోసం జీవితం త్యాగం చేస్తాం'

భారతమాతను ఉద్దేశిస్తూ వ్రాసిన చరణం ఇది. 'తెల్లదొరల పాలనలో కళావిహీనమైన భారతదేశానికి కొత్త వసంతం తెచ్చి కళకళలాడేలా చేస్తాం. మా రక్తం చిందించి దేశాన్ని మరింత అందంగా తీర్చిదిద్దుతాం. ఈ ఆశయం కోసం జీవితాన్ని పణంగా పెడతాం.

'ఖుష్బూ' అంటే సువాసన. 'మెహక్' అన్నా సువాసనే. ఫసల్ అంటే పంట. 'సాఁస్' అంటే శ్వాస. 'గున్‌గునానా' అంటే కూనిరాగం తీయటం. 'ఆనే వాలీ నస్లేఁ' అంటే రాబోయే తరాలు.

'సువాసనై గుబాళిస్తాం కళకళలాడే పంట పొలాల్లో
శ్వాసయై ఆలపిస్తాం రాబోయే ముందు తరాల్లో'

పచ్చని పంట పొలాలు దేశ సౌభాగ్యానికి చిహ్నాలు. 'దేశ సౌభాగ్యం కోసం ప్రాణాలర్పించి జన్మని చరితార్థం చేసుకుంటాం. ఆ సౌభాగ్యంలోనే మా జ్ఞాపకాలు గుబాళిస్తాయి. ముందు తరాలకు స్ఫూర్తిగా నిలిచి వారి ద్వారా జీవిస్తాం'.

ఇక మూడో పాట ఒక ప్రేమగీతం. అద్భుతమైన మెలొడీగా తీర్చిదిద్దారు రెహమాన్. అల్కా యాగ్నిక్ గొంతు ఎంతో ఫ్రెష్‌గా అనిపించటం ఈ పాటలోని విశేషం. భగత్‌సింగ్ ప్రియురాలు తన ఆశలను తెలియజేస్తే భగత్‌సింగ్ తన ఆశయాలే తప్ప వేరే ధ్యాస లేదని చెప్పటం ఈ పాట సారాంశం. 'అబ్‌కే బరస్' చిత్రం ద్వారా పరిచయమైన అమృతరావు భగత్‌సింగ్ ప్రియురాలిగా నటించింది.

'మాహివే' అంటే 'ఓ ప్రియా' అని. 'మెహందీ' అంటే గోరింటాకు. 'ధడ్‌కన్' అంటే గుండె సవ్వడి

'ఈ గోరింటాకు రంగు వెలిసిపోనీకు
ఎల్లవేళలా నిన్నే కోరుకుంటాను నేను
నా గుండె సవ్వడిలో, నా మనసంతా నీవే
ప్రతి శ్వాస జపిస్తుంది నీ పేరే.

ఉత్తరాదిన గోరింటాకుకి ఎంతో ప్రాముఖ్యత ఉంది. పెళ్ళికి ముందు 'మెహందీ' అనే తంతులో పెళ్ళికూతురికి గోరింటాకు పెట్టడం ఆర్భాటంగా చేస్తారు. 'గోరింటాకు రంగు వెలిసిపోనీకు' అనడంలో 'ఈ బంధం తెగిపోనీకు' అనే భావం దాగి ఉంది. ఈ విధంగా ఆమె తన ప్రేమను తెలియజేస్తుంది.

'బిందియా' అంటే బొట్టు. 'పుకారే' అంటే 'పిలుస్తుంది' అని. 'హర్‌పల్' అంటే ప్రతిక్షణం. 'కంగ్‌నా' అంటే 'గాజు'. 'థామ్‌కే చల్' అంటే 'పట్టుకుని నడు' అని. 'రాహేఁ' అంటే దారులు. 'జుదా' అంటే వేరు. 'ఉమర్' అంటే వయసు, జీవితం. 'సఫర్' అంటే పయనం.

'నుదుటి బొట్టు నిన్నే ప్రతిక్షణం పిలుస్తుంది
చేతి గాజు నా చేయి పట్టుకుని నడవమంటుంది.' అని ఆమె అంటే
'మన దారులు వేరు, ఈ జీవితానికి కలిసేది లేదు
నీకేం తెలుసు, నా పయనమెంతో చేదు' - అని అతడు జవాబిచ్చాడు.

తాను చేసుకున్న అలంకరణలు కూడా అతని కోసమే అని, అవి కూడా అతన్నే కోరుకుంటున్నాయని ఆమె అంటోంది. కానీ అతడు ఎంచుకున్న దారి వేరు. ఆ దారిలో ఆమె సుఖం లేదని అంటున్నారు. ఆత్రేయ అన్నట్టు 'నే వెళ్ళు దారి ఓ ముళ్ళ దారి, రాలేరు ఎవరూ నాతో చేరి' అని భావం.

'సనమ్' అనే మాట ప్రియుడు, ప్రియురాలు ఇద్దరికీ వాడతారు. 'మాహోఁ మేఁ' అంటే 'కౌగిట్లో'. 'కసమ్' అంటే ఒట్టు. 'బావ్‌రీ' అంటే 'పిచ్చిదానా' అని. 'వతన్' అంటే దేశం.

'ప్రియుడి కౌగిట్లో కరిగిపోతాను
ఒట్టు, అలాగే కడతేరిపోతాను' అని ఆమె తన అవ్యాజ ప్రేమ తెలిపితే అతను

'ఓ వెర్రిదానా! నా దేశమే నా హృదయం, నా ప్రాణం
దేశం కోసమే నేను జీవిస్తాను, మరణిస్తాను' అని తేల్చి చెప్పాడు.

-పి.వి. సత్యనారాయణ రాజు

జులై 27 చిత్ర పుట్టినరోజు సందర్భంగా...

# పాట శ్రద్ధగా వినే అవకాశం శ్రోతకు ఏది!?

**-చిత్ర**



దక్షిణాదికి చెందిన నాలుగు ప్రధాన భాషలలో ఆయా రాష్ట్ర ప్రభుత్వ అవార్డులు సాధించిన ఏకైక గాయని ఆమె. మలయాళంలో 12సార్లు, తెలుగులో 5, తమిళంలో 3, కన్నడంలో ఓసారి అవార్డులు సాధించటమే గాక 1986 నుండి వరుసగా 11 సార్లు కేరళ రాష్ట్ర ప్రభుత్వ అవార్డు సాధించిన ఉత్తమ గాయని ఆమె.

వీటన్నింటితోపాటు 5 సార్లు జాతీయస్థాయిలో కూడా అవార్డులు సాధించారామె. ఫిల్మ్ కెరీర్ ప్రారంభించిన 7 సంవత్సరాలలో 3 సార్లు జాతీయస్థాయి అవార్డు సాధించిన గాయనీమణికకూడా ఈమె ఒక్కరే కావచ్చు. గలగలమని సాగిపోయే సెలయేరులాంటి నవ్వు.... తేనె కన్నా తీయనైన కంఠస్వరం... ఆమె స్వంతం... ఆమే... చిత్ర!.

కేరళ యూనివర్శిటీ నుండి మ్యూజిక్‌లో 3వ ర్యాంకుతో డిగ్రీ సాధించిన చిత్ర స్కూలుకు వెళ్ళే సమయంలోనే గాయనిగా చిత్రరంగ ప్రవేశం చేసింది. ఆమెను గురించి ఆమె మాటల్లోనే...

అది నేను 9వ తరగతి చదువుతున్న రోజులు. సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులు, కేరళ యూనివర్శిటిలో ప్రొఫెసర్ అయిన డాక్టర్ కె. ఓమనకుట్టి గారు తన సోదరుడు, ప్రసిద్ధ సంగీత దర్శకుడు శ్రీ ఎం.జి. రాధాకృష్ణన్‌గారికి నన్ను పరిచయంచేసారు. ఆ తర్వాత 1982లో నేను పాడగా విడుదలైన తొలి చిత్రం 'న్యాన్ ఇక్‌నాను'. ఆ తర్వాత అట్టహాసమ్, చెల్లయ్, స్నేహ పూర్వమ్, మీరా, ఎండెమామట్టి కుట్టియమ్మ తదితర చిత్రాలలో పాడాను.

నేను వ్యక్తిగతంగా ప్లేబాక్ సింగర్ కావాలని ఏనాడూ అనుకోలేదు నా చిన్నతనం నుండి నాకు సంగీతమంటే ఇష్టం, అందుకే సంగీత మాష్టారు కావాలని కలలు కనేదాన్ని, కాని మానాన్నగారి ప్రోద్బలంతో సింగర్‌గా మారాను. మా పెద్దక్క 'బీనా' కూడా కొన్ని మలయాళ సినిమాలకు 70లలో పాడింది, నాకన్నా బాగా పాడగలదామె, కాని విదేశాలలో ఉండటంచేత పాడడం మానేసింది. ఇక మా తమ్ముడు మహేష్ గిటారు బాగా వాయిస్తాడు. మా అమ్మ శాంత మంచి వీణా విద్వాంసురాలు. వీరందరి సహకారం, ప్రోత్సాహం నా కెరీర్ తొలినాళ్ళలో గాయనిగా స్థిర పడడానికి ఎంతో దోహదం చేసాయి.




Jogi Naidu

L.J. AUDIOLINES PVT. LTD.
DIGITAL AUDIO STUDIO
(Song Recording, Re-recording, Dubbing & Effects)



Jhansi

Regd. Office : 22, Rockdale Compound, Opp. R.T.A. Office, Somajiguda, Hyderabad - 500 082. Phone: 040 - 3310302, 6580302
B-23, Road No. 8, Film Nagar, Jubilee Hills, Hyderabad - 500 033. Phone: 040 - 3550606, 3550707

నా కెరీర్ తొలినాళ్ళలో జేసుదాసు గారు నన్నెంతగానో ఎంకరేజ్ చేసారు. ఆయనతో నేను పాడిన 'ప్రణయ వసంతం' చిత్రం తర్వాత నా కెరీర్ బాగా ఊపందుకుంది. ఆయన నాన్ ఫిల్మ్ క్యాసెట్స్ అయిన 'తరంగిణి' తదితర క్యాసెట్స్ ద్వారా నన్ను బాగా ప్రోత్సహించటంచేత, ఎందరో సంగీత దర్శకులకు నాగురించి బాగా తెలిసింది. ఆ సమయంలోనే ఇళయరాజాగారు నన్ను 'నీదానా అందక్కుయిల్' చిత్రం ద్వారా తమిళంలో పరిచయం చేసారు. ఆ తరువాత ఆయన సంగీత దర్శకత్వంలోనే 'పూవే పుచ్చుదువా' 'సింధుభైరవి' మున్నగు చిత్రాలలో పాడిన పాటల ద్వారా గాయనిగా నా జీవితం మలుపుతిప్పారు. 1986లో శ్రీ మాధవపెద్ది సత్యంగారు 'ప్రళయం' అనే చిత్రం ద్వారా నన్ను తెలుగు తెరకు పరిచయం చేసారు. అలాగే 1991లో 'లవ్' చిత్రం ద్వారా హిందీ రంగానికి పరిచయం అయ్యాను.

సాధారణంగా రికార్డింగ్ స్టూడియోలలో మేం ఇయర్ ఫోన్స్ ఉపయోగిస్తూ ఉంటాం. అదే స్టేజ్ మీదకొచ్చే సరికి ఒక్కోసారి మేం ఏమి పాడుతున్నామో కూడా మాకు వినబడదు. అందుకే ఇటీవల నేను ఓ ఎలక్ట్రానిక్ గాడ్జెట్ కొన్నాను. 'పర్సనల్ మానిటర్' అనే ఈ చిన్న పరికరం మనం వేసుకునేడ్రస్‌కు ఎటాచ్ చేస్తే చాలు. అదే ఆర్కెస్ట్రా సౌండ్‌లకు తగ్గట్లుగా సరైన ఫీడ్‌బ్యాక్ ఇస్తుంది. ఇన్ని సంవత్సరాలుగా సింగర్‌గా ఉన్నప్పటికీ నేను ఇచ్చే ప్రతి స్టేజి ప్రోగ్రాంలకు విపరీతమైన టెన్షన్ పడుతుంటాను. నా బంధువులు ఇప్పటికీ ఆశ్చర్యపోతూ ఉంటారు. నేను 4 లేక 5 పాటలు పాడిన తర్వాత నాకు నా మీద విశ్వాసం ఏర్పడుతుంది. ఆ మధ్య 'సూర్య' కోసం త్రివేండ్రంలో కర్ణాటక సంగీత ప్రదర్శన ఇచ్చాను. ఈ ప్రోగ్రాంకు ముందు నేను ఎంత టెన్షన్ అనుభవించానో చెప్పలేను. నాకు ఇప్పటికీ మరిన్ని మంచి ప్రదర్శనలు ఇవ్వాలని ఉన్నప్పటికీ, నాకున్న పాటల రికార్డింగ్ వల్ల అది సాధ్యం కావటం లేదు.

లతా మంగేష్కర్, ఆశాభోంస్లే, ఎస్.జానకి, పి. సుశీలల వీరాభిమానిని. ఎస్. జానకి గారంటే నాకు అవ్యాజమైన ప్రేమ. సింగర్‌గా నేను రాణించటానికి ఎన్నో మెళుకువలను ఆమె నేర్పారు. నాకు ఇప్పటికీ అంతుపట్టని విషయం ఏమిటంటే వారంతా పాటను ఇంత ఉన్నతమైన స్థితికి ఎలా చేర్చారన్నదే. ఇక గాయకులలో ఎక్కువగా అభిమానించేది జేసుదాస్.

ఎస్.పి. బాలు, మనో. ఇప్పుడు వచ్చే కొత్త సింగర్స్ జేసుదాసును ఆదర్శంగా తీసుకోవాలి. ఎందుకంటే ఆయన తీసుకున్నన్ని జాగ్రత్తలు (పాట బాగా రావటం కోసం) మరే గాయకుడు తీసుకోరనటంలో అతిశయోక్తి లేదు.

విదేశాలలో ఎన్నోసార్లు పర్యటించి అక్కడ శ్రోతలను అలరించినప్పటికీ రాయల్ అల్బర్ట్ హోల్ (లండన్)లో జేసుదాసు, యస్.పి. బాలులతో కలిసి పాడిన అనుభవమే నాకు ఎక్కువ ఆనందాన్నిచ్చింది.

ఇప్పుడు రికార్డింగ్ చాలా ఫాస్ట్ అయిపోయింది. గతంలోలా ఓ పాటకు రోజులు తీసుకోవటం లేదు. కేవలం నిమిషాలలోనే పనిపూర్తి కావాలి. నాకు శాస్త్రీయ సంగీతంలో కొంత అనుభవం ఉండటం ఇక్కడ ఎంతో ఉపయోగపడింది. ఇప్పుడు టెక్నాలజీ కూడా ఎంతో అభివృద్ధి చెందింది. లైన్ వెనుక లైన్ రికార్డు చేసి ఆ తర్వాత దానిని ఓ పాటగా మారుస్తున్నారు. అయితే అలా చేయటంవల్ల పాటలోని ఫీల్ కొంత వరకు ఎఫెక్ట్ అవుతుందని నా భావన. దానికన్నా కనీసం ఓ పల్లవి మొత్తం ఓసారి రికార్డు చేస్తే బాగుంటుంది. అయితే ఈ టెక్నాలజీ వల్ల చిన్న నిర్మాతలకు చాలా వరకూ మేలు జరిగింది.

అవార్డు అనేది సింగర్‌కు ఓ ప్రత్యేకమైన గుర్తింపు మాత్రమే, అయితే అవార్డుల కోసం నేను ఎప్పుడూ పాడలేదు.

ఇటీవలనే ప్రారంభించిన 'ఆడియో ట్రాక్స్' రికార్డింగ్ కంపెనీ గురించి చెప్పాలంటే నా భర్త విజయన్ దాని అడ్మినిస్ట్రేషన్ వ్యవహారాలు చూస్తూ ఉంటారు. ఇక నాపని అంటారా ఎంతబాగా పాడటం అన్నదే.



ఇప్పుడు వస్తున్న యువతరం గాయకుల గురించి చెప్పాలంటే పలు టి.వి. ఛానెల్స్ ప్రసారం చేస్తున్న కార్యక్రమాల ద్వారా చాలామంది సింగర్స్ వెలుగులోకి వచ్చారు. వారికి నేను చెప్పేది ఒక్కటే - మీకు మీరుగా పాడటానికి ప్రయత్నించండి తప్ప ఒకరిని అనుకరించటానికి ప్రయత్నించవద్దు. ఒకవేళ అలాగే చేస్తే మిమిక్రీ కళాకారునికీ మీకూ తేడా ఏమీ ఉండదు.

9 భాషలలో 12000 పైచిలుకు పాటలు పాడినప్పటికీ.... ఇప్పుడున్న సీనియర్ గాయకుల పాటలు వింటున్నప్పుడు నేను ఎంత దూరంలో ఉన్నానో అర్థం అవుతుంది.

2,3 దశాబ్దాల క్రితం సినిమా పాటలు వినాలంటే రేడియో ఒక్కటే ఆధారం. అంతేకాక అప్పట్లో నిర్మితమయ్యే చిత్రాలు వాటిలోని పాటలు కూడా తక్కువే ఉండేవి. అందుకే అప్పుడు ప్రతి ఒక్కరూ శ్రద్ధతో వాటిని ఆలకించేవారు. కానీ ఇప్పుడు ఎన్నో ఛానెల్స్ ఉన్నాయి. రోజుకు కనీసం 20 సినిమాలు కదలకుండా చూడవచ్చు. ఇక శ్రోతకు పాట శ్రద్ధగా వినే అవకాశమేది? అందుకే చాలా మంచి పాటలు కూడా ఒక్కోసారి ఎవరి గుర్తింపు నోచుకోకుండా తెరమరుగైపోతున్నవి.

ఎమ్.టి.వి. కోసం "రెగ్గ రాగా" (Regga Raaga) పేరిట ఓ ఆల్బం చేసాను. ఇదికాక లతామంగేష్కర్ మెలోడీలను ఆర్.డి. బర్మన్ మెమోరియల్ 'రివైవర్' ప్రోగ్రాంకోసం బాలుతో కలిసి పాడాను. దానికి విశేష స్పందన లభించింది. ఇది కాక మరికొన్ని నాన్-ఫిల్మ్ హిందీ గీతాలను కూడా పాడాను.

ఇప్పట్లో సంగీత దర్శకత్వం వహించే ఆలోచన లేదు. భవిష్యత్తులో నాకు చేతనైతే ప్రయత్నిస్తాను. కర్ణాటక సంగీతంలో వేదికపై కచేరీలు చేసే స్థాయికి ఎదగాలనేది నా ఆశయం. అదే నా జీవిత లక్ష్యం.

('చిత్ర' సినీ గీతాలు 59వ పేజీలో)







**విడుదల : ఆదిత్య మ్యూజిక్**
**వెల : రూ. 40/-**

చిరంజీవి హీరోగా బి.గోపాల్ దర్శకత్వంలో ప్రముఖ నిర్మాత అశ్వనీదత్ తన సిల్వర్ జూబ్లీ సంవత్సరపు కానుకగా నిర్మించిన 'ఇంద్ర' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. మణిశర్మ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

సిరివెన్నెల రాసిన 'భం భం బోలే శంఖం మోగెలే' పాటని ఒక టేస్ట్‌కి, ఒక కమిట్‌మెంట్‌కి ఉదాహరణగా చెప్పుకోవాలి. సాధారణంగా ఇమేజ్ ఉన్న ఆర్టిస్ట్‌కి చెయ్యవలసిన పాట అనగానే కొన్ని లిమిటేషన్స్ వచ్చేస్తాయి. అటువంటి పరిస్థితుల మధ్య - బీట్‌ని హాయిగా వినిపింప చేస్తూ, మెలోడిని ఒదలకుండా - ప్రతి అక్షరం అర్థమయ్యేలా - ఫ్యాన్స్ కూడా చిందులేసే పాట తయారు చెయ్యడం అన్నది మామూలు విషయం కాదు. మణిశర్మ ఈ విషయంలో నూటికి నూరుపాళ్ళు నెగ్గాడు. కేదార్ రాగాన్ని తీసుకుని అవసరమైన చోట కొద్దిగా మిశ్రమం చేస్తూ - పండగలకి పర్వదినాలకి వాడవాడలా మైకుల్లో హోరెత్తిపోయే ఓ మంచిపాటని సంగీత ప్రియులకు కానుకగా ఇచ్చాడాయన. శివునిమీద పాట - పాడింది హరి 'హరన్' ప్లస్ శంకర్ మహదేవన్ రాగం కేదార్.... బహుశా అన్నీ కలసి రావటం అంటే ఇదేనేమో!.

బాలు, కల్పన పాడిన 'అమ్మడూ - అప్పచ్చి నువ్వంటేనే పిచ్చి' పాట మాస్‌సాంగ్‌లా అనిపిస్తుంది కానీ పాటకు వెన్నుదన్నుగా నిలిచిన ఫోక్ బ్యాగ్రౌండ్ మాత్రం చాలా బలమైనది. దాని పవరేమిటో ఈ మధ్యనే మనం 'గాజువాక పిల్లా మేం గాజులోళ్ళం కాదా' పాట ద్వారా చవిచూశాం. ఆ పవర్‌ని తనదైన మార్కులోకి మార్చుకుంటూ మలచుకుంటూ మణిశర్మ చేసిన ఈ పాట కూడా వీరలెవెవెల్‌లో హిట్ అవుతుంది. 'చ' కారాలను చమత్కారంగా వాడడంతో వేటూరి తనదైన స్టాంప్‌ని మరోసారి ముద్రించారు.

ఉదిత్ నారాయణ్, చిత్ర పాడిన 'రాధేగోవిందా ప్రేమే పుట్టిందా' పాట భీంప్లాస్ రాగంలో ఓ చక్కని ఊపున్న పాటగా జమ చేసుకోదగ్గపాట. ఈ రకం మెలోడీతో 'భీంప్లాస్ రాగంలో మణిశర్మ చాలా పాటలు చేశాడు. ఈ 'రాధేగోవిందా' పాట వినగానే మణిశర్మ అక్కౌంట్‌లో గుర్తుచ్చేపాట - 'శ్రీను'లో 'ప్రేమంటే ఏమిటంటే నిను ప్రేమించి నాకే తెలిసే'! ఇక ఈ పాటని రాసిందెవరో అని వేరో ఆలోచించనక్కర్లేదు - 'కన్నే కిష్కంద' అనే పద ప్రయోగం ఒక్కటి సరిపోతుంది - ఇది భువనచంద్ర రాశారని!

బాలు, మల్లికార్జున్ పాడిన 'ఘల్లుఘల్లుమని సిరిమువ్వల్లె చినుకే చేరగా' పాట వింటున్నంత సేపు చాలా ఇన్‌స్పైయిరింగ్‌గా ఉంటుంది. బాలు, మల్లికార్జున్ కాంబినేషన్‌తో భవిష్యత్తులో మరికొన్ని పాటలు వచ్చినా ఆశ్చర్య పడనవసరం లేదు. ఇటీవల సంచలనం రేపిన 'లగాన్' చిత్రంలోని 'ఘనన్ ఘనన్ ఘన్‌గిర్ ఆయే బద్‌రా' పాట ఈ పాటకు ప్రేరణ అని అనుకుంటే ఏం తప్పు లేదు. బిస్లరీ మినరల్ వాటర్ అడ్వర్టైజ్‌మెంట్ తెలుగు వెర్షన్‌లో గల 'బొట్టుబొట్టులో ఉంది విశ్వాసం' అనే సాహిత్యాన్ని 'ఇంద్ర' రిలీజ్ తర్వాత వింటే 'ఘల్లుఘల్లుమని సిరిమువ్వల్లె చినుకై చేరగా' సాహిత్యానికి పేరడీ అని తమాషాగా అనుకునే ఛాన్సు కూడా ఉంది. ఈ పాట సిరివెన్నెల రచన.

కెకె, మహాలక్ష్మి పాడిన - 'దాయి దాయి దామ్మా/ కులికే కుందనాల బొమ్మా' పాటని మరో హిట్ సాంగ్‌గా లెక్కవేసుకోవచ్చు. 'ఖుషీ'లో 'అమ్మాయే సన్నగా అరనవ్వే నవ్వగా' పాటలోని 'ఓ ఓ / ఓఓఓఓ/ ఓఓ' అనే కోరస్ బిట్‌ని తమాషాగా గుర్తు చేస్తూ పాటను స్వరపరచిన విధానమే ఈ పాటకు వెన్నెముక. ఓ వైపు జనరంజకంగా ఉండేలా చూసుకుంటూ మరో వైపు సంప్రదాయాన్ని ఒదులుకోకుండా... వీలైతే అక్కడక్కడ టచ్ చేస్తూ... అది కూడా కుర్రకారుకి పట్టేలా... స్వరపరచటం మణిశర్మ ప్రత్యేకత అని ఈ పాట ఋజువు చేస్తుంది. కావాలంటే చరణాలలో -కేరింతలాడుతూ కవ్వించలేదా/కాదంటె ఇప్పుడు తప్పేదెలా/అల్లాడిపోతే పిల్లా మరి/ ఆ కళ్యాణ ఘడియ రానీయలే' అనే వాక్యాలు మరోసారి విని చూడండి. కరెక్ట్ కాదో తెలుస్తుంది.

కులశేఖర్ రాయగా కార్తీక్, ఉష పాడిన 'అయ్యయ్యయ్యయ్యయ్య అయ్యొయ్యొ చలిగాలి చంపేస్తోందమ్మ' పాట ఆడియో, సిడిలపై గల ఇన్‌లే కవర్ కారణంగా మణిశర్మ అక్కౌంట్‌లో పడిందిగాని నిజానికి ఈ పాటను స్వరపరిచింది ఆర్.పి.పట్నాయక్ అని ఇటీవల పత్రికలు వెల్లడించాయి. ఆ విషయాలన్నీ సాధారణ శ్రోతకు అనవసరం. కనుక పాట వరకు చూసుకుంటే - ఇది గాయనీ గాయకుల గళ విన్యాసాలకు మంచి అవకాశం ఇచ్చిన పాట. కార్తీక్, ఉష పోటీపడి మరీ న్యాయం చేకూర్చేరు ఆ విన్యాసాలకి.



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 1 — గానం: హరిహరన్, శంకర్‌మహదేవన్

ప: భం భం బోలే శంఖం మోగెలే ఢం ఢం ఢోలే చెలరేగిందిలే (2)
తథిసకథిం దరువై సందడి రేగనీ
పొత్తిలెరుగని పరుగై ముందుకు సాగనీ (2)
విలాసంగా శివసందలహరి మహాగంగ ప్రవాహంగమారి
విశాలాక్షి సమేతంగ చేరి
వరాలిచ్చే కాశీ పురీ.. ॥భం భం॥
కో: భం భం బోలే భం భం బోలే భం భం బోలే కోలన (2)
భం భం బోలే భం భం బోలే భం భం బోలే కోలన
బోలే నాచే చం చమా చం (2)
డమరు బాజే డమరు బాజే (3) ఢం ఢమాఢం
బోలే నాచే చం చమా చం
చ: వాంణాసిని వర్ణించే నా గీతిక నాటి శ్రీనాధుని కవితై వినిపించదా
ముక్తికే మార్గం చూపె మణికర్ణికా అల్లద అందినాయి చిరుగంటికా
ధమక ధమకాలై ఎదలయలే కీర్తన చేయగా
యమక గమకాలై పదగతులే నర్తన చేయగా
ప్రతీ అడుగు తరిస్తోంది ప్రదక్షణగా.. ॥విలాసంగా॥
కో: కార్తీక మాసాల వేవేల దీపాల వెలుగంత శివలీల కాదా
ప్రియమార మదిలోన ఈశ్వరుని ధ్యానిస్తె మనకష్టమే తొలగిపోదా
ధం ధమ ధం (2) ధమధమ్ (2) ధమ ధమా ధం
చ: ఎదురయే శిల యేదైనా శివలింగమే
మన్ను కాదు మహాదేవుని వరదానమే
చిరంజీవిగా నిలిచింది ఈ నగరమే
చరితలకు అందనిదీ కైలాసమే
గాలిలో నిత్యం వినలేదా ఆ ఓం కారమే
గంగలో నిత్యం కనలేదా శివకారుణ్యమే
తరలిరండి తెలుసుకోండి కాశిమహిమా ॥విలాసంగా॥ ॥భం భం॥

## రచన: వేటూరి — 2 — గానం: బాలు, కల్పన

ప: తకిట తకిట తకధిమి తోంతకిడి తకధిమి తోం (2)
కోలో.. కోలో యమ్మ (2) కోలో.. కోలో యమ్మ ..కోలోకోలో..
ప: అమ్మడు అప్పచ్చి నువ్వంటేనే పిచ్చి
ఈడు యిట్టావచ్చి పెట్టింది పేచీ (2)
ఆ: బావరో బావర్చి తినిపించవా మిర్చి
వాయనాలు తెచ్చి వడ్డించువార్చీ
అ: ముప్పూటా ముద్దొచ్చి మనువాడే మాటిచ్చి
ఆ: మేళాలు తెప్పిచ్చి ఊరంతా తిప్పిచ్చి..
అ: కోనదాటిందమ్మ కోటప్ప కొండాయమ్మ
ఆ: కోరుకున్నానమ్మా కోయంటే పలికాడమ్మా
కో: కోలో.. కోలో యమ్మ డోలు..డోలోయమ్మ ధం డోలోయమ్మ ॥అమ్మడు॥
ఆ: వాయనాలు తెచ్చి వడ్డించువార్చి
అ: పిల్లగాలి వీస్తుంటే చాలు పొమ్మన్నా
కో: కోలు కోలోయన్నా కోలన్నా కోలో
ఆ: మల్లెపూలు చూస్తుంటే మండిపడుతున్నా
అ: పిల్లగాలి వీస్తుంటే చాలు పొమ్మన్నా కో: డోలుడోలోయన్నా డోలుడోలో



కో: కాలిన్ మిస్టర్ డీ జే
అ: ఎస్ బాయ్ తెస్కో టిప్ కార్ గిరోంగి తిస్కో
కో: అయ్యో అయ్యో అయ్యో అయ్యో అయ్యో ఓహో
అ: పురుషుడినిట్టా యిరుకునపెట్టే పరుగుల పరువా
సొగసులు బిరువా ఓ తుంటరి మగువా
ఆ: నునుపులు యిట్టా ఎదురుగ పెట్టా
ఎగబడలేవా నాకు జతకావ నా వర్సైపోవా
అ: అల్లాడి పోతే పిల్లామరి ఆ కళ్యాణ ఘడియా రానీయవా
కో: ఆ కళ్యాణ ఘడియా రానీయవా
అ: అరే అందాక ఆగదు ఈ అల్లరి
ఇక నీ హితభోదలాపి శృతిమించవా
ఆ: నీ హితభోదలాపి శృతిమించవా
కో: ఓహో.. ఓ... అ : వాటెం వారెవా కో: ఓహో.. ఓ... ఆ: ఒళ్ళో వాలవా
అ: అనుమానం కలిగింది నువు ఆడపిల్లవేనా
ఆ: సందేహం లేదయ్యో ఈ పడుచు పదునుపైనా ॥దాయి దాయి॥
ఆ: హై హై హై హోయి హోయి హోయి కొరికే కళ్ళు చేరిపోయే
ఐన అది కూడ ఏదో కొత్త కొంటె హోయి

## రచన: కులశేఖర్ — 6 — గానం: కార్తీక్, ఉషా

కో: ష..పరన ష..పరన
ప/అ: అయ్యయ్యయ్యో అయ్యయ్యయ్యో అయ్యయ్యో
చలికాలం చంపేస్తోందయ్యో ఓ... ఓ... (2)
ఆ: అయ్యయ్యయ్యో అయ్యయ్యయ్యో అయ్యయ్యో
చలి గాలికి కుర్రాడొటయ్యో...
చ: తొలి సొంపుల్లో సెగసింఫనీ
ఆ: ఎరుపెక్కించెయ్ పసి చెంపని
అ: ఓ కొబ్బరి ముక్క కూర్పుల పక్క వేయించమ్మో ఎంచక్కా ॥అయ్యయ్యయ్యో॥
అ: సోకుల ఎరలే చూపి చిరుకాకలు మదిలో రేపి
వేకువజామున జాబిలి లాగా చెక్కెయ్ మాకే పోరీ
ఆ: చూపుల సూదుల తోటి నా కోకల తొర్రై రానీ
తుంటరి గుంటడు మారను అంటే ఎట్టా వేగేదేటి
అ: నీటుగా వచ్చి నైటు కచ్చేరి చేయమంటావె చక్కెర కేళి
ఆ: పైట రాగాల కోటలోకింక చేరవా బ్రహ్మచారి
చారి చారి చారి చారి చారి... చారి... చారి... చారి... చారి...
కో: అచ్చికచ్చిక...(2)
అ: అయ్యయ్యయ్యో అయ్యయ్యయ్యో
నెరజాణ మెరుపెక్కిందయ్యో
అయ్యయ్యయ్యో అయ్యయ్యయ్యో
మొహమాటం చెట్టెక్కిందయ్యో
ఆ: అచ్చిక బుచ్చికలాడి నును వెచ్చని తాకిడితోటి
నిప్పుల కుంపటి చప్పున పెడితే ఎట్టా ఆర్పేసేది
అ: వెన్నెల పందిరి వేసి మరుమల్లెల మంచం వేసి
ఇద్దరి మధ్యన దుప్పటి కడితే ఘోరం కాదా దేవి
ఆ: చాటుగా వచ్చి చేతి వాటాన చెయ్యవో ఇంత వన్నెల బోణి
అ: లేత ప్రాయాలు అప్పగించాలి ఓసీ పంతాల మారి
మారి మారి మారి మారి... మారి మారి మారి... ॥అయ్యయ్యయ్యో॥
అ: అయ్యయ్యయ్యో... అయ్యయ్యయ్యో చలికాలం చంపేస్తోందయ్యో
ఆ: అయ్యయ్యయ్యో... అయ్యయ్యయ్యో చలిగాలికి కుర్రాడొటయ్యో
ఆ: అయ్యో అ: అయ్యయ్యయ్యో ఆ: అయ్యయ్యయ్యో(2)



## రచన: కులశేఖర్ — 1 — గానం : ఆర్పీ పట్నాయక్, కోరస్

వీరి వీరి గుమ్మడి పండు వీరి పేరేమి
దాగుడు మూతల దండా కోరు వీరి పేరేమి
ఇది మనుషులు ఆడే ఆట అనుకుంటారే అంతా
ఆ దేవుడు ఆడే ఆట అని తెలిసేదెపుడంటా
అయ్యో ఈ ఆటకీ అంతే లేదుగా
ఐనా లోకానికి అలుపే రాదుగా
ససమమపపగగమరిస(4) ॥వీరి వీరి॥
ఎవరికి వారొక తీరు చివరికి ఏమౌతారు
పైనున్న దేవుడు గారూ మీ తెలివికి జోహారు
బంధం అనుకున్నదీ బండగ మారునా
దూరం అనుకున్నదీ చెంతకు చేరునా ॥వీరి వీరి॥

## రచన : కులశేఖర్ — 2 — గానం : రవివర్మ బాలాజీ, ఆర్.పి, కోరస్

కో తరత్ తరత తరత్తర(2)
సబ్బాసి సబాసే సబ్బాసి సబ్బాసే(2)
బండి బండి రైలుబండీ వేళకంటూ రాదులెండీ
దీన్ని గాని నమ్ముకుంటే ఇంతేనండీ ఇంతేనండీ ॥బండి॥
ధడక ధడక దీని మాయదారి నడక
ఉలికి ఉలికి పడకే చిలకా
జరుగు జరుగు మనక ఇది జరగలేదు జనకా
క్రీస్తు పూర్వమింజను గనకా ॥సబ్బాసి॥
చ: రంగులతో హంగులతో పైన పటారం
అబ్బో సూపరని పొంగిపోతోయ్ లోన లొటారం
అందరిలో నిందలలా ఎంత విడ్డూరం
అయ్యో రైలంటే మిడిల్ క్లాసు నేల విమానం
కూత చూడు జోరుగుందిరోయ్
దీని తస్సదియ్య అడుగు ముందుకేయకుందిరో
ఎంతసేపు దేకుతుందిరో
దీని దిమ్మదియ్య చూడు చూడు నత్తనడకరో
ఇది జీవితంలో ఎప్పటికీ టైముకసలు రాదుకదా ॥సబ్బాసి॥
కో: దవ్వాదవ్వాదవ్వాదవ్వా సబ్బాసి సబ్బాసే(2)
చ: డొక్కుదనీ బొక్కిదనీ మూలపడేయిరూ
ఇలా ముక్కుతున్నా మూల్గుతున్నా తిప్పుతుంటారు
పాత సామాన్లోడికైనా అమ్ముకుంటేనూ
తలో పిడికెడునో గుప్పెడునో శెనగలొచ్చేను
ఎంత పొడవు వుంది చూడరో
దీని బండబడ ఊరి చివర ఇంజినుందిరో
ఎంత పొగలు కక్కుతుందిరో
దీని దుంపతెగ బొగ్గుకొండ మింగినాదిరో
నువు ఎక్కబోయే రైలెపుడు లైపు టైము లేటుకదా ॥బండి॥

## రచన : కులశేఖర్ — 3 & 8 — గానం : ఆర్.పి పట్నాయక్/ఉష

అందమైన మనసులో యింత అలజడెందుకో ఎందుకో ఎందుకో ఎందుకో
తేలికైన మాటలే పెదవిదాటవెందుకో ఎందుకో ఎందుకో ఎందుకో
ఎందుకో అసలెందుకో అడుగెందుకో
మొదటిసారి ప్రేమ కలిగినందుకా ॥అందమైన॥
చ: అక్షరాలు రెండే లక్షణాలు ఎన్నో
ఏమని చెప్పాలి నీతో
ఒక్కమాట ఐనా తక్కువేమి కాదే
ప్రేమకు సాటేదీ లేదే





నీ బాధ నాబాధ కాదా
అ: యహో..రాయె
ఆ: అబ్బబ్బా..రానురాను నానురాను కుదరదయ్యో
కాదు కాదు వీలుకాదు వొగ్గేయ్‌వయ్యో
వద్దు వద్దు మీద మీద పడకురయ్యో
సిగ్గు సిగ్గు సిన్నకోక లాగకయ్యో
అ/ప: రాను రానంటూనే సిన్నదో సిన్నదో
రాములోరి గుడికొచ్చే సిన్నదో సిన్నదీ (2)
కాదు కాదంటూనే కుర్రదో కుర్రదో
తోటకాడకొచ్చిందీ కుర్రదో కుర్రదీ
పచ్చి పచ్చివంటూనే పిల్లదో పిల్లదో
పళ్ళొట్టుకొచ్చిందో పిల్లదో పిల్లదీ ॥రానురాను॥
కో: ఏంపండు తీసుకొచ్చిందిరా అబ్బాయ్
యాపిల్‌పండు, నారింజపండు, బత్తాయిపండు, బొప్పాయిపండు,
అనసపండు, పనసపండు, నిమ్మపండు దానిమ్మపండు,
మామిడిపండు, అరటిపండు
చ: రాను అనీ కాదు అనీ అంతలేసి మాటలనీ
సంతకొచ్చె సూడవయో సిన్నదీ
కాదనంటే ఔననిలే, లేదనంటే ఉందనిలే
ఆడవారి మాటతీరు వేరులే
ఔనామైనా మాతో చెందెయ్ చిందెయ్
ఆ: బాబోయ్ రానోయ్ నాకసలే సిగ్గోయ్ సిగ్గోయ్
అ: సిగ్గు సిగ్గంటూనే సిన్నదో సిన్నదో
సీరంత జార్చిందా సిన్నదో సిన్నదీ
కస్సుబుస్సంటూనే కుర్రదో కుర్రదో
కౌగిట్లో వాలిందా కుర్రదో కుర్రదీ
హాలిలోరంగ హాలిహాలి సామిరంగ హాలిహాలి
ఏంటో ఎవ్వరూ పట్టించుకోవడం లేదేంటి
గాజువాక పిల్లా మేం గాజులోళ్ళం కాదా
చెయ్యిచాప లేదా మా గాజు తొడగ లేదా
చ: తప్పు అనీ గిప్పు అనీ అందరిలో ముందరనీ
సాటుగొచ్చి సిందులేసె సిన్నదీ
తప్పనంటే ఒప్పనిలే ఒప్పనింటే తప్పనిలే
సూటిగాను సెప్పదయా ఆడదీ
రావే పిల్లా ఎందుకు మల్లా గుల్లా
ఆ: ఎల్లోయ్ ఎల్లోయ్ ఎల్లెల్లు ఎల్లో ఎల్లోయ్.. ॥రానురాను॥

## రచన : కులశేఖర్ — 11 — గానం : ఆర్పీ పట్నాయక్, కోరస్

దుష్కరవినాశనం పుష్కర విభూషణం
సత్పథ ప్రదర్శనం తవపాద పంకేరుహం
శంకర నిజాంశజం సంకట విమోచనం
సింధుర ధురంధరం ప్రణమామి ప్రణమామ్యహం
రవిమార్గ సంచారి కపిరాజ మాంపాహి
హేమ భూషావేష హే మారుతే
రణరంగ హుంకారి రాక్షస వధంకారి
రామ భక్తావేశ రాగద్యుతీ
శుభమానసానాం ప్రభూతార్ణవానాం
పదా ధైర్యశీల ప్రభా భాసురాణాం
సర్వాణి కార్యాణి సిద్ధ్యంతి నిత్యం!

అన్నెంపున్నెం ఎరగని మా సీమకు రారామ్మని
ఆహ్వానం అందించనీ మెరిసే చూపునీ
తొలగింది ముప్పు అని నీలి మబ్బు మనసారా నవ్వనీ
చిరుఝల్లు ముప్పు మన ముంగిలంత ముత్యాలే చల్లనీ
ఆశా సుగంధమై నేలంతా సంక్రాంతి గీతమే పాడేలా
శాంతి మంత్రమై గాలంతా దిశలన్ని అల్లనీ ఈ వేల
కో: జడివాన జాడతో ఈ వేల జన జీవితాలు చిగురించేలా
రాలసీమలో ఈ వేల రతనాల ధారలే కురిసేలా (2)
తకధింతత తకధింతత(2)
చ: భువిపై ఇంద్రుడు పిలిచెరా వరుణా వరదై పలుకరా
ఆకసాన్ని ఇల దించరా కురిసే వానగా
మారని యాతన తీర్చగా మాతల రాతలు మార్చగా
ఈ జలయజ్ఞం సాక్షిగా తలనే వంచరా
చ: మహారాజా తాను సమిదల్లే మారి నిలువెల్లా వెలిగెరా
భోగాన్ని విడిచి త్యాగాన్ని వలచి తాపసిగా నిలిచెరా
చ: జన క్షేమమే తన సంకల్పముగా తన వూపిరే హోమ జ్వాలలుగా
స్వర్గాన్నే శాసించెనురా అమృతమును ఆహ్వానించెనురా
కో: జడివాన జాడతో ఈ వేల జన జీవితాలు చిగురించేలా
రాలసీమలో ఈ వేల రతనాల ధారలే కురిసేలా ॥ఘల్లు ఘల్లు॥ కో: ॥జడివాన॥ (2)

## రచన: సీతారామశాస్త్రి 5 గానం: కె.కె., మహాలక్ష్మి

కో: గుంతకచక గుంతక్‌చకచక గుంతక్
అ: దాయి దాయి దామ్మా కులికే కుందనాల బొమ్మ
నీతో పనివుందమ్మా నడిచే కొండపల్లి బొమ్మ
ఆ: దాయి దాయి దామ్మా పలికే గండు కోయిలమ్మ
నీపై మనసైయిందమ్మా నా నిండు చందమామ
అ: బహో బహో... ఒళ్లో వాలుమా
ఆ: ఓహో...ఓహో యసే వేణువా
అ: నిలువెల్లా విరబూసే నవ యవ్వనాల కొమ్మ
ఆ: తొలి జల్లయ్ తడిమేసే సరసాల కొంటె తనమా ॥దాయి దాయి॥
అ: టక టక మంటూ తలుపును తట్టి తికమకపెట్టే... యే...
లకుమిక పిట్టా నిను వదిలితె ఎట్టా
ఆ: నిలబడమంటూ నడుమును పట్టి కితకిత పెట్టే... యే...
మగసిరి పట్టా కథ ముదిరితే ఎట్టా
అ: కేరింత లాడుతూ కవ్వించలేదా
కాదంటె యిపుడూ తప్పేదెలా
కో: అరె కాదంటె యిపుడూ తప్పేదెలా
ఆ: నీ కౌగిలింతకు జాలంటు లేదా
ఏం దుడుకు బాబోయ్ ఆపేదెలా
కో: అయ్యో ఏం దుడుకు బాబో అపేదెలా
కో: ఒహో... ఓ... అ: కోరిందే కదా
కో: ఒహో... ఓ... ఆ: మరీ ఇంతిదా
అ: మరి కొంచెం అనిపించే ఈ ముచ్చటంత చేదా
ఆ: వ్యవహారం శృతిమించె సుకుమారి బెదరి పోదా
అ: హాయే హాయే హాయె అరెరె పైట జారిపోయే
పాప గమనించవే మా కొంప మునిగిపోయే



ఆ: మల్లెపూలు చూస్తు మండిపడుతున్నా
అ: ఏ రోజుకారోజు నా మోజులెన్నో మరుగుతున్నాయే
ఆ: ఈ రోజు నా రాజు లవ్ సెగలు ఎన్నో రగులుతున్నాయిలే ॥అమ్మడు॥
కో: తుం తనక తుంతనక తుంతకిట తుంతకిట(3)
ఆ: బిక్కచిక్కి నడుమేదో బావురమంటుంటే
కో: డోలు డోలోయన్నా డోలన్నా డోలో
అ: అందమంతా అచ్చొచ్చి చిచ్చే పెడుతుంటె
కో: కోలు కోలోయన్నా కోలన్నా కోలో
ఆ: బిక్కచిక్కి నడుమేదో బావురమంటుంటే
అ: అందమంతా అచ్చొచ్చి చిచ్చే పెడుతుంటె
ఆ: ఏ పూటకాపూట నీపాట నాదై పలకరించాలిలే...
అ: ఈ పూట నీపైట ఆ చోట మాటే వినను అన్నాదిలే... ॥అమ్మడు॥

## రచన : భువనచంద్ర 3 గానం : ఉదిత్‌నారాయణ్, చిత్ర

సిమ్మా సిమ్మాలే సిమ్మాసిమ్మాలే సిమ్మాసిమ్మాలే (2)
ప/ఆ: రాదే గోవింద ప్రేమే పుట్టిందా
కసిగా రమ్మంటూ కబురెట్టిందా
అ: కృష్ణా ముకుందా కన్నె కిమ్మిందా
జడతో నా మనసు లాగేసిందా
చ/ఆ: ప్రియ పురుషా వరసా ఇహా కలిపేయమంటా
అ: మృధువదనా పతినై పరిపాలించనా
చలో హద్దుల దుమ్ము దులిపేస్తాలే బుగ్గలు రెండు కొరికేస్తాలే
అంతగా నచ్చావమ్మో అనసూయమ్మో ॥రాధే గోవింద॥
కో : నాదరిందన నాదరిందన(2)
ఆ: నీకోసమే పుట్టానని ఊరించకోయ్ వాత్సాయనా
అ: నాకోసమే వచ్చావని వాటేసినా వయ్యారమా
ఆ: తొలి ప్రేమజల్లులే కురవాలంటా పరువాల పంటలే పండాలంటా
అ: చెలి బుగ్గ సిగ్గుతో మెరవాలంటా కౌగిళ్ల జాతరే జరగాలంటా
ఆ: అరె ఆకలి వేస్తే సోకులు ఇస్తా సోకులతోటే షాకులు ఇస్తా
ఒడిలో సరాసరి పడకేసెయ్ మామ
అ: కృష్ణా ముకుందా కన్నె కిష్మిందా
కిస్‌మై లిప్పంటూ కవ్వించిందా ॥రాధే గోవింద॥
అ: అంగాంగమూ వ్యామోహమే నీ పొందుకై ఆరాటమే
ఆ: ఒదిలేసెయ్ నీ మోమాటమే సాగించవోయ్ సల్లాపమే
అ: రవిరాణి దర్శనమ్ యివ్వాలంటా ఏకాంత సేవనే చెయ్యాలంటా
ఆ: పసి గువ్వ రెక్కలే విప్పిందంటా నీకోసం పక్కలే పరిచిందంటా
అ: అరె మెత్తగ వస్తే హత్తుకు పోతా హత్తుకు నిన్ను ఎత్తుకు పోతా
సిరినే మగసిరితో దోచేస్తా భామా ॥రాధే గోవింద॥

## రచన : సీతారామశాస్త్రి 4 గానం : బాలు, మల్లికార్జున

ప/అ: ఘల్లు ఘల్లుమని సిరిమువ్వల్లే చినుకే చేరగా
ఝల్లు ఝల్లుమని పులకింతల్లో పుడమే పాడగా ॥ఘల్లు॥
హరివిల్లు విప్పి కరిమబ్బు వాన బాణాలే వేయనీ
నిలువెల్ల మంచు పడగళ్ళు తాకి కడగళ్ళే తీరని
: జడివాన జాడతో ఈ వేల జన జీవితాలు చిగురించేలా
రాలసీమలో ఈ వేల రతనాల ధారలే కురిసేలా (2) ॥ఘల్లు॥
చ: రాకాసులు యిక లేరని ఆకాశానికి చెప్పనీ
ఈ రక్తాక్షర లేఖని యిపుడే పంపనీ



ఆ: వయసులో చూసి అడుగెయ్యాలి సరసమే ఆపవా
అ: నీకు సందేహమా...?! ॥ప్రియతమా॥
తకిటతదిమి తకిటతదిమి తందానా హృదయ లయల జతుల గతుల తిల్లానా (2) ॥ప్రియతమా॥
చ/ఆ: మనసు కనులు తెరిచా మన కలల జడిలో అలిశా
అ: చిగురు పెదవినడిగా ప్రతి అణువు అణువు వెతికా
ఆ: మాటలే నాకు కరువయ్యాయి కళ్ళలో చూడవా
అ: మనసులో భాష మనసుకు తెలుసు నన్నిలా నమ్మవా
ఆ: ప్రేమ సందేశమా...?! అ: ॥ప్రియతమా॥

## రచన : కులశేఖర్ 7 గానం : కె.కె.

ప్రేమా ప్రేమా ప్రేమా
ప్రేమా ప్రేమా నీకు ఇది న్యాయమా
ప్రేమా ప్రేమా ప్రేమించడం నేరమా
కళ్లలో నీరు నీవే గుండెలో కోత నీవే
మౌనగానాలు నీవే పంచ ప్రాణాలు నీవే
కాలం ముళ్లబడిలో బతుకే పతనమా
దైవం కరుణిస్తే మాదే విజయమా ॥ప్రేమా॥
చ: కనులే కరువైతే అందమెందుకు
వనమే ముళ్ళయితే కంచెలెందుకు
కలలే కథలై బతుకై చితులై సాగే పయనం నీదా ప్రేమా ॥ప్రేమా॥
చ: చెలియా శిలలేక కోవెలెందుకు
జతగా నువులేక నేను ఎందుకు
మమతే కరువై మనసే బరువై లోకం నరకం కాదా ప్రేమా

## రచన : కులశేఖర్ 9 గానం : గ్రూప్ సాంగ్

అభిమంత్రణం ఉత్సాహయంత్రణం
అరివీరఘోర మారణోద్యమోస్తు నిరంతరం
వీరకర్మతం రుధిరాక్త కర్పురం
భయదూర్వదుజ్వలత్ స్ఫురత్ ప్రచండతరంపరం
సరళం విరళం గరళం కదనం
మృదులం ఇధురం హృదయం జయదం
సరసం సదయం హృదయం వ్యధితం హుం...
జననం సహజం మరణం సహజం
చరితం లిఖితుం జ్వలితం హృదయం
గమనం ప్రథమం ప్రథితుం విజయం జం...
ఎగసే అలలే ఆదర్శమవ్వాలిరా
ప్రేమభేరి గుండెల్లో మోగించరా
బరిలో పులిలా తొడగొట్టి లంఘించరా
ప్రేమకున్నబలమెంతో చూపించరా
ప్రవహించే రక్తం ప్రేమేరా
ఎదిరించే ధైర్యం ప్రేమేరా
యుద్ధానికి అస్త్రం ప్రేమేరా
నీ లక్ష్యం ప్రేమేరా
జయం నిశ్చయం నిశ్చయం నిశ్చయం నిశ్చయం
జయం నిశ్చయం నీ జయం నిశ్చయం!

## రచన : కులశేఖర్ 10 గానం : ఆర్.పి. పట్నాయక్, ఉష

ఏమైందిరా బాధగావుంది
నాకులేని బాధ నీకెందుకురా



రైలుబండి కూతె సన్నాయి పాట కాగా
రెండు మనసులొకటయ్యేనా
కోయిలమ్మ పాటే మది మీటుతున్న వేళా
కాలి మువ్వ గొంతు కలిపెనా ॥అందమైన॥
చ: ఓనమాలతోనే ఓనమాలు నేర్చి
ఒడిలో చేరిందా ప్రేమా
కంటి చూపుతోనే కొంటె సైగచేసీ
కలవరపెడుతోందా ప్రేమా
గాలిలాగ వచ్చి ఎదచేరెనేమొ ప్రేమా
గాలివాటు కాదేవైనా
ఆలయాన దైవం కరుణించి పంపెనమ్మా
అందుకోవె ప్రేమ దీవెనా ॥అందమైన॥

## రచన : కులశేఖర్ 4 గానం : ఆర్.పి. పట్నాయక్, ఉష

ప/అ: ఎవ్వరు ఏమన్నా మారదు ఈ ప్రేమ
ఆ: ఎవరూ రాకున్నా ఆగదు ఈ ప్రేమ
అ: నెత్తుటి కత్తికి ఏనాడు లొంగదు ఈ ప్రేమ
ఆ: మెత్తని మనసును ఏ రోజూ వీడదు ఈ ప్రేమ
అ: కులమూ మతమూ లేవంటుంది మనసుకి ఈ ప్రేమ
ఆ: నింగీ నేలా ఉన్నన్నాళ్ళు ఉంటుందీ ప్రేమ ॥ఎవ్వరు॥
చ/అ: కాలమొస్తే సిరిమల్లెతీగకి చిగురే పుడుతుంది
ఆ: ఈడువస్తే ఈ పడుచు గుండెలో ప్రేమే పుడుతుంది
అ: గొడుగు అడ్డు పెట్టినంతనే వానజల్లు ఆగి పోవునా
ఆ: గులక రాయి వేసినంతనే వరదజోరు ఆగిపోవునా
అ: ఏడు లోకాలు ఏకం ఐనా ప్రేమను ఆపేనా ॥ఎవ్వరు॥
చ/ఆ: ప్రేమ అంటే ఆ దేవుడిచ్చిన చక్కని వరమంట
అ: ప్రేమ ఉంటే ఈ మనసుకెప్పుడూ అలుపేరాదంట
ఆ: కండలెంత పెంచుకొచ్చినా కొండనెత్తి దించలేరుగా
అ: కక్షతోటి కాలు దువ్వినా ప్రేమనెవ్వరాపలేరుగా
ఆ: ప్రేమకెపుడైన జయమేగాని ఓటమిలేదంటా ॥ఎవ్వరు॥

## రచన : కులశేఖర్ 5 గానం : ఆర్.పి. పట్నాయక్, ఉష

అ: నేస్తమా నేస్తమా
ఆ గుడిగంటలు మోగితే నువ్వొచ్చావనుకున్నా
ఏ జడగంటలు ఊగినా నువ్వేలే అనుకున్నా
ఆ: నీ ఊహల్లో రేయీ పగలూ నే విహరిస్తున్నా
నీ జ్ఞాపకమే ఊపిరికాగా ఇంకా బతికున్నా ఇంకా బతికున్నా
అ: ఎప్పుడు చూస్తానో నీ నవ్వుల పువ్వులనీ
ఎప్పుడు వింటానో నీ మువ్వల సవ్వడినీ

## రచన : కులశేఖర్ 6 గానం : ఆర్.పి. పట్నాయక్, ఉష

అ: ప్రియతమా తెలుసునా నా మనసు నీదేననీ
హృదయమా తెలుపనా నీకోసమే నేననీ
కనుపాపలో రూపమే నీవనీ
కనిపించని భావమే ప్రేమనీ ॥ప్రియతమా॥
చ: చిలిపి వలపు బహుశా మనకథకి మొదలు తెలుసా
ఆ: దుడుకు వయసు వరసా అరె ఎగిరిపడకె మనసా
అ: మనసులో మాట చెవినెయ్యాలి సరసకే చేరవా



అశ్వినీదత్



సి.అశ్వనీదత్ మణిశర్మ బి.గోపాల్



బి. గోపాల్



వేటూరి



మణిశర్మ



సీతారామశాస్త్రి



భువనచంద్ర



కులశేఖర్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : చిన్నికృష్ణ |
| మాటలు | : పరుచూరి బ్రదర్స్ |
| పాటలు | : వేటూరి, సీతారామశాస్త్రి, భువనచంద్ర, కులశేఖర్ |
| నేపథ్యగానం | : బాలసుబ్రహ్మణ్యం, ఉదిత్‌నారాయణ, శంకరమహదేవన్, చిత్ర, మల్లికార్జున్, కార్తీక్, కె.కె., హరిహరన్, కల్పన, మహాలక్ష్మి |
| ఎడిటింగ్ | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫోటోగ్రఫీ | : వి.ఎస్.ఆర్. స్వామి |
| సంగీతం | : మణిశర్మ |
| స్టిల్స్ | : దాస్ |
| కాస్ట్యూమ్స్ | : గాలిబ్ |
| మేకప్ | : శివ |
| ఫైట్స్ | : విక్రం ధర్మా |
| డాన్స్ | : లారెన్స్, రాజు |
| ఆర్ట్ | : అశోక్ |
| పబ్లిసిటీ డిజైనర్ | : సురేష్‌బాబు |
| ప్రొడక్షన్‌కంట్రోలర్ | : మోహన్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : నర్సయ్య, గురవయ్య (మద్రాస్), శేషు |
| కో-డైరెక్టర్స్ | : యస్.వి.చక్రవర్తి, తరుణ్, ప్రభాకరండ్, విజయభాస్కర్‌రెడ్డి |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : కరీం, కిరణ్, శ్యామ్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : కె.ఎస్. సాయిబాబా |
| సమర్పణ | : సి. ధర్మరాజు |
| నిర్మాత | : సి. అశ్వనీదత్ |
| దర్శకత్వం | : బి. గోపాల్ |

## తారాగణం

చిరంజీవి, ఆర్తీ అగర్వాల్, సోనాలీబింద్రే ప్రకాష్‌రాజ్, పునీత్ ఇస్సార్, ముఖేష్‌రిషి, భరణి, S.P.బాలసుబ్రహ్మణ్యం, హేమంత్‌రావణ్, జీ.వి., ప్రసన్నకుమార్, రాజారవీంద్ర, సునీల్, ఆహుతి ప్రసాద్, వినోద్, కల్పన, వినయ్‌ప్రసాద్, శివాజీ, బ్రహ్మానందం, ఏ.వి.ఎస్., ఎమ్మెస్‌నారాయణ, ధర్మవరపు, రాజామురాద్, శివకృష్ణ, సమీర్, కల్పన, సర్రా, శకుంతల, ఢిల్లీరాజేశ్వరి, రజిత, విమలశ్రీ, శోభారాణి, నివాస్, మాస్టర్ ఆనందవర్ధన్, లహరి, రేణు, అల్లురామలింగయ్య, పావలాశ్యామల, వేణుగోపాల్‌రెడ్డి, సిద్ధప్పనాయుడు, రాజశ్రీ, మల్లాదిరాఘవ, నర్సింగ్‌యాదవ్, అంజనాహారి, రఘునాథరెడ్డి, షాజిద్‌ఖాన్, నర్సయ్య, కె.కె.శర్మ కాదంబరికిరణ్, దీక్షితులు, మధు, మణిపాల్‌రెడ్డి.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



## తారాగణం

నితిన్, సదా, శివకృష్ణ, ప్రసాద్‌బాబు, గోపీచంద్, లక్ష్మీపతి, దువ్వాసి మోహన్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ఢిల్లీ రాజేశ్వరి, ఆలపాటి లక్ష్మి, బేబి శ్వేత, మాస్టర్ సాయి అనిల్, బేబి ప్రత్యూష, సుమన్ రాయల్, సూర్యనారాయణ తదితరులు.

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'** పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



# జయం



ఆర్.పి. పట్నాయక్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : ఆర్పీ పట్నాయక్ |
| అసిస్టెంట్ | : అనూప్ |
| పాటలు | : కులశేఖర్ |
| ఎడిటింగ్ | : శంకర్ |
| ఆర్ట్ | : నారాయణరెడ్డి |
| ఆర్ట్ అసిస్టెంట్ | : సురేష్ |
| కొరియోగ్రఫీ | : శంకర్ |
| ఫోటోగ్రఫీ | : సమీర్ రెడ్డి |
| ఫైట్స్ | : హార్స్‌మెన్ బాబు |
| స్టిల్స్ | : రాజా |
| కో-డైరెక్టర్ | : ఆనంద్ |
| అసోసియేట్స్ | : కృష్ణ, గౌతమ్, చేతన్ |
| అసిస్టెంట్స్ | : ప్రసాద్ |
| మేకప్ | : భాస్కర్ |
| కాస్ట్యూమ్స్ | : కృష్ణ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : ఖాన్, అంజనేయులు, రవి |
| కథ - స్క్రీన్‌ప్లే - మాటలు - నిర్మాత - దర్శకత్వం | : తేజ |



తేజ



కులశేఖర్

జులై 19 రాజేంద్రప్రసాద్ పుట్టినరోజు సందర్భంగా...

# నవ్వేజనా సుఖినో భవంతు

**- రాజేంద్రప్రసాద్**



ఓ సారి ఓ స్టేజి మీదికి దాశరథిగారిని ఆహ్వానిస్తూ - ఆస్థాన కవి అని, నా తెలంగాణా కోటి రతనాల వీణ అన్న 'మహాకవి' అని మధుర సినీ గీత రచయిత అని రకరకాలుగా సంబోధించారు.

దానికి దాశరథిగారు స్పందిస్తూ - దాశరథి అంటే ఎవరో తెలియని వాడికి ఈ బిరుదులు. ఈ వర్ణనలు మాత్రం ఏం అర్థమవుతాయి అని అన్నారు. రాజేంద్ర ప్రసాద్ విషయంలో కూడా ఇదేమాట అనుకోక తప్పదు. పక్కన ఏ విశేషణాన్ని చేర్చినా 'ఇంకేదైనా బెటర్ వర్డ్ ఉంటుందేమో!?! అని అనిపించగల చరిత్ర ఆయన ఎక్స్‌ప్రెషన్లకి ఉంది. అంతెందుకూ..... ఇటీవల 'హాయ్' సినిమా ప్రెస్‌మీట్‌లో కామెడీ గురించి మాట్లాడుతూ 'ఇవాళ్టికీ రాజేంద్రప్రసాద్‌కి ఆల్టర్నేటివ్ ఆర్టిస్ట్ లేడు' అని అన్నారు ఇవీవి. ఇది చాలదూ.... రాజేంద్రప్రసాద్ స్టామినా ఏమిటో చెప్పడానికి....

అంచేత ఆయన 'హాసం' పాఠకులతో తన పుట్టిన రోజు సందర్భంగా పంచుకోవాలనుకున్న భావాలకు ప్రశ్నలూ, ప్రశ్నలేసే వాడూ అడ్డంగా ఎందుకని నేరుగా ఫాస్ట్‌ఫుడ్ లెవెల్లో అందజేస్తున్నాం.

జస్ట్ టేస్ట్......

ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో ఉండగా ఛాప్లిన్ ఫిలిం ఫెస్టివల్‌కి అటెండ్ అవటం జరిగింది. కామెడీ టచ్ ఇవ్వగలిగితే ఎటువంటి వేషమ్మైనా వేసి నెగ్గుకు రావచ్చనిపించింది. కామెడీకి సంబంధించిన ఎన్నో అయిడియాలు మైండ్‌లో షేప్ అవటం మొదలయింది అప్పట్నించే!



నా పుట్టినరోజుకి మా ఆవిడతో కలిసి వెళ్ళి అనాధ భాలల మధ్య గడపటం అలవాటు. కావాలంటే ఈ ఫోటో చూడండి. మాతో గడిపినప్పుడు వాళ్ళ ముఖాలలో కనిపించే ఆనందం చూస్తుంటే - మనం సాధించినది సార్థకమైనదే అని అనిపిస్తూ ఉంటుంది. అలాగే మా ఇద్దరి ముఖాల్లో కనిపించే నవ్వుల్ని చూడండి. ఎంత హాయిగా తృప్తిగా ఫీలవుతున్నామో తెలుస్తుంది. జీవితంలో మరిచిపోలేని వాటిని మైల్‌స్టోన్స్ అంటారుచూడండి... ఆ నవ్వులు మాత్రం మాకు స్మైల్ స్టోన్స్ అన్నమాట.



విశాఖపట్నంలో పండిట్ రవిశంకర్ గారికి సన్మానం జరిగినరోజు బాలుగారు, సుశీలగారు, పి.బి.శ్రీనివాస్‌గారు, జానకిగారు ఇలా ఎంతోమంది గాయనీ గాయకులు ఆయన ముందు తమ పాటలను వినిపించారు. నాలో ఏదో తెలియని ఆవేశం... నాలో ఉన్న టాలెంట్ కాస్తయినా చూపించాలాయనకి. నటించే ప్లేస్‌కాదని, 'సత్యహరిశ్చంద్ర' నాటకంలోని 'దేవబ్రాహ్మణ మాన్యంబులు' పద్యం ఎత్తుకున్నాను. ఆయన కళ్ళలో ఏదో ఫీలింగ్.... 'ఆర్ యూ యాన్ యాక్టర్ ఆర్ సింగర్' అన్నారు. నా గురించి నాకు తోచింది రెండు ముక్కల్లో చెప్పాను. 'యువార్ ఎక్స్‌క్లూజివ్.... గాడ్ బ్లెస్‌యూ' అని దీవించారాయన తలపైన చెయ్యివేసి.



ఇంజనీరింగ్ చదువుతున్న రోజుల్లో

కమేడియన్లు చాలా మంది హీరోలుగా చేశారు. హీరోలు కూడా కామెడీ చాలావరకు చేశారు. కానీ కామెడీకి హీరోయిజాన్ని కల్పించింది రాజేంద్ర ప్రసాదే అని పెద్దలు, అనుభవజ్ఞులు అన్నమాటలు తల్చుకుంటూ ఉంటే ఎంతో తృప్తిగా ఉంటుంది.

'స్ట్రెస్, టెన్షన్, రిలీజవడానికి నేను రాజేంద్రప్రసాద్ సినిమాల వీడియోలు చూస్తుంటాను' అని అన్నారు పి.వి. నరసింహారావు గారు - ఆయన ప్రధానిగా ఉన్నరోజులలో! అంతకన్నా గొప్ప కాంప్లిమెంట్ ఏముంటుంది!?



నవ్వేజనా సుఖినో భవంతు అన్నదే
మన పాలసీ



ఎ.యన్.ఆర్., యన్.టి.ఆర్. వేసిన డబుల్‌రోల్ సినిమాలు చూసి తనుకూడా అలా చేయాలన్న ఆలోచనతో తనకు తానుగా తీసుకున్న ద్విపాత్రాభినయం ఫోటో ఇది

'ఎర్రమందారం'లో నటనకి ఉత్తమ నటుడిగా నందీ అవార్డుని అందుకునే సమయంలో జస్టిస్ చెన్నకేశవరెడ్డి గారన్నమాటలు ఇప్పటికీ చెవులో మారుమ్రోగుతూ ఉంటాయి. "ఈ అవార్డుని రాజేంద్రప్రసాద్‌ని నిర్ణయించే ముందు మార్కులు చూసుకుంటే మరొక అగ్రనటునికి కూడా అంతే మార్కులు పడ్డాయి. అప్పుడు కమిటీ మళ్ళీ ఆలోచించడం జరిగింది. ఆ అగ్రనటుడి పాత్రలో ఆయన ఎక్కువగా కనబడ్డారు. ఎర్ర మందారంలో రాజేంద్రప్రసాద్ కనబడలేదు. పాత్ర కనబడింది. అందుకే ఉత్తమ నటుడిగా ఎన్నికయ్యారు అని ఆనాటి అవార్డు ప్రదానోత్సవ కార్యక్రమంలో కొన్ని వేల మంది ప్రేక్షకులు ముందు అన్నారాయన.

'అహనా పెళ్ళంట' సినిమాకి పెట్టిన పెట్టుబడికి 32 రెట్లు కలెక్ట్ చేసింది. ఆ సినిమాని చూసిన వాళ్ళెవరైనా సరే 210 సార్లు నవ్వి తీర్తారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉత్తమ హాస్య చిత్రంగా నందీ అవార్డుని ఇచ్చింది. ఆ అవార్డు పొందిన చిత్రం అంతకుముందూ లేదూ ఆ తర్వాతా లేదూ.



షూటింగ్ టైమ్‌లో అలసిపోయిన దర్శకుడు రేలంగి నరసింహారావు, రచయిత దివాకరబాబు చిన్న కునుకు తీస్తుండగా వారికి తెలియకుండా కావాలని తీయించిన ఫోటో

మూడేళ్ళ క్రితం - నేను చనిపోయానన్న పుకారు పుట్టినరోజు - వరస ఫోన్ కాల్స్... అందులో ముఖ్యంగా చిరంజీవి... ఫోన్‌లో నా గొంతు వినగానే రిలాక్స్ అయిన ఓ నిట్టూర్పు... ఆ తర్వాత 'ఏంట్రా ఇది!?' అంటూ ఆయన అడిగి ఎంతగా ఆందోళన చెందారో వివరించటం, ఆ తర్వాత విజయ బాపినీడు గారు... ఇవన్నీ ఒక ఎత్తు... నా సహనటులు, నా నిర్మాతలు, దర్శకులు, అభిమానులు, బంధువులు, సన్నిహిత మిత్రులు ఇలా వీళ్ళంతా ఫోన్ చేశారంటే ఒక్కొక్క ఫోన్‌కి ఒక్కొక్క కారణాన్ని చెప్పగలను. కానీ జర్నలిస్ట్‌లు వారి కుటుంబ సభ్యులు ఫోన్ చేసి చూపించిన అవ్యాజమైన ప్రేమ ఒక్కటీ ఒక ఎత్తు. దానికి నేనే కారణాలూ చూపించలేను. ఆ అభిమానాన్ని నాగుండెల్లో నేను బ్రతికినంతకాలం నిలుపుకోవటం తప్ప!

# ఓ సినిమా హిట్‌లో పాటల కాంట్రిబ్యూషన్ ఎంత....!?

# అను

# 'జనమే జయం'

# కథా... కమామీషూ...



ఆంధ్ర రాష్ట్రమంతా ఇప్పుడు "జయం" ఫీవర్‌లో ఉంది. ఏనోట విన్నా "జయం..జయం..జయం" ...

సినిమాలు జనంకేం కొత్త కాదు. కాలప్రవాహంలో ఎన్నో చలనచిత్రాల ఉత్థాన పతనాలను చూసిన వారే జనం. మంచి సినిమాలు తీస్తే బ్రహ్మరథం పడతారు. ఏమైనా తేడావస్తే కాకలు తీరిన స్టార్లకు సైతం నక్షత్రమండలాలు చూపిస్తారు. అదీ జనం బలం. ఈ జనం బలం ఏమిటో తెలిసిన వాడు - ఈ చిత్ర దర్శకుడు తేజ..! జనానికి ఏం కావాలో ఎలా చెప్పాలో తనకి తెలుసు. అది తన టెక్నీషియన్స్ నుంచి ఎలా రాబట్టుకోవాలో అంతకంటే బాగా తెలుసు. ఇందుకు "జయం" సినిమా పాటలే ఉదాహరణ...



ఆర్.పి. పట్నాయక్ తేజ కులశేఖర్

'నువ్వు-నేను' సినిమా తర్వాత తేజ టీమ్ నుంచి వచ్చే సినిమా అంటే తప్పకుండా దాంతో పోలుస్తారు. సో.. అంతకన్నా బెటర్ మూవీ చెయ్యాలి అని టీం అంతా తర్జనభర్జనలు పడిపోతున్నాం. మేం ఈ టెన్షన్‌లో ఉండగానే తేజాగారు ఓ రోజు ఫోన్ చేసి మీరూ ఆర్.పి అర్జెంటుగా ఆఫీస్‌కి రండి అన్నారు. ఆర్.పి. నేను వెళ్ళగానే ఆయన స్టైల్లో "మనం మరో సూపర్ హిట్ కొట్టబోతున్నాం, కథ భలే వచ్చింది కూర్చోండి కూర్చోండంటూ "జయం" కథ చెప్పారు. నాకు, ఆర్.పి. కి కూడ కథ నచ్చింది. ముగ్గురం ఎక్కడెక్కడ పాటలు వచ్చేది నిర్ణయించుకున్నాం. సీన్‌లోనే కాదు పాటల్లోకూడ కథ నడవాలి అప్పుడు ఆడియన్స్ సిగరెట్లకోసం బయటకు వెళ్ళకుండా వుంటారు. వెళ్తే, అరె కథ మిస్సయి పోయామని వాళ్ళ ఫీల్ అవ్వాలి అన్నది తేజాగారి అభిప్రాయం. తేజాగారి సినిమాలన్నీ మ్యూజికల్‌గా సూపర్ హిట్ అవ్వడంతో ఆయన అభిప్రాయం నిజమేనని రుజువైంది.

"జయం" సినిమా పాటతో ప్రారంభమవ్వాలి. హీరోయిన్‌కి చిన్నప్పుడే ఓ కుర్రోడితో పెళ్ళి నిశ్చయం అవుతుంది. పెద్దయ్యాక వేరే కుర్రాడితో ప్రేమలో పడుతుంది. అంటే మనం ఒకటి అనుకుంటే దేవుడు మరోలా చేస్తాడు అన్నట్టుగా పాట రావాలి. చిన్న పిల్లలు పాడుకునేలా వీరీ వీరి గుమ్మడి పండు... అలా వుండాలి అన్నారు తేజ. ఆర్.పి. ట్యూన్ చేశారు

వీరి వీరి గుమ్మడి పండు వీరి పేరేమి
దాగుడు మూతల దండాకోరు వీరిపేరేమి
ఇది మనుషులు ఆడే ఆటా అనుకుంటారే అంతా..
ఆ దేవుడు ఆడే ఆటా అని తెలిసేదెపుడంటా..
అయ్యో ఈ ఆటకి అంతే లేదుగా..
ఐనా లోకానికి అలుపే రాదుగా..

అని రాసేను. చాలా బాగుంది అన్నారు ఆర్.పి. తేజ. అయితే హీరోయిన్ మొదట అనుకున్న కుర్రాడి తో కాకుండా హీరోతో లవ్‌లో పడుతుంది అంటే ఆ బ్రహ్మ ఎవరెవరికి రాస్తాడో తెలియదు అన్న థాట్ రావాలి. డైరెక్టర్ పాయింటాఫ్ వ్యూలో కథ ముందే పాటలో ఆడియన్స్‌కి చేరాలి.

ఎవరికి వారొక తీరు చివరికి ఏమౌవుతారు..
పైనున్న దేవుడుగారూ మీ తెలివికి జోహారు..
బంధం అనుకున్నది బందగ మారునా...
దూరం అనుకున్నది చెంతకు చేరునా...

అని రాసేను. సినిమా కథంతా మొదటి పాటలోనే భలే కుదిరింది. హీరో హీరోయిన్లని క్లైమాక్స్ లో ఓ సూపర్ పవర్ కలపబోతోంది అన్నది అంతర్వాహినిగా ప్రతి పాటలో ఎస్టాబ్లిష్ చేస్తూ వస్తే బాగుంటుంది అన్నారు తేజ. సుజాత (హీరోయిన్) పెద్దయి కాలేజిలో చేరుతుంది. కాలేజిలో వెంకటరమణ (హీరో) అనే కుర్రోడి ప్రేమలో పడుతుంది. అప్పటికే ఈ అమ్మాయికి వేరే కుర్రాడితో పెళ్ళి నిశ్చయం అయిపోయింది. మరో పక్క తొలి ప్రేమ అలజడి .... ఆ అమ్మాయి గుండెలో మౌనరాగాన్ని ఎలా ఆవిష్కరించాలి..?! అన్న మేధోమథనంలో పుట్టింది.

అందమైన మనసులో ఇంత అలజడెందుకో ఎందుకో... ఎందుకో... ఎందుకో...
తేలికైన మాటలే పెదవి దాటవెందుకో.... ఎందుకో... ఎందుకో... ఎందుకో...

అనే పాట. వెంకట్ ప్రేమని అంగీకరించాలా..? వద్దా..? అన్న మీమాంసలో వుంటుంది సుజాత.. "అలయాన దైవం కరుణించి పంపెనమ్మా అందుకోవె ప్రేమ దీవెన"అని రాశాను. అంటే ఇదంతా దైవ నిర్ణయం అని చెప్పటమే కాకుండా ప్రేమ దైవ స్వరూపమని, ప్రేమకేమైనా అయితే అల్లకల్లోలమై ఎంతటి తీవ్ర పరిణామాలు ఏర్పడతాయన్నది సూచన ప్రాయంగా ప్రస్తావించడం జరిగింది.

మరో పక్క " రాను రానంటూనే " పాట తేజా మార్క్ ఫోక్ సాంగ్. ఈ పాట సుజాత వెంకట్‌ల మధ్య తొలిప్రేమ చిగురింతకు పులకింతకు నేపథ్యంగా వాడినా వీళ్ళిద్దరిలో వున్న భక్తి తత్పరత క్లైమాక్స్‌కు సపోర్టుగా వేశారు తేజ.

వీళ్లప్రేమ గురించి ఇంట్లో తెలిసి వీళ్లిద్దరూ విడిపోయాక వచ్చే విరహగీతం 'ప్రేమా ప్రేమా'లో కూడ "దైవం కరుణిస్తే మాదే విజయమా" అనిరాసేను.

సుజాత ,వెంకట్‌ల ప్రేమ గురించి తెలిసిన రఘు (విలన్) వెంకట్‌ని గాయపరుస్తాడు. ఫ్రెండ్స్ సహాయంతో తప్పించుకుని వీళ్లిద్దరూ రైలు ఎక్కి పారిపోతారు. రైల్లో వెంకట్ గాయానికి సుజాత మందు రాస్తూంటుంది. ఇక్కడో బిట్ సాంగ్ వస్తే బాగుంటుందని తేజ గారితో ఆర్.పి అన్నారు. అప్పటికే సినిమా ప్రథమార్థంలో ఐదో ఆరో పాటలొచ్చేయి. ఐనా సరే ఇక్కడ చిన్న బిట్ ఉండాలని ఆర్.పి పట్టుబట్టారు.తేజ గారు సరే రాయండి అన్నారు.

గోరంత ప్రేమ కొండంత బలమిస్తుంది
నీకంట నీరు చిటికేసి తుడిచేస్తుంది
గాయాలను మాన్పే మందే కద ప్రేమా..
ప్రాణాలను పోసే సంజీవని ప్రేమా..

గుండెల్లో ప్రేమ వుంటే వాళ్లకి ఎంత బలమైనా వస్తుంది.... అన్నది డైరెక్టర్ పాయింట్ ఆఫ్ వ్యూలో చెప్పాలి. ఎలాంటి గాయాన్నైనా మాన్పే శక్తి ప్రేమకుంది. ప్రాణాలను పోసే సంజీవని ప్రేమ అని అనడంలో తర్వాత రాబోయే సీన్లలో " అంజనేయ స్వామి" కీలకం కాబోతున్నాడు. సో... తేజ గారు చెప్పినట్లు అంతర్వాహినిగా దైవప్రస్తావన సాగుతూ వచ్చింది. రఘు కూడా రైలెక్కేడని తెలిసి సుజాత, వెంకట్ రైలు మీద నుంచి దూకి అడవుల్లోకి వస్తారు. రఘు కూడా అడవుల్లోకి వస్తాడు. అడవిలో ఓ " అంజనేయ స్వామి" విగ్రహం వద్ద జండా తీసి పట్టుకుని "అర్జునుడి నుంచి ఇవాళ్టిదాక ఈ జెండా పట్టుకున్న వాళ్ళెవరూ ఓడిపోలేదు" అని సుజాతకు ధైర్యం చెప్తాడు. ఇక్కడ ఆంజనేయ స్తోత్రం అనగానే రొటీన్‌గా పాత గ్రంథాలలోది వాడుతుంటారు కాని అలా కాకుండా సినిమా మూడ్‌కి హీరో హీరోయిన్‌ల క్యారెక్టరైజేషన్‌కి తగ్గట్టుగా ఉండాలని ఫ్రెష్‌గా " దుష్కర వినాశనం పుష్కర విభూషణం" ... స్తోత్రం రాసేను. తర్వాత...

"ఎవ్వరు ఏమన్నా మారదు ఈ ప్రేమ "అన్న పాట వస్తుంది. ఇందులో " ప్రేమ అంట ఆ దేవుడు ఇచ్చిన చక్కని వరమంటా" అని రాసేను. మొదట చెప్పిన విషయాన్ని ఇక్కడ మరోసారి గుర్తు చేయడం అంటే వీళ్ళ ప్రేమకి దైవబలం తోడవ్వబోతుంది అన్నది ఎస్టాబ్లిష్ కావాలి.

రఘు రౌడీలతో అడవిలోకి కూడా వచ్చి వెంకట్ సుజాతల కోసం గాలిస్తాడు. ఇక్కడో విషయం చెప్పాలి. రఘు కండలు తిరిగిన బలవంతుడు. తనకు భార్య కావలసిన అమ్మాయి ఇంకొకరికి దక్కకూడదు. ఇది తన ధోరణి..! మరో వైపు వెంకట్ బలహీనుడు. ప్రేమించిన అమ్మాయితో దిక్కు తోచని స్థితిలో వున్నాడు. ఈ బలహీనుడికి ప్రేమ అనే శక్తివంతమైన ఆయుధంతో పాటు "సూపర్ పవర్" అనే "దైవశక్తి" ని కూడా జోడిస్తే కథా, కథతోపాటు మన సెంటిమెంట్స్, కమర్షియల్ ఎలిమెంట్స్ బాగా వర్కవుట్ అవుతాయన్నది తేజ గారి ప్లాన్.

రఘు రౌడీలతో అడవిలోకి వస్తున్నాడన్న సంగతి తెలిసి పారిపోదాం అంటాడు వెంకట్ సుజాతతో. ఈలోపు కొందరు రౌడీలు సుజాతను కొట్టబోతే వెంకట్ ఎదురు తిరుగుతాడు. వెంకట్ శత్రువులని కొట్టగలడని సుజాత గ్రహిస్తుంది. " కొట్టవయ్యా... కొట్టూ..." అన్న మేనరిజంతో వెంకట్‌ని యుద్ధానికి పంపుతుంది. ఇక్కడ సుజాత వెంకట్‌ల క్యారక్టరైజేషన్ గీతలో కృష్ణార్జునులకు సామీప్యంగా ఉన్నట్లు అనిపిస్తుంది. గీతలో అర్జునుడికి శ్రీకృష్ణ భగవానుడు ఎలాగైతే ధైర్యం నూరిపోసి శత్రువుల మీదకు పురిగొల్పుతాడో ఇక్కడ వెంకట్‌కి కూడా సుజాత అలాగే ధైర్య వచనాలు పలుకుతుంది.

అక్కడ అర్జునుడి రథం మీద జెండా..
ఇక్కడ వెంకట్ చేతిలో జెండా ..
అక్కడ అర్జునుడి వెనక శ్రీకృష్ణ పరమాత్మ..
ఇక్కడ వెంకట్ వెనుక సుజాత..
అక్కడ ఇక్కడ కూడా కురుక్షేత్రం..

ఇక్కడ పాట వస్తుంది ఈ పాట రికార్డింగ్ చేసేటప్పుడు తేజా గారు తలకోనలో షూటింగ్‌లో వున్నారు. ఫోన్‌లో సిట్యుయేషన్ చెప్పి, ఆర్.పి. ఫోన్‌లోనే ట్యూన్ చెబితే విని ఓకే చేసి పాట పంపించేయమని అన్నారు. తేజ గారు లేకుండా చాలా కీలకమైన పాట రికార్డ్ చేయాలి. ఆ పాటే ....

ఆభిమంత్రణం ఉత్సాహ యంత్రణం..
అరివీర ఘోర మారణోద్యమోస్తు నిరంతరం..

అని సంస్కృతంలో ప్రారంభమై చివరకు తెలుగు పదాలతో ముగుస్తుంది.

నాకు ఆర్.పి. కి కూడా టెన్షన్. పాట రికార్డింగ్ అయ్యింది. ఆర్.పి. .లెనినా, గాయత్రి, సుధ వీళ్ళంతా ఫస్ట్ టేక్‌లోనే చాల అద్భుతంగా పాడారు. చాలా బాగా వచ్చిందనుకున్నాం. అప్పుడే థియేటర్‌కి వచ్చిన " సంతోషం" దర్శకుడు దశరథ్ ఈ పాట విని నన్ను, ఆర్.పి.ని కౌగిలించేసుకున్నాడు. ఆ పాటలో అంత ఎనర్జీ ఉంది. తేజ గారు ఈ పాట విని చాల హ్యాపీ ఫీలయ్యారు. తేజగారి పిక్చరైజేషన్‌తో మరింత ఎఫెక్టివ్ గా వచ్చింది.

గీతలో కృష్ణుడు అర్జునుడికి చెప్పిన విషయాన్ని బేస్‌గా తీసుకుని ఈ పాట రాయడం జరిగింది. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఒక దర్శకుడికి తను తీసే సినిమా మీద ఎంత అవగాహన వుంటుందో మీ దృష్టికి తేవాలని.. ఒక సంగీత దర్శకుడికి తన సినిమా పట్ల ఎంత కమిట్‌మెంట్ ఉంటుంది అన్నదానికి ఇదో నిదర్శనం. వీళ్ళిద్దరి వల్ల ఈ సువర్ణావకాశం నాకుకూడా కలిగింది. నాతరం గీత రచయితలెవరికి ఇంతవరకు కలగని అదృష్టం ఇది..! మరి అందరు దర్శకులు ఇలాగే వుంటారా అంటే చెప్పలేం.

ఇలా వుంటే మాత్రం "జయం" నిశ్చయం...!

ఎవ్వరు ఏమన్నా... ఎన్ని అవాంతరాలు ఎదురైనా... తేజ కమిట్‌మెంట్ అంటే కమిట్‌మెంటే..!

సినిమా సామాన్య జనం కోసమే తీస్తానంటారు తేజ

అందుకే తేజాకు జనమే బలం...జనమే "జయం"

జయం మధురానుభూతులను మీతో పంచుకునే అవకాశం కల్పించిన "హాసం" వారికి కృతజ్ఞతతో..

...కులశేఖర్

సీరియల్ 12

# సద్దాం ఆంటీ ఇంటి కథ

- మల్లాది వెంకట కృష్ణమూర్తి





## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పౌరాణిక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అంతే కాదు అనన్య ఎంత అడిగినా వివరాలు చెప్పకుండా దాట వేస్తొంటుంది. లింగమయ్య అన్న ఓ మాటతో బామ్మ తనంతట తానుగా అనన్యకు గతం చెప్తూ ఉంటుంది...

అప్పట్లో జిల్లా మొత్తంలో ప్రభుత్వ కార్యాలయాలు వదిలేస్తే పట్టుమని పదిళ్ళల్లో కూడా ఫోన్స్ వుండేవి కావు. దూర ప్రాంతాలకి ఏ విషయం తెలియ చేసుకోవాలన్నా- స్థితిని బట్టి కార్డ్ లేదా టెలిగ్రాంలే శరణ్యం.

హైద్రాబాద్‌కి ముప్పైమైళ్ళ దూరంలోని ఓ చిన్న కుగ్రామం అది. బామ్మ కుటుంబం యావత్తూ అక్కడే వుండేది అప్పట్లో. సైకిల్ మీద ఖాకీ దుస్తుల్లో వస్తున్న టెలిగ్రాం మెసెంజర్‌ని చూసి ఆ వీథిలోని వాళ్ళందరికీ ముచ్చెమటలు పోసాయి. టెలిగ్రాం వాడి సైకిల్ తమింటి ముందు ఆగకుండా ముందుకి సాగిపోయేదాకా వాళ్ళ గుండె చిక్కబట్టుకుని చూస్తున్నారు.

చివరకా సైకిల్ బామ్మగారి తండ్రిగారైన వల్లభరావు ఇంటి ముందు ఆగింది. ఆయన ఆ సమయంలో ఇంట్లో లేరు . ఆయన తమ్ముడు భయంగా చూస్తూ అడిగాడు.

"టెలిగ్రామా? ఎవరికి?"

"మీకేనయ్యా"

"ఎక్కడ నించి? ఏమని?"

"ఇక్కడ సంతకం చేయండి"

అది చేయించుకుని టెలిగ్రాం చదివి పెట్టకుండా 'వర్షం వచ్చేలా వుంది. నేను తొందరగా వెళ్ళాలి' అని అతను సైకిల్ ఎక్కి వెళ్లి పోయాడు.

వణుకుతున్న చేతులతో ఆ టెలిగ్రాం పట్టుకుని గుండె దడ దడలాడుతూంటే, ఆయన నిలబడి వుంటే విషయం తెలిసిన అతని వదిన బయటికి వచ్చి 'నిజంగా టెలిగ్రాం వచ్చిందా?' అని అడిగి తెలుసుకున్నాక 'రామ రామా! నిజంగా టెలిగ్రాం వచ్చిందా?'' అని కుప్పకూలింది. వాళ్ళింటికి టెలిగ్రాం వచ్చిన సంగతి గ్రామమంతా గుప్పుమంది.

అంతదాకా ఆ గ్రామానికి వచ్చిన టెలిగ్రాంలన్నీ దుర్వార్తలు, చావు కబుర్లే తీసుకొచ్చాయి. అలాంటి సందర్భాల్లో తప్ప ఎవరూ టెలిగ్రాంలు ఇవ్వని రోజులవి.

"ఎవరి నించి, ఏమని?'' తేరుకుంటూ మరిదిని అడిగిందావిడ.

"వర్షం వచ్చేలా వుందన్న సాకుతో వాడు చదవకుండా ఉడాయించాడు"

ఆవిడ కొంగుని నోట్లో దోపుకుంది. ఆవిడ వైపు బంధువులు, ఇద్దరు పిల్లలు ఇతర వూళ్ళల్లో ఉంటారు. ఎవరికి ఏమైందో అన్న భయంతో ఆవిడ గుండె బాదుకుంటూ రాగాలు తీయసాగింది.

ధైర్యం కూడగట్టుకుంటూ వల్లభరావు తమ్ముడు వదినని హితవచనాలతో ఓదార్చసాగాడు. అప్పటికే మూగిన అనేకమంది వల్లభరావు అత్తగారి వైపు ఒక్కొక్కరి బంధువుల పేరు చెప్తూ వారి వయసెంత, అనారోగ్యం ఏమైవుండచ్చు లాంటివి మాట్లాడుకోసాగారు.

ఆ గ్రామంలో ఇంగ్లీష్ వచ్చిన వాళ్ళంతా హైద్రాబాద్‌లో హాస్టల్లో వుంటూ చదువుకుంటున్నారు. సమయానికి ఒక్కరూ గ్రామంలో లేరు. ఆ గ్రామంలో వుండి ఇంగ్లీష్ చదివి చెప్ప గల వాళ్ళల్లో గ్రామం ఒకరు. అయితే సంగీతం మాస్టారి వృత్తి చేసుకుంటున్న ఆయన పెళ్ళికి సైకిల్ మీద పొరుగూరికి వెళ్ళాడు.

ఆ టెలిగ్రాంని వచ్చిన అందరికీ చూపించింది వల్లభరావు భార్య వర్ధని. వాళ్ళంతా దాన్ని అటు ఇటూ తిప్పి చూసారు. బర్కత్ బీబీ దాన్ని చూసి చిన్నగా నిట్టూర్చి చెప్పింది.

"నా కొడుకు పాము కరిచి చచ్చిపోయినప్పుడు ఇలాంటి రంగు కాగితం మీద టెలిగ్రామ్ వచ్చింది"

తేరుకుంటున్న వర్ధని మళ్ళీ మరోసారి ఘొల్లుమంది.

రామయ్య తాత అల్లుడు టైఫాయిడ్‌తో పోయినప్పుడు, మునసబు కూతురు కాన్పుకనలేక పోయినప్పుడు, వీధి దీపాలు వెలిగించే వాడి భార్య ఏక్సిడెంట్‌కి గురైనప్పుడు ఇలాంటి టెలిగ్రాంలే వచ్చాయని చెప్పారు. దుఃఖాన్ని కంట్రోల్ చేసుకోలేక బావురుమన్నాడు వల్లభరావు తమ్ముడు. దాంతో ఇంట్లో వాళ్ళు, గ్రామంలోని ఆడవాళ్ళు కన్నీళ్ళు కార్చసాగారు.

సైకిళ్ళ మీద నలుగురు పక్క గ్రామానికి వెళ్ళారు సంగీతం మాస్టారి కోసం. ఆయనతో వారు టెలిగ్రాం సంగతి చెప్పి బామ్మగారి రెండో కొడుకు మరణించాడని చెప్పారు ఆయనకి.

గ్రామం ఇంటి ముందు సైకిల్ దిగి స్టాండ్ వేసి అడిగాడు.

"ఎంత ఘోరం జరిగింది? శవం ఎప్పుడొస్తుంది?"

"తెలీదు బాబు'' చెప్పాడు వల్లభరావు తమ్ముడు.

"అదేంటి? ఆ సంగతి టెలిగ్రాంలో రాయలేదా? ఏదీ అదివ్వండి'' అని అడిగి తీసుకున్నాడు గ్రామం.

బొడ్డులో దాచుకున్న టెలిగ్రాంని తీసిచ్చింది బామ్మ తల్లి.

గ్రామం అది చదువుతుండగానే అడిగింది బామ్మ తల్లి. నోట్లో కొంగు కుక్కుకుంటూ అడిగింది.

"వాడు పోయి ఎన్ని గంటలైంది?

వెంటనే ఆయన ఫక్కున నవ్వాడు.

"ఎవరూ పోలేదు" చెప్పాడు.

"ఎవరూ పోలేదా? మరి టెలిగ్రాం ఎందుకిచ్చినట్లు?'' అడిగారు ఒకరు. ఆయన పగలబడి నవ్వుతూ చెప్పాడు.

"పిచ్చి మొహాల్లారా. టౌన్‌లో కోర్టు వాయిదాకి తప్పనిసరిగా హాజరవమని లాయర్‌గారు ఇచ్చిన టెలిగ్రాం ఇది".

****

"టెలిగ్రాం అంటే ఆ రోజుల్లో అంత భయపడే వారా బామ్మ?'' అడిగింది అనన్య ఆశ్చర్యంగా.

"అవును. మంచికి కాని, చెడుకు కాని వార్త వెంటనే చేరవేయాలంటే ఆ రోజుల్లో టెలిగ్రాంలే శరణ్యం. బిడ్డ పుట్టాడు, లేదా పిల్ల సమర్తాడింది లాంటి శుభవార్తలు తెలియచేయడానికి టెలిగ్రాంలు వాడే వారు కాదు. మనుషుల్ని పంపే వారు. లేదా వుత్తరాలు రాసేవారు. శవం వెంటనే తీసేయాలి కాబట్టి చావు వార్తలకి ఎక్కువగా టెలిగ్రాంలు వాడేవారు. దాంతో టెలిగ్రాం అంటే చావు వార్త అనే భీతి ఆ రోజుల్లో అందర్లో



వుండేది".

"పాపం"

"ఇలా డెబ్భయిలదాకా టెలిగ్రాంలే గతి. ట్రంకాల్, ఎస్.టి.డిలు వచ్చాక టెలిగ్రాంల ప్రాముఖ్యత తగ్గి ఇప్పుడు ఇంటింటా ఫోన్‌లు వచ్చాక టెలిగ్రాం పూర్తిగా చచ్చిపోయిందనే చెప్పాలి".

"ఇప్పుడు టెలిగ్రాం మంచివార్తలనే మోసుకొస్తూంటుంది బామ్మా.పెళ్ళిళ్ళకిచ్చే గ్రీటింగ్ టెలిగ్రాంలతో అది బ్రతికేస్తోంది" నవ్వుతూ చెప్పింది అనన్య.

కొద్దిక్షణాలాగి అడిగింది అనన్య.

"ఇంక అసలు కథలోకి రా బామ్మా. మీ సంగీతం మాస్టారు జి.రామం, అదే ఫుల్‌స్టాప్ కొట్టేసిన గ్రామం గురించి చెప్పుబామ్మా".బామ్మ తను చెప్పేది మళ్ళీ కొనసాగించింది.

****

అప్పటికే వల్లభరావు కుటుంబ సభ్యులంతా పెళ్ళిళ్ళయి సెటిలయ్యారు. వయసు మీదపడడంతో ఆయన తన ఆస్తిపాస్తుల విషయంలో తన తదనంతరం పిల్లల్లో గొడవలు రాకుండా వుండడానికి వీలునామా రాయాలనుకున్నాడు.

కోర్టు పని మీద హైద్రాబాద్ వచ్చిన ఆయన పనిలో పనిగా తన విల్లు విషయం కూడా లాయర్‌తో సంప్రదించాడు.

ఆయన తన తదనంతరం తన పొలం, ఇల్లు తన పెద్దకొడుక్కి చెందేలా, అతనికి పిల్లలు కలగకపోతే తన రెండో కొడుక్కి చెందేలా.... ఇలా తన కొడుకుల్లో ఎవరికి పిల్లలు లేకపోయినా తన తర్వాతి పుత్ర సంతానానికి, ఒకవేళ వాళ్ళకీ పిల్లలు లేకపోతే తన పుత్రికల సంతానానికి చెందాలని విల్లు రాసాడు.

తాను సంపాదించిన ఆస్తిని తన మనవలు, మనవరాళ్ళు, వాళ్ళ తదనంతరం తన మునిమనవలు తన పేరు చెప్పుకుని అనుభవించాలన్న కోరిక వల్లభరావులో ప్రగాఢంగా వుంది. దాంతో ఈ కండిషన్‌ని ఎన్నుకున్నాడు. తన సంతానంలో ఎవరికీ తన ఆస్తిని అమ్మే లేదా దానం చేసే, బహుమతి ఇచ్చే, లేదా మరేవిధంగానైనా ఇతరులకి దత్తం చేసే హక్కులేకుండా పకడ్బందీగా ఆ వీలునామాని రాయించాడాయన.

ఆ రోజుల్లో వీలునామా రాసిన సంగతి మూడో కంటికి తెలీకుండా జాగ్రత్త పడే వాళ్ళు. ఆస్తికోసం వియ్యపురాళ్ళు, కోడళ్ళు విషప్రయోగం చేసి చంపుతారనే భయం ఒకటైతే, వీలునామాలో చేర్చని వాళ్ళకి తమ మీద ద్వేషం కలుగుతుందని ఇంకో భయం చేత వీలునామాని పొరుగూరులో రహస్యంగా రిజిష్టర్ చేసే వాళ్ళు.

పైగా వల్లభరావు ఉత్త 'సాక్షీకుడు' కాబట్టి ఆ విషయంలో గప్‌చుప్‌గా ఉన్నాడు.

ఆయన మరణం కూడా చిత్రంగానే జరిగింది. ఓ రోజు ఆయన గోచీ పెట్టుకుని చెరువులో ఈది, చెరువుగట్టున ఇంటికి వస్తుంటే, వర్షం వచ్చి, సరిగ్గా ఆయన గోచీలో పిడుగుపడి మరణించాడు. తర్వాత ఆయన చితికోసం కాల్చడానికి పెద్దగా కట్టెలు కొనాల్సిన అవసరం కూడా లేక పోయింది.

అయితే ఆ వీలునామాని చదివి ఆయన సంతానంలోని పెద్దవాడు ఆట్టేకాలం సంతోష పడలేకపోయాడు. అలాగే తర్వాతివాడు, ఆ తర్వాతి వారు కూడా. ఎవరికీ సంతానం కలగకుండానే మరణించారు.

జాంబవతికున్న పెంపుడు పాము పిచ్చి వల్ల ఆమెకి వివాహం కాలేదు. బభ్రువాహనుడి భార్యకి సాయిబాబా చీటీల ద్వారా 'వద్దు, అవును' రాసి ఇచ్చే సూచనల వల్ల వారికీ ఎప్పటికీ సంతానం కలగలేదు.




బామ్మ తమ్ముడు బలిచక్రవర్తికి వివాహం అయినా, అతనికి వైవాహిక జీవిత అదృష్టమే లేకపోయింది. అదో చిత్రమైన కథ.

అతను వైష్ణవదేవిని ప్రేమించాడు. ఆ రోజుల్లో ప్రేమించడం అంటే, పెద్దలను ఎదిరించే సాహసం చేయడంతో సమానం. ఆ ప్రేమని పెద్దలు విరమించుకుంటే, నో అని ఎదురు తిరిగితే, ఇంట్లో స్థానం కోల్పోయి బయటకి వెళ్ళడం, తిరిగి ఆ గడపలో, కనీసం దొడ్డిదారి నించైనా సరే కాలు పెట్టకపోవడం అనే ఆనవాయితీని పెద్దలు కఠినంగా పాటించేవారు.

చక్రవర్తికి పెళ్ళి సమయం ఆసన్నమై సంబంధాలు వస్తూంటే, ప్రతీదాన్ని అతను తిరస్కరించసాగాడు. వల్లభరావుకు అనుమానం కలిగి విషయం ఏమిటని నిగ్గదీస్తే, అతను వైష్ణవదేవిని ప్రేమించిన విషయం వెల్లడించాడు.

ఆ అమ్మాయి గురించి వాకబు చేస్తే పాతికేళ్ళ క్రితం పట్టుదలతో విడిపోయిన తన చెల్లెలి కూతురే అని తెలియడంతో వల్లభరావు 'ససేమిరా ఇది కుటుంబ గౌరవానికి సంబంధించిన విషయం' అన్నాడు.

ఓ అర్థరాత్రి వల్లభరావు చెల్లెలు వచ్చి అన్నని ఈ సంబంధానికి వప్పుకోమని బ్రతిమిలాడితే, తన భర్తని వెనకేసుకొచ్చి తనని అవమానించినందు వల్ల ఆయనకి దయ కలగలేదు. అప్పటికే ఆయన తెలుగులోకి తర్జుమా అయినా చాలా బెంగాలీ నవలలు చదివి వున్నాడు కూడా.

దాంతో బలిచక్రవర్తి వైష్ణవదేవిని రహస్యంగా వివాహం చేసుకుని ఓ పిల్లాడ్ని కన్నాక తండ్రి సర్దుకుంటాడనుకుని ఆమెతో తన ఇష్టదైవం వున్న సింహాచల క్షేత్రంకి వివాహానికి బయలుదేరాడు.

అయితే అతను మర్నాడే వంటరిగా తిరిగి వచ్చాడు. వైజాగ్‌లో దిగగానే వైష్ణవదేవి అకస్మాత్తుగా ఆంధ్రా యూనివర్సిటీలో చదువుకునే ఓ ఎం.ఏ. ఇంగ్లీషు లిటరేచర్ కుర్రాడితో తొలిచూపులో ఆలస్యం కాకుండా ప్రేమలో పడి అతన్ని ఆర్యసమాజ్ మందిర్‌లో ఇట్టే వివాహం చేసుకుంది.

జరిగింది గ్రహించి సంతోషించిన వల్లభరావు ఆలస్యం చేయకుండా బలికి ఓ చక్కటి సంబంధం చూసి పెళ్లి చేసాడు. వాళ్ళు హనీమూన్‌కి కులూ లోయకి, మనాలికి వెళ్ళాలనుకున్నారు కాని చివరకి అరకులోయతో సరిపెట్టుకోవాల్సి వచ్చింది.

వైజాగ్‌లో రైలు దిగి జట్కాబండి ఎక్కి హోటల్లో దిగారు. బలిచక్రవర్తి అరకులోయకి రానుపోను చిన్నకారు మాట్లాడుకుని రావడానికి టేక్సీ స్టాండ్‌కి వెళ్లి వచ్చేసరికి అతని జీవితం మరో

ముఖ్యమైన మలుపు తిరిగింది.

అతని భార్య కుసుమ హోటల్‌లోని రిసెప్షనిస్ట్‌తో ప్రేమలో పడింది. దాంతో అరకులోయకి కాని, తిరిగి వూరికి కాని తన భర్తతో రావడానికి నిరాకరించింది. తన సర్వస్వం ఉన్నది వైజాగ్ అని తేల్చి చెప్పింది.

ఖిన్నుడైన బలిచక్రవర్తి తిరిగి వచ్చి తండ్రికి జరిగింది చెప్పాడు. అప్పట్లో ఇంకా హిందూ వివాహ చట్టం రాలేదు కనుక వల్లభరావు ఇంకో సంబంధం చూసి తన కొడుక్కి వివాహం సంకల్పించాడు.

ఆ మూడోది కూడా బాగా తిరకాసైంది.

వివాహ కార్యక్రమంలో కాశీయాత్ర సందర్భంలో బలిచక్రవర్తిని అతని కాబోయే బావమరిది 'కాశీకి వెళ్ళద్దు. నా చెల్లెల్ని ఇస్తాను. వివాహం చేసుకోండి' అని అడగాలి. ఆ ప్రకారం అతనడగ్గానే బలిచక్రవర్తి తన పురోహితుడు చెప్పినట్లుగా-

"కాళ్ళు పట్టుకున్నా కుదరదబ్బాయి. నేను కాశీయాత్రకి వెళ్తానంతే" అని మాట వరసకి అన్నాడు.

"నే చెప్తే వినవా? పోతే పో" అన్నాడు ప్రతీ చిన్న విషయంలో తన పట్టు నెగ్గాలనుకునే ఆ బావమరిది కోపంగా.

"అదేమిటి అలా అంటావు? బ్రతిమాలు" అని ఎవరెంత చెప్పినా "కాశీకి పోతాడట. పోయేవాడ్ని ఎంతకాలం ఆపుతాం. పోనీ" అనసాగాడు.

ఆ విషయం మీద ఇరుపక్షాల వారు ఘర్షణ పడి తమది రైటంటే, తమది రైటనుకోసాగారు.

వల్లభరావు ఎంత సాఫ్ట్‌కుడో అతని వియ్యంకుడు తరపు వారు అంత అహంకారులు. కాబట్టి వివాహ కార్యక్రమం కాశీయాత్ర దగ్గర ఆగిపోయింది. నాలుగైదు రోజులు బంధుమిత్రులు ఈ వివాహం పరిష్కరించాలని ప్రయత్నించి విసిగి పోయారు.

ఈలోగా బలిచక్రవర్తి తరపు పురోహితుడు కాస్త ఆ పిల్లతో ఈ విరామ కాలంలో ప్రేమలో పడి, పెళ్ళాడేసి, అందర్నీ ఆశ్చర్యపరుస్తూ తన స్వగ్రామమైన వైజాగ్‌కి భార్యతో చెక్కేసాడు.

దాంతో బలిచక్రవర్తికి వివాహం మీద ఇచ్ఛా, ఆడదాని మీద కోరిక నశించాయి. 'తను నిజంగా ఎందుకు కాశీకి వెళ్ళకూడదు' అన్న ఆలోచన వచ్చి అతను కాశీ రైలెక్కేసాడు.

ఉత్తరకాశీలోని స్వామి నిశ్చలానంద అతనే అని, కొందరనుకుంటే ఇంకొందరు గుప్తకాశిలోని ఓ ఆశ్రమంలో చౌకీదారుగా పని చేసేవాడని అనుకోసాగారు. ఇంకొందరు ప్రయాగలో మిఠాయి అంగడి పెట్టాడంటే, మరికొందరు వైజాగ్ నీడపడని ఉత్తర హిందుస్థానీ అమ్మాయిని చేసుకుని మీరట్‌లో కాపురం పెట్టాడన్నారు.

తాము పుట్టించే ఆ వదంతి ఎంతో నిజంగా తోచేలా చెప్పేవారంటే ఓ కథనం ఇది.

"మీకు తెలుసుగా, నాకు చూపు బాగా మందగించింది. మీరట్‌లో అలాగ నడుస్తుంటే, ఎవరో నన్ను చూస్తున్నట్లుగా అన్పించి కళ్ళజోడు పెట్టుకు చూద్దును కదా, మనవాడే, బలిగాడు. 'ఏరా? ఇక్కడే తేలావేంటి? ఏం చేస్తున్నావ్?' అని నేనడిగితే వాడు కోపంగా జేబులోంచి హియరింగ్ ఎయిడ్ తీసుకుని పెట్టుకుని 'ఇప్పుడు తిట్టండి చూద్దాం' అన్నాడు. నాకు ఒకటే నవ్వు. ఇంతలో ఇట్టే మాయమయ్యాడు. వాడేదో స్కూల్‌లో సివిక్స్ టీచరని తెలిసింది.

ఈ కథనాలు విన్న ప్రతిసారి వల్లభరావు అన్ని చోట్లకి వెళ్ళి విచారించి అందులో నిజం లేదని తేల్చుకుని వచ్చేవాడు.

అనేక కుటుంబాల్లోని వివాహ కార్యక్రమాల్లో వల్లభరావు కుటుంబంతో ప్రత్యక్ష లేదా పరోక్ష సంబంధం గలవారు 'బలిచక్రవర్తి వైజాగ్ యాత్ర, కాశీయాత్రలు' గురించి సరదాగా చెప్పుకోవడం కద్దు. అతనేమనేవాడో ఎవరికి అంతుపట్టలేదు.

మొత్తానికి ఆ విధంగా బలిచక్రవర్తి ఆ వీలునామాలోని హక్కుదారుల జాబితాలోంచి జారిపోయాడు.

ఇక మిగిలింది బామ్మగారే.

కాలక్రమేణా వల్లభరావే కాక బామ్మ సోదరసోదరీ మణులంతా కాలం చెందడంతో ఆ వీలునామాలోని ఏకైక హక్కుదారుగా ఆవిడ మిగిలి పోయింది.

****

"బామ్మ - నాకు స్క్రీన్ ప్లే మొత్తం అర్థమైంది. పెదతాతయ్య నువ్వు ఈ ఇల్లు అమ్మడానికి వీలులేకుండా విల్లు రాసారని కదా నీ బాధ? దానికి నువ్వు కట్టుబడాల్సిన అవసరం లేదు. దాన్ని కాంటెస్టు చేసే నీ బ్రదర్స్, అండ్ సిస్టర్స్ గేంగ్‌లో ఎవరూ ఇప్పుడు బ్రతికి లేరు. వాళ్ళెవరికీ పిల్లలు లేరు కాబట్టి ఇహ సమస్యేలేదు. 'పొసెషన్ ఈజ్ ప్రూఫ్ ఆఫ్ ప్రొప్రయిటరీషిప్' అనే రూలుంది. అంటే, ఎక్కువకాలం మనం అనుభవించే ఆస్తి ఏదైనా అది మనకు చెంది వుంటుందని అర్థం. దానికి నిజంగా ఇంకెవరయినా యజమానులయితే మనకి రెంటల్ డీడ్, సేల్‌డీడ్ లాంటివేం లేకుండా ఇవ్వరు కదా. సో ఆ లా పాయింట్‌ని పట్టుకుని నువ్వు ఈ ఇంటిని తేలిగ్గా అమ్మొచ్చు. అందుకు అంగీకరించి కొనేవారు ఒకరున్నారు కూడా. పైగా ఈ ఇంటి మీద మంచి మోజుగల వాడాయన. దీన్ని ఓ కోటి రూపాయలకో అమ్మి ఆ డబ్బుతో మనిద్దరం చిరకాలం చందమామ కథల్లోగా సుఖంగా జీవిద్దాం బామ్మా" ఉత్సాహంగా చెప్పింది అనన్య.

బామ్మ ఆమె వంక 'ఎంత అమాయకురాలివి' అన్నట్లుగా చూసి చెప్పింది.

"పిచ్చిదానా నీకింకా గ్రామం గురించి చెప్పకుండానే ఎందుకీ కంక్లూజన్స్"

"అంటే?" అడిగింది అనన్య అర్థం కాక.

"అంటే, నీకు చెప్పిందాంట్లో రహస్యంగా దాచాల్సిందేం లేదు. ఇదంతా ఉట్టి ఉపోద్ఘాతమే. అసలు రహస్యం ఇంకోటుంది" చెప్పింది బామ్మ.

అనన్య మొహం స్వల్పంగా పాలిపోయింది.

"ఇంకోటి కూడా వుందా?" అడిగింది.

"అవును"

"ఏమిటది?"

గొంతు సవరించుకుని తను చెప్పేది కొనసాగించింది బామ్మ.

**-(ఇంకా వుంది)**





ఎదురుసీట్లో కూర్చున్న ప్రయాణీకుడిని పలకరించి "న్యూస్‌పేపర్ తిరగేసి చదువుతున్నట్టున్నారు... గమనించారా? అని అడిగేడు

"నాకు తెలుసులెండి సార్.... అలా చదవటం తేలికనుకుంటున్నారా" బదులు చెప్పాడా టింగరి ప్రయాణికుడు



"వంటింట్లోంచి ఈగల్ని ఎలా తోలగలిగేరు?"

"ఏముంది... చెత్తంతా తీసుకెళ్ళి ముందు గదిలో పోశాను..."



"ఏరా... తెలుగులో సున్నా మార్కులే వచ్చాయేం?" అడిగేడు తండ్రి కోపంగా.

"అంతకంటే తక్కువ మార్కులు లేవట నాన్నా..." అంటూ బదులిచ్చాడు కొడుకు అమాయకంగా.





"నువ్వు క్లాసులో ఎప్పుడూ చివరి వాడిగా వుంటున్నావురా... అదే నాకు దిగులుగా వుంటోంది" అన్నాడు తండ్రి.

"మీరేం బెంగ పెట్టుకోకండి నాన్నా... ఎక్కడున్నా అందరికీ ఒకేలా చెబుతారు." ... బదులిచ్చాడు కొడుకు.



ఓ మధ్య వయస్కుడు సిటీబస్ సీట్లో కూర్చుని వున్నాడు. కండక్టర్ అతని దగ్గరకొచ్చి "మీకు మూడు రూపాయల టికెట్ కావాలి... అవునా?"

'అవును'

"మీరు మీ ఆవిడతో గొడవపడి వస్తున్నారు కదూ?

"అవును"

"మీరు సరాసరి ఇప్పుడు ఆసుపత్రికే వెళ్తున్నారు... అవునా?"

"అవును అవును అవును. అయినా యివన్నీ నువ్వు యింత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగేవ్?"

"మీ నెత్తిమీద అంత లావుగా కట్టిన బొడిపెని చూసి సార్..."



బెల్లం కొనుక్కురమ్మని నానిగాడిని దుకాణానికి పంపించింది వాళ్ళమ్మ. వాడు యింటికి రాగానే 'ఏంటి... మా అబ్బాయిని దుకాణానికి పంపిస్తే అయిదు వందల గ్రాములకు బదులు నాలుగు వందల గ్రాములు బెల్లం యిచ్చారేం?"

దుకాణాదారుడికి పరిగెట్టుకుంటూ వచ్చి ఫిర్యాదు చేసిందావిడ.

"అంత ఖచ్చితంగా ఎలా చెప్ప గలుగుతున్నారు మేడమ్"

"మా ఇంట్లో వెయింగ్ మిషన్ ఉందయ్యా"

"అయితే ముందు మీ అబ్బాయిని తూచి చూసుకోండి మేడమ్".



"ఉల్లిపాయలు తింటే బరువు తగ్గుతారని ఈ మధ్య ఎక్కడో చదివేను. అందుకే ఉదయాన్నే టిఫిన్ తోను, మధ్యాహ్నం భోజనంతోను రాత్రి భోజనంతోను ఎక్కువఉల్లిపాయలు తీసు కుంటున్నాను".

"ఏవన్నా తగ్గారా మరి?"

"ఆ... ఆ.... నా దగ్గరకొచ్చి మాట్లాడేవాళ్ళు మాత్రం తగ్గారు".



ప్రమాదవశాత్తూ సముద్రంలో మునిగి
పోయిన ఓడలోంచి ప్రాణాల్తో బయటపడి
దగ్గర్లో నిర్మానుష్యంగా ఉండే చిన్ని దీవికి
చేరుకున్నాడో నావికుడు. అయిదేళ్ళు
గడిచాయి. ఓ రోజు ఆ ప్రాంతంలో ఒక
ఓడ చేరుకోవడం అందులోంచి అధికారి
ఒడ్డుకు రావడం చూసి సంతోషం పట్టలేక
అటుగా పరుగెత్తాడు. పడవలోంచి దిగిన
అధికారి ఓ వార్తా పత్రికల కట్ట
అందించాడు నావికుడికి.

"ఈ పత్రికలన్నీ నేనేం చేసు కోనూ....?"
ఆశ్చర్యంగా అడిగేడే నావికుడు.

"ప్రపంచం ఇప్పుడెలా ఉందో అవన్నీ
చదివి తెలుసుకో.... అప్పుడు చెప్పు...
నిన్ను రక్షించాలో... వద్దో" అన్నాడు
అధికారి.



"ఈ రోజు స్కూలుకి ఎందుకు
ఆలస్యంగా వచ్చావ్ అనుషా?"
అడిగేరు టీచర్.

"రోడ్డు మీదున్న సైను బోర్డు చదివి
టీచర్..." చెప్పింది అనుష.

"సైను బోర్డు మీద ఏముందేంటి?"
మళ్ళీ అడిగేరు టీచర్.

"నెమ్మదిగా వెళ్ళుము. ముందు
స్కూలు వున్నది. అని రాసుంది టీచర్"
అమాయకంగా చెప్పింది అనూష.





"మా మమ్మీ జ్ఞాపకశక్తి మరీ దారుణంరా...".

"అన్నీ మర్చిపోతూ వుంటుందా ఏంటి?"

"కాదురా... అన్నీ గుర్తు పెట్టుకుంటుంది".....



"అదిగో... ఎదురుగుండా కనబడే ఆ
ఏడంతస్థుల మేడ మీదనుంచి దూకడం పెద్ద
ప్రమాదం కాదేమో రా.."

"ఏరా.. నీకేమన్నా మతి పోయిందా
అలా అంటున్నావ్?"

"దూకడం ప్రమాదం కాదురా.
పడిపోతేనే ప్రమాదం..."



"నేను చాలా దూరం వెళ్ళాలి...
జేబులో చూస్తే చిల్లి గవ్వలేదు. బండిలో
పెట్రోలు లేదు. దయచేసి సాయం
చెయ్యండి..." పెట్రోల్ బంకు యజమానిని
బ్రతిమలాడుతున్నాడు ఓ యువకుడు.

"సర్లెండి.... ఓ నాలుగు లీటర్ల పెట్రోలు
బండిలో పోయిస్తాను.. అంతకన్నా నేను
ఏమీ చెయ్యలేను...." చెప్పాడు బంకు
యజమాని.

"మీరు మరోలా అనుకోకపోతే నాదో
చిన్న మాటసార్. పెట్రోలు బదులు
ఎలాగోలా నాలుగు లీటర్లకు సరిపడా
డబ్బులు సర్దండి సార్... ఆ ఎదురుగుండా
వున్న బంకులో చవక. అక్కడ
పోయించుకొనిబాలెన్స్
ఖర్చులకుంచుకుంటాను." అన్నాడు ఆ
యువకుడు.



"అమ్మా మన నానీగాడు వలన
ఎదురింటి కిటికీ తలుపు బద్దలయి
పోయిందమ్మా"

"ఎలా"

"నేను వాడి మీదకు రాయి
విసురుతుంటే వాడేమో గబుక్కున
వంగున్నాడు."

# సంగీతకర్తా, సంఘ సంస్కర్తా

# దాసు శ్రీరాములు

సాధారణంగా కళాకారులకి లౌకిక వ్యవహారాలు పట్టవు.

వాళ్ళది అదో లోకం.

కలల్లో బతకడం... కానిదేదన్నా జరిగితే కళ్ళనీళ్ళెట్టుకోవడం!

బొత్తిగా లోకజ్ఞానం లేకపోవడం!

కాస్త పేరుండగానే నాలుగు రాళ్ళు సంపాయించుకోండయ్యా అని ఎవడన్నా చెప్తే 'నిధి చాలా సుఖమా'.... అని త్యాగరాజకీర్తనలూ....

కారణం ఏమిటంటే కళ సున్నితమైంది.

కళాకారులు సున్నితమనస్కులు... (కళాకారుల్లో కర్కోటకులూ ఉన్నారు అది వేరే విషయం) అయితే... అవసరమైతే గుండెరాయి చేసుకుని... మంచికోసం తిరగబడ్డ వారు కూడా ఉన్నారు.

అందులో ఒకరు.

దాసు శ్రీరాములుగారు.

ఆయన 1864 ప్రాంతంలో పుట్టారు.

నూజివీడు ప్రభువు రాజా శోభనాద్రి అప్పారాయణి వారిచ్చే విద్యార్థి వేతనములతో చదువుకుంటూ సంగీతము, సాహిత్యము కూడా నేర్చుకున్నారు.

ఇటు చదువూ అబ్బింది!

అటు సంగీతమూ అబ్బింది!

న్యాయవాద వృత్తి చేపట్టి.... ఏలూరులో ప్రాక్టీసు కూడా పెట్టారు. అది వృత్తి.

జావళీలు, పదాలు, స్వరజతులూ, కృతులు రాశారు. ఇది ప్రవృత్తి!

ఎందుకంటే వెధవ కళలు కూటికా - గుడ్డకా అంటూంటారు చాలామంది! కూడు గుడ్డా ఉంటే జీవితం అయిపోయిందా!

అందుకే ఓ మహానుభావుడన్నాడు "Few Live - Many Exist" అని. కొంతమంది బతికేస్తూ ఉంటారు. కొంతమందే జీవిస్తారు.

కొత్తిమీర - కరివేపాకు కావాల్సిందే. పులుసులో వడేస్తే ఘమఘమలాడతాయ్... మర్నాటికి ఫినిష్.

కానీ మల్లెపూల పరిమళం సందర్భాన్నిబట్టి ఏళ్ళ తరబడి అనుభూతి మిగులుస్తుంది.!!

సరే శ్రీరాములుగారి ప్లీడరీ మూడు పువ్వులూ - ఆరు కాయలుగా నడుస్తోంది. బోల్డంత సంపాదనా, కీర్తి - ప్రతిష్టా....

పేరు చెప్తే చాలు.. రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టే స్థాయికి ఎదిగారు.

దీనితోపాటు... వీలు దొరికినప్పుడల్లా సంగీత సభలు నిర్వహించడం.

వొచ్చిన విద్వాంసులకి ఘనంగా సన్మానాలూ.

ఆత్మకింపయిన భోజనాలూ....

ఆ కాలం ఎలాంటిదీ?

సంగీతమైనా, సాహిత్యమైనా కేవలం "పురుషులకి మాత్రమే... "

స్త్రీలకు కూడదు... పైగా దోషం!!

సంగీతం గానీ, నృత్యంగానీ.. ఆడవాళ్ళు చేస్తే రాణిస్తుందీ అనేది శ్రీరాములుగారి నిశ్చితాభిప్రాయం.

అంచేత ఆయనే ఏకంగా ఒక సంగీత పాఠశాలని ఏర్పాటు చేసారు!!

'స్త్రీలకి సంగీతం - నృత్యం నేర్పబడును'

అని ఏలూరంతా ప్రచారం చేయించారు!!

ఆ రోజు సంగీత పాఠశాల ప్రారంభోత్సవం!!

శ్రీరాములుగారు... కుటుంబ సభ్యులు...

ఆయన దగ్గర పనిచేసే స్టాఫ్ ... తప్ప పురుగు లేదు!!

సంప్రదాయ సంగీత విద్వాంసులంతా - పాఠశాలని వెలేశారు!!

మధ్యస్తు వాళ్ళు మనకెందుకులే అని అటేపు కన్నెత్తి చూళ్ళేదు!....

సంగీత పాఠశాల బోర్డు...

కళా- కాంతీ లేకుండా వేలాడుతోంది!!

ఒక్కరంటే... ఒక్కరొస్తే వొట్టు!!

అటు చేరడానికీ విద్యార్థులూ లేరు...

స్పందించే సభికులూ లేరు!!

బెంగేసింది శ్రీరాములు గారికి...

మనసులో మథనపడి పోతున్నారు!!

ఏమిటీ దారుణం...

'వరవీణా మృదుపాణి' అయిన సరస్వతీ దేవి ఆడది గదా....

---

'హాసం' 1-15 జులై సంచికలో మీరు పరిచయం చేసిన పిరాట్ల శంకరశాస్త్రిగారి వివరాలు చదివి, శంకరాభరణం సినిమా విడుదలయిన తొలి రోజులలో పొందిన అలౌకిక ఆనందాన్ని గుర్తుకు తెచ్చాయి. కాకతాళీయంగా ఈయన పేరు శంకరశాస్త్రి గారే!

"నా వల్ల కాదురా"! అన్న త్యాగయ్యగారి మనసు గెలిచి శిష్యరికం చేసి సంగీతం నేర్చుకున్న శంకరశాస్త్రి గారు అన్ని తరాలకు ఆదర్శం. గురువులంటే అతి చులకనగా చూస్తూ, ఎగతాళి చేస్తూ వున్న నేటి తరం అలా వద్దన్న గురువు దగ్గర విద్య నేర్చుకుంటుందా! అసంభవం. కాశీ వెళ్తున్న సందర్భంలో తల్లి మౌనరోదన, కన్నీళ్ల (కళ్ళనీళ్ళు - అద్భుత ప్రయోగం) మధ్య మసకబారిన తల్లి మొహం గుర్తు చేసుకుంటూ ఏడుస్తున్న శాస్త్రిగారు.. అంటూ సాగిన మీ రచన "విజన్ - శంకరశాస్త్రి"ని ఆవిష్కరించాయి.

తమిళసోదరుని రెండవ పదం రొంబ అళహా అంటే వివరించలేదు. త్యాగయ్య, ఆదిభట్ల విస్సా, బులుసు వారి లాంటి మహానుభావులు (నిజంగానే) సమక్షంలో పాడి మెప్పించడం ఆషామాషీ కాదు. నిజంగా శంకరశాస్త్రిగారు కారణజన్ములే అనిపించక పోదు. శంకరుని తాండవాన్ని గుర్తు చేసేలా సాగిన ఆయన శంకరాభరణ ఆరోహణ అవరోహణ క్రమం వైభవాన్ని మరింత సుస్థిరం చేస్తుంది. క్లైమాక్స్‌లో గురువు దర్శనం మీ వ్యాసానికి హైలెట్. మీ వ్యాసపరంపరలో ఇలాంటి మరుగున వున్న మహానుభావుల్ని పరిచయం చేసే శీర్షిక 'హాసం'కు తలమానికం.

-జి.ప్రభాకర్, హైదరాబాద్

మరి ఆడాళ్ళు సంగీతం నేర్చుకోటానికి అభ్యంతరం యేమిటి... ఎందుకుంటుందీ!! - ఎందుకుండాలి!?

నాజూకైన ఆడవాళ్ళ కంఠంలోని మార్దవం మొగాళ్ళకెలా వొస్తుందీ!

సున్నితమైన గాజుల చేతులు - వీణ మీటడంలోని సొగసు పురుషులకెలా సాధ్యం!!

అవన్నీ సరే....

అర్ధనారీశ్వర రూపాంతర్గతమైన మహిళల పట్ల ఈ వివక్షత ఏమిటి?

పురాణాల వరకూ ఆడది ఆదిశక్తి!

పరిగణనలలోకొచ్చేసరికి పని మనిషి!

ఈ దుర్మార్గాన్ని ఖండించాల్సిందే!

శ్రీరాములుగారి మనస్సులో ధనుష్టంకారం!!

ఎవరు రాకపోయినా ఈ సంగీత యజ్ఞం ఆగదు!!

అని తన కన్న కూతురైన 'శారదాంబ'తో సంగీతం - నృత్యం రెండూ ఆరంభించారు.

కాస్సేపటికి... ఇద్దరు మహిళలొచ్చారు...

"మేం సంగీతం నృత్యం - నేర్చుకొనటానికొచ్చామండీ!!"

పులకించిపోయారు శ్రీరాములుగారు...

"మీ పేర్లేంటమ్మా...."

"చదలవాడ పిచ్చాయి...."

"పినపాక భవాని..."

"చాలా సంతోషం తల్లీ.... ఎవ్వరూ రారనుకొనీ బెంగపడ్తున్నా...."

"కానీ మేమూ..."

"చెప్పండమ్మా...."

"దేవదాసీలం...."

'అయితే ఏవీ.... మనమంతా సంగీత నృత్యదాసులం. కట్టండి గజ్జెలు..."

తానే గురువై నృత్యాన్ని ఆరంభించారు.

ఆ రోజుల్లో.... సంగీతం, నాట్యం వేశ్యలు తప్ప నేర్చుకునేవారు కాదు.... కానీ శ్రీరాములుగారి చలవ వల్ల ... మెల్లమెల్లగా కుల స్త్రీలు, గొప్ప కుటుంబాలకు చెందిన మహిళలు కూడా సంగీతం - నృత్యం నేర్చుకోవడం ఆరంభించారు!!

**మృత్యుంజయ లీలను పాటగా ఆటగదరా శివా, కేశవా, అమ్మతోడు అంటూ అలవోకగా చక్కనైన తెలుగులో చెప్పి మీ అనుభూతిని మాకు శివానుభూతి కలిగించారు. కన్నీటిలోనూ సుగంధ పరిమళాలను చూపారు. మధ్యతరగతి మారాజులోను నటరాజ దర్శనం కలిగించారు. అగ్గిపుల్ల వెలుగులోను పరంజ్యోతిని దర్శించి దర్శింప జేశారు. మరల ఈ రోజే 'హాసం'లో మీ విలాసం చూశాను. హాసానికి చిరుదరహాసం మీ వ్యాసం. క్షీరసాగర మథనంలో అమృతానుభూతి. "కన్నీళ్ళు గోదార్లో కలవడం", రెండింటికి నమస్కారం. ఇలాంటి చక్కటి ప్రయోగాలు మీకే చెల్లు. సద్గురు సాక్షాత్కారం పొందిన పిరాట్ల శంకరశాస్త్రి గారిని మాకూ సాక్షాత్కరింప జేసినందులకు అద్వైతానందభూతిని కలిగించినందులకు మీకు కృతజ్ఞతలు.**

**-పి.ఎస్.నాగేశ్వరరావు, హైదరాబాద్**



ఈనాడు ఇంత విస్తృతంగా.... గౌరవంగా... నృత్యం - సంగీతం నేర్చుకుంటున్నారంటే పరోక్షంగా అది దాసు శ్రీరాములుగారి భిక్షే!!

శ్రీరాములుగారు 'అభినయ దర్పణం' అనే కావ్యం కూడా రాశారు.

24 జావళీలు, 23 పదాలలో - 'జావళీలు, పదాలు' అన్న పుస్తకం.

ఆ కాలంలో ఏదిరాసినా ... ఏ సంస్థానాధీశునికో.... ఓ జమీందారుకో... అంకితమిచ్చే ఆనవాయితీ ఉండేది. కానీ శ్రీరాములుగారు అందరి పట్ల కృతజ్ఞతా, మైత్రి చూపించారు. కాని ఎవ్వరికీ అంకితం ఇవ్వలేదు!

మచ్చుకి... శ్రీరాములుగారు అఠాణ రాగంలో రాసిన లక్ష్మీ కృతి.

**రావే తల్లి మా యింటికి - లక్ష్మీదేవి నిన్నే నమ్మితి నెప్పటికి**

**సావధానముగా వినవె నా మనవి - జనవినుతమగు నీ సేవ చేసెదగాని**

**భావజ జననీ - భక్త పోషిణి - పరమ కరుణార సావేశ**

**మావహిత నాదుకొనవే హృదయమును పాడు కొనవేరా!!!**

ఏదేమైనా తోటవల్లూరు ప్రాంతంలో శ్రీరాములుగారి రచనలు ప్రచారంలోకి తెచ్చిన ఘనత ఆ ప్రాంతపు ఆట వెలదులదే.

అనుకున్నది సాధించి.... సంగీత నృత్యాలలో కూడా విప్లవం సాధించిన సంఘ సంస్కర్త... చిరస్మరణీయుడు శ్రీ దాసు శ్రీరాములుగారు!

**-తనికెళ్ళ భరణి**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

**-భరణి**

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

తనికెళ్ళ భరణి,

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,

మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

జులై 31 మహమ్మద్ రఫీ వర్ధంతి సందర్భంగా ...

# స్వరభాస్కరుడు లయ సుధాకరుడు మహమ్మద్ రఫీ



**1980 జులై రాత్రి 10 గంటల 25 నిమిషాలు... యావద్భారత ప్రజలను శోకసముద్రంలో ముంచి మహమ్మద్ రఫీ దివి కేగిన వేళ. సామన్యులే కాదు, గొప్ప గొప్ప కవులు, సంగీతకారులు కూడా హృదయకవాటాలు తెరిచి రోదించిన వేళ.**

రఫీ బ్రతికినది 56 సంవత్సరాలే. నిజానికి మరణించేనాటికి రఫీ కమ్మర్షియల్‌గా అంత టాప్‌లో లేదు. "అరాధనా" (1969) తర్వాత కిషోర్‌కుమార్ వేవ్ హిందీచిత్రరంగాన్ని చుట్టుముట్టింది. రఫీని వెనక్కు నెట్టింది. కిషోర్‌కుమార్ రాజేష్‌ఖన్నాకు పాడడంతో కొత్త శకం ఆరంభమయింది. అప్పుణ్నుంచీ కిషోర్ ఎవరి ఎవరికైనా సరే పాడడం మొదలుపెట్టాడు.

హీరో ఎవ్వరైనా సరే, రఫీయే పాడడమే రివాజు అప్పటిదాకా. ఎవరికైనా - పాత హీరో అయినా, కొత్త హీరో అయినా సరే - సూటయ్యే కంఠస్వరం రఫీదని అందరి నమ్మకం. కిశోర్ కుమార్ తనకు, దేవ్ ఆనంద్‌కు తప్ప వేరెవరికీ పాడేవాడు కాడు. కిశోర్ సింగింగ్ హీరోగా బిజీగా ఉండే రోజుల్లో తనకు తాను ప్లేబ్యాక్ పాడుకునే తీరిక లేక "షరారత్" (1959)లో రఫీచేత పాడించుకున్నాడు కూడా. దరిమిలా కిషోర్‌కుమార్ నటుడిగా వెనకబడి, స్టేజిషోల ద్వారా గాయకుడిగా ప్రజలకు దగ్గర అయ్యాడు. సచిన్‌దేవ్ బర్మన్ సలహాపై "ఆరాధనా'లో రాజేష్‌ఖన్నాకు ప్లేబ్యాక్ పాడాక ఇక వెనక్కి తిరిగి చూడలేదు. కిషోర్ సహజంగా నటుడు కావడం అతని ప్లేబ్యాక్ సింగింగ్‌కు ఉపకరించింది. కిషోర్ ఎదుగుదల రఫీ కెరియర్‌ను దెబ్బతీసింది.

రఫీలో కూడా నటుడు ఉన్నాడు. 1945 నాటి "లైలా మజ్నూ" సినిమాలో రఫీ పాట పాడడంతోబాటు చిన్న వేషం కూడా వేశాడు. అంతకు ముందు సంవత్సరమే "గాంవ్ కీ గోరీ" సినిమాలో రఫీ తొలి హిందీపాట పాడాడు. తొలిహిందీ పాట అనడానికి కారణం - ఆయన తొలి గీతం పంజాబీ గీతం కావడమే!



పంజాబ్‌లోని కోట్లా ముల్తాన్ సింహ్ అనే గ్రామంలో 1924లో జన్మించిన రఫీ అన్నగారు హమీద్ ప్రోత్సాహంతో పాటలు పాడడం అభ్యసించాడు. ఉస్తాద్ అబ్దుల్ వహీద్ ఖాన్ వద్ద క్లాసికల్ సంగీత శిక్షణ పొందిన రఫీ తన తన 16వ ఏట నుండే ఆలిండియా రేడియోలో పాడడం ప్రారంభించారు. సంగీత దర్శకుడు శ్యామ్ సుందర్ "గుల్‌బలోచ్ (1944)" అనే పంజాబీ చిత్రంలో రఫీ చేత పాటపాడించి, అతని సినీ జీవితానికి శ్రీకారం చుట్టాడు.

నటుడు నజీర్ ఆహ్వానంపై బొంబాయి చేరిన రఫీ 1944లో "గాంవ్ కీ గోరీ"లో పాటపాడాడు. తర్వాత "సమాజ్ కో బదల్ డాలో"(1947), "జుగ్నూ"(1947) చిత్రాలలో చిన్న చిన్న వేషాలు వేశాడు. "జుగ్నూ"లోని "యహాఁ బద్‌లే వఫా కా బేవఫాయీ కే సివా క్యా హై" అనే పాట ఎంత ప్రజాదరణ పొందిందంటే ఇక రఫీ పాడడం మీదనే ఏకాగ్రత పెట్టారు.

రఫీ జీవితంలో పెద్ద మలుపు - "పహ్‌లే ఆప్" (1944)చిత్రం ద్వారా నౌషద్‌ను కలవడం. రఫీ చేత అద్భుతమైన పాటలు - దీవార్, అమర్, ఆన్, షబాబ్, కోహినూర్,... ఇలా ఎన్నో చిత్రాలలో పాడించిన నౌషద్ నిజజీవితంలో కూడా రఫీకి ఒక పెద్దన్నగారిగా వ్యవహరించారు. 35 ఏళ్ల తన గాయకజీవితంలో రఫీ పెద్దమనిషి తరహాకి పేరుబడ్డారు. అజాతశత్రువుగా కీర్తింపబడ్డారు. ఆయన పాడిన వైవిధ్యభరితమైన పాటల లిస్టు ఇవ్వడానికి గానీ, ఆయన గానమాధుర్యాన్ని వర్ణించడానికి గానీ ఎన్ని పేజీలైనా సరిపోవు. ఆయన మరణించినప్పుడు గీతకారుడు హస్రత్ జైపురి ఆయనపై రాసిన "ఎలిజీ" (శోకగీతం)ను గుర్తుకు చేసుకుంటే చాలు, గాయకుడిగా ఆయన ఔన్నత్యంతోపాటు ఆయన వ్యక్తిత్వం కూడా ఆవిష్కరింపబడుతుంది

"సభీ అచ్చే హై గాయక్ అప్‌నే అప్‌నే రంగ్ మేఁ హస్‌రత్
కహీ హై సోజ్ కా జాదూ కహీ హై సాజ్ కా జాదూ
ఫరిశ్తే ఝూమ్‌తే థే జబ్ భీ వో నగ్మాత్ గాతే థే
నిరాలా థా రఫీ సాహబ్ కీ ఉస్ ఆవాజ్ కా జాదూ

**(అందరూ వారి వారి తరహాలలో మంచి గాయకులే. ఒకరు విషాదగీతాల మాంత్రికులయితే మరొకరు వాయిద్యాల మాంత్రికులు. కానీ రఫీసాబ్ కంఠస్వరంలో మాయ విలక్షణమైనది. ఆయన పాటలు పాడినప్పుడు దేవతలు ఆడతారు)**

గానే కే సాథ్ సాథ్ ముహబ్బత్ థీ, ప్యార్ కా
ఉస్‌కా బిఛ్‌డనా సబ్ కో హీ బేచైన్ కర్ గయా
జో భీ దియా కిసీ నే వహీ హస్‌కర్ కే లే లియా
సంగీత్ కే జహాఁ సే ఇన్‌సాన్ మర్ గయా

**(పాటతో బాటు మనుష్యులయెడ ప్రేమ ఉండేది. ఆయన నిష్క్రమణ అందరినీ ఆశాంతికి గురిచేసింది. ఎవరేమిచ్చినా నవ్వుతూనే గ్రహించాడాయన. సంగీతప్రపంచంలో ఒక మనీషి మరణించాడు.)**

నో సుర్‌కే ఆఫ్‌తాబ్ థే ఉన్ జైసా కౌన్ హై?
వో లయ్ కే మాహతాబ్ థే, ఉన్ జైసా కౌన్ హై?
యే ఔర్ బాత్ హై కి కరే కోయీ భీ నకల్
అప్‌నా జవాబ్ ఆప్ థే, ఉన్ జైసా కౌన్ హై?

**(ఆయన స్వరభాస్కరుడు. ఆయనకు సాటి వేరెవరు? లయసుధాకరుడు. ఆయనకు సాటి వేరెవరు? ఎవరెంత అనుకరించినా, ఆయనకు దీటు ఆయనే. ఆయనవంటి వారి వేరెవరు?)**

-హస్‌రత్ జయపురి

-కమ్యూనికేటర్ ఫీచర్స్

### కాశ్మీర్ కి కలీ(1964)

సంగీతం: ఓ.పి.నయ్యర్ గీతం:ఎస్.హెచ్.బిహారీ

యే చాంద్‌సా రోషన్ చెహరా జుల్ఫోంకా రంగ్ సునెహరా
యే ఝీల్‌సి నీలీ ఆంఖే కోయి రాజ్‌హై ఇన్‌మె గెహరా
తా..రీఫ్ కరూం క్యా ఉస్‌కీ జిస్‌నే తుమ్హే బనాయా ॥యే॥
ఇక్ చీజ్ కయామత్ భీ హై లోగోం సె సునా కర్‌తే థే
తుమ్హే దేఖ్‌కె మైనే మానా వో ఠీక్ కహా కర్‌తే థే ॥వో॥
హై జాల్‌మె తేరీ జాలిమ్ కుఛ్ ఐసీ బలాసా జాదూ
సౌ బార్ సమ్భాలా దిల్ కో పర్ హోకె రహా బేకాబూ ॥తా..రీఫ్॥
హర్ సుబహ్ కిరణ్ కీ లాలీ హై రంగ్ తెరే గాలోంకా
హర్ షామ్‌కీ చాదర్ కాలీ సాయా హై తెరే బాలోం కా ॥హర్॥
తూ బల్‌ఖా దేఖ్‌కె నదియా హర్ మౌజ్ తెరీ అంగ్‌డాయీ
జో ఇన్ మౌజోం మె డూబా ఉస్ నే హీ దునియా పాయీ ॥తా..రీఫ్॥
మేంఖోజ్ మె హూం మంజిల్‌కీ ఔర్ మంజిల్ పాస్ హై మేరే
ముఖ్‌డే సె హటాదో ఆంచల్ హోజాయె దూర్ అంధేరే ॥హో॥
మానాకీ యె జల్‌వే తేరే కర్‌దేంగె ముఝె దీవానా
జీ భర్‌కె జరా మై దేఖూ అందాజ్ తెరా మస్తానా ॥తా..రీఫ్॥

### జంగ్లీ(1961)

గీతం: హస్రత్ జైపురీ సంగీతం: శంకర్-జైకిషన్

ఎహసాన్ తేరాహోగా ముఝ్‌పర్
దిల్, చహతాహై, వో కెహనేదో ముఝే
తుమ్‌సే ముహబ్బత్ హోగయీ హై ముఝే
పల్‌కోం కీ ఛావ్ మేం రెహనే దో ॥ఎహసాన్॥
తుమ్‌నే ముఝ్‌కో హస్‌నా సిఖాయా ॥తుమ్‌నే॥
రోనే కహోగే, రోలేంగే అబ్ రోనే కహోగే, రోలంగే
ఆసూ కా హమారే గమ్ నకరో వో బహ్‌తే హై తో బహ్‌నేదో ముఝే
తుమ్‌సే ముహబ్బత్ హోగయీ హై ముఝే
పల్‌కోం కీ ఛావ్ మేం రెహనే దో ॥ఎహసాన్॥
చాహే బనాదో, చాహే మిటాదో ॥చాహే॥
మర్ భీ గయే తో దేంగే దువాయేం ॥మర్‌భి॥
ఉడ్-ఉడ్ కే కహేగీ ఖాక్ సనమ్
దిల్ దర్దే ముహబ్బత్ కెహనే దో ముఝే
తుమ్‌సే ముహబ్బత్ హోగయీ హై ముఝే
పల్‌కోం కీ ఛావ్ మేం రెహనే దో ॥ఎహసాన్॥

### దులారి(1949)

రచన: షకీల్ బదయాని సంగీతం: నౌషద్

సుహానీ రాత్ ఢల్ చుకీ నా జానే తుమ్ కబ్ ఆవోగే ॥సుహానీ॥
జహాం కి బుుత్ బదల్ చుకీ.... నా జానే తుమ్ కబ్ ఆవోగీ
నజారే.... అప్నీమస్తీంయా దిఖా దిఖాకె సోగయీ
సితారే... అప్ నీ రోష్‌నీ లుటా లుటాకే సోగయీ
హర్ ఏక్ షమ్మజల్‌చుకీ.... నా జానే తుమ్ కబ్ ఆవోగీ ॥సుహానీ॥
తడప్ రహే హై హమ్ యహా.. తడప్ రహేకై హమ్ యహా
తుమ్హారే ఇంత్‌జార్‌మే.. తుహ్హారె ఇంతజార్ మె
ఫిజాకరంగ్ ఆ చలాహై.. మౌస్ మె బహార్ మే
ఫిజా కరంగ్ ఆ చలా హై
మౌస్ మె బహార్ మె మౌస్ మె బహార్ మె
హవాభీరుఖ్ బదల్ చుకీ నాజానే తుమ్ కబ్ ఆవోగీ ॥సుహానీ॥

### బర్సాత్ కిరాత్(1960)

రచన: సాహిర్ లుధియాన్వి సంగీతం: రోషన్

జిందగీభర్ నహీ భూలేగి వొ బర్‌సాత్ కి రాత్
ఏక్ అంజాన్ హసీనాసె ములాఖాత్ కిరాత్ ॥జిందగీ॥
హాయ్ వో రేష్ మి జుల్ఫోంసే బరస్ తా పానీ ॥హాయ్॥
ఫుల్ సే గాలోంసె రుఖ్‌నేతో తరస్ తా పానీ
దిల్ మే తుఫాన్ ఉఠాతేహోమే ॥దిల్ మే॥
జస్‌బాత్ కి రాత్ ॥జిందగీ॥
డర్ హె బిజిలీసె అచానక్ బోలీ పట్ నా ఉస్‌కే
ఔర్ ఫిర్ షర్మ్‌సె బల్ ఖాకె సిమట్ నా ఉస్ కా
కభీ దేఖీ నా సునీ ఐసీహో
కభీ దేఖీ నా సునీ ఐసీ.. తిలిస్మాత్ కి రాత్ ॥జిందగీ॥
సుర్‌ఖ్ ఆంచల్ కొ దబాకర్.. జొ నీఛోడా ఉస్‌నె ॥సుర్‌ఖ్॥
దిల్ పె జల్‌తా హువా ఇక్ తీర్‌సా ఛోడా ఉస్
ఆగ్ పానీ మే లగాత్ హువే ॥ఆగ్॥ హాలత్ కి రాత్ ॥జిందగీ॥
మెరె నగ్ మోం మె జొ బస్ తీ హై వొ తస్‌వీర్ థీ వో
నౌజవానీకే హసీ ఖ్వాబ్ కి తాబీర్‌కి హివో
ఆస్ మానోం సే ఉతర్ ఆయీ హో
ఆస్ మానోంసే ఉతర్ ఆయీతీ జో రాత్‌కి రాత్ ॥జిందగీ॥

### పదండి ముందుకు (1962)

రచన: జగ్గయ్య సంగీతం: కోదండపాణి

సా: లోకం చీకటిలోగిలిచేసి-ఋణానుబంధం తెంచుకొని
కాలం రేపిన సుడిగుండంలో కనుమూశావా.. అమ్మా
ప: మంచికి కాలం తీరిందా - మనిషికి హృదయం మారిందా
పాపం పెరిగీ పగబూనీ - నీ ప్రాణాలు బలిగా కోరిందా?
నీతికి రూపం జాతికి దీపం - నీవని నీడన నిలిచామే
స్వేచ్ఛా జీవం సమతాభావం - నీ జాడలలో నేర్చామే
అమ్మ మాటకై అల్లాడే మము -
కన్నీట ముంచి పోయావా ॥మంచికి॥
లోహపుగుండెల లోతుల నిండిన - నెత్తుటి దాహం తీర్చావా
అనురాగంతో ఆత్మార్పణతో - వెలుగుల వాకిలి తెరిచావా
ఎడబాటైనా కడదాకా -
మా భవితవ్యమౌతా నన్నావా ॥మంచికి॥
నీవు చూపిన వెలుగుబాటనా నిలిచి పోరుతామూ,
గెలిచితీరుతామూ!
దేశమేకమై విశ్వరూపమై దీక్షబూనుతామూ,
తెగువ చూపుతామూ!
పరులపెత్తనం పురిటిగడ్డపై తుడిచి పెట్టుతామూ,
తరిమికొట్టుతామూ!
నవ్యభారతం దివ్యభారతం తెచ్చితీరుతామూ.....
జైహింద్ ... జైహింద్ ... జైహింద్!

## కోహినూర్(1960)

గీతం: షకీల్ బదాయూనీ　　సంగీతం: నౌషద్

ఆ....
మధుబన్ మె రాధికా నాచే రే ॥2॥
గిర్‌ధర్‌కి మురలియా బాజే రే ॥2॥
పగ్ మె ఘూంగర్ భాంధ్ కే
ఆ......
పగ్ మె ఘూంగర్ బాంధ్ కే
ఘంగ్‌టా ముఖ్‌పర్ డాల్ కె
నైనన్ మె కజ్‌రా లగాకె... రే ॥మధు॥
డౌలత్ ఛమ్ ఛమ్ కామని
ఆ .... ... ....
డోలత్ ఛమ్ ఛమ్ కామని
ఛమ్‌కత్ జైసే దామని
చంచల్ ప్యారీ ఛబ్ లాకె... రే ॥మధు॥
ముర్దంగ్ బాజే తిరికిట ధుం తిరికిట ధుం తథా ॥2॥
నచత్ ఝూం ఝూం తథై తథై తథ
ఝూం ఝూం తననన ఝూం ఝూం తననన
క్రాంథ క్రాంథ క్రాంథ థథథ ॥మధు॥
నిస రిస గరిమగ పమ దప నిద సని రిసా
రిసనిదపమపదని సరిసనిదపమప గమదప గమరిస ॥మధు॥
సస సనిదప మపదప గమరిస నిరిస
సస గమ సదనిద సా ॥మధు॥
ఓది నాదిర్ దిర్‌సానీసా ధారే ధీం　ధీం తననన
నాదిర్ దీర్ సానీసా ధారేధీం　ధీం తననన
నాదిర్ దిర్‌సా నీ సాధారేధీం　ధీం తననన
నాదిర్ దిర్‌సా నీనా ధారే....
ఓ దిర్ తానా దిర్‌దిర్ తానా
థిర్ థిర్ థిర్ థిర్ తుం థిర్ థిర్ థిర్ థిర్
ధా తిరికిట తక్ తుందిర్ కిటతక
తిరికిట తిరికిట తాధానే
నాదిర్ దిర్ సానీసా
ఓధే నాదిర్ దిర్‌సానీసా
ఓధే నాదిర్ దిర్ సానీసా ధారే
ధీం ధీంతననన

## ఆర్‌జూ(1969)

సంగీతం: శంకర్-జైకిషన్　　గీతం: హసత్ జైపురి

అజీ హమ్ సె బచ్‌కర్
కహాఁ జాయీ యేగా
జహాఁ జాయీ యేగా
హమే పాయి యేగా ॥అజీ॥
యై కైసా సఖా హై
యె కైసా అసర్ హై
నకాబూ మె దిల్ హై
న బస్‌మె నజర్ హై
జరా హోష్ ఆలే చలే జాయీ యేగా ॥2॥
లెహార్ జాయి యేగా
లెహార్ జాయీ యేగా ॥అజీ॥

## భలే తమ్ముడు

రచన: సి.నారాయణరెడ్డి　　సంగీతం: టి.వి.రాజు

ఆ: నేడే ఈనాడే కరుణించె నన్ను చెలికాడే
ఆ: కనులముందున్న రతనాలమూర్తిని
విలువలెరుగక విసిరితిని
కనులు తెరచీ విలువ తెలిసీ (2)
మనసే గుడిగా మలచితినీ ॥నేడే॥
ఆ: మదిలో విరిసే మమతల మాలలు
చెలిమికి కానుక చేసెదను
ఆరని వలపుల హారతి వెలుగుల (2)
కలకాలం నిను కొలిచెదను ॥నేడే॥
అ: చిలిపిగ కసిరే చెలియ విసురులో
అలకలు గని నవ్వుకున్నాను
చేతులు సాచి చెంతకు చేరిన (2)
ఆ చెలినే అందుకున్నాను (2) ॥నేడే॥

## అక్బర్ సలీం అనార్కలీ

రచన: సి.నారాయణరెడ్డి　　సంగీతం: సి.రామచంద్ర

ప: తారలెంతగా మెరిసేనో ॥తార॥
చెందురుని కోసం ॥చెందురుని॥
రేయి ఎంతగా మురిసేనో
దినకరుని కోసం ॥దినకరుని॥ ॥తారలెంతగా॥
చ: చిగురుటాకులే చేతులుగా మిసిమిరేకులే పెదవులుగా
పరిమళాలే పిలుపులుగా　మకరందాలే వలపులుగా
పూవులెంతగా వేచెనో
తుమ్మెదల కోసం ॥తుమ్మెదల॥ ॥తారలెంతగా॥
చ: నింగి రంగులే కన్నులదాచి
కడలి పొంగులే ఎదలో దాచి ॥నింగి॥
గులాబి కలలే బుగ్గల దాచి
మెరుపుల అలలే మేనిలో దాచి
పరువాలెంతగా వేచేనో ॥పరు॥
పయ్యెదల కోసం ॥పయ్యె॥ ॥తారలెంతగా॥

## భలేతమ్ముడు

రచన: సి.నారాయణరెడ్డి　　గానం: టి.వి.రాజు

ఎంతవారుగానీ వేదాంతులైన గానీ
వాలుచూపు సోకగానే తేలిపోదురోయ్-
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥
హొయ్ హొయ్ చిన్నది - మేనిలో మెరుపున్నది
హాహఁ చేపలా తళుక్కన్నది - హొయ్ సైపలేకున్నది ॥చిన్నది॥
ఏవన్నెకాని వలపునమ్మి వలను చిక్కునో
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥
ఆడకు - వయసుతో చెరలాడకు - ఆహఁ
ఆడితే వెనుకాడకు - కూడి విడిపోకు ॥ఆడకు॥
మనసు తెలిసి, కలిసిమెలిసి, వలపునింపుకో
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥
బలే బలే -లేత వయసుబికిందిలే - తాత మనసూరిందిలే
లోకమింతేలే - అహహా - బలెబలే - ॥లేత॥
పాతరుచులు తలచితలచి తాత ఊగెనోయ్ -
కైపులో - కైపులో - కైపులో ॥ఎంత॥

జూలై 20 గీతాదత్ వర్ధంతి సందర్భంగా . . .

# గీతారాయ్ గీతాదత్ అయిన వేళ...



**లతా, ఆశాల గొంతులకు భిన్నంగా తనకంటూ ప్రత్యేకమైన హస్కీ వాయిస్‌తో పాడి లక్షలాది అభిమానులను సంపాదించుకున్న గాయని గీతాదత్. ఆమె ఎక్కువ సంఖ్యలో పాటలు పాడకపోయినా, పాడిన పాటలు మాత్రం ఆమె అభిమానులు ఎన్నటికీ మరువలేనివే!**

వివాహానికి పూర్వం గీతాదత్ ఇంటిపేరు రాయ్. గీతారాయ్ అనే పేరుతోనే అనేక సినిమాలలో పాటలు పాడింది. ప్రఖ్యాత దర్శక నిర్మాత గురుదత్‌తో 1953లో పెళ్లి అయిన తర్వాత ఆమె గీతాదత్ అయింది. స్త్రీలకు పెళ్లి అయిన తర్వాత పుట్టింటి పేరు బదులు భర్త ఇంటిపేరు వస్తుందనే సాంప్రదాయం ప్రకారమయితే ఆమె 'గీతా పడుకొనే' కావాలి. కానీ ఆమె భర్త అసలు పేరులో కొంతభాగం స్వీకరించి గీతాదత్ అయింది.

దత్ అనే ఇంటిపేరు బెంగాలీలలో, పంజాబీలలో ఉంది. (సునీల్‌దత్ పంజాబీ, ఉత్పల్‌దత్ బెంగాలీ). అందువల్ల గురుదత్ బెంగాలీ అని చాలామంది పొరబడతారు. కానీ అతను కర్ణాటకకు చెందిన సారస్వత బ్రాహ్మణ కులానికి చెందినవాడు. శ్యామ్ బెనగల్‌కు కజిన్. గీతారాయ్ తల్లిదండ్రులు గురుదత్‌కు వివాహానికి అడ్డు చెప్పడానికి కారణాలలో ఒకటి - అతను బెంగాలీ కాకపోవడం.

గీతారాయ్ తూర్పుబెంగాల్‌లోని ఫరీద్‌పూర్‌లో పుట్టింది. చిన్నతనంలో హీరేంద్రనాథ్ నందీ వద్ద శాస్త్రీయసంగీతం నేర్చుకుంది. క్విట్ ఇండియా ఉద్యమం టైములో ఆమె కుటుంబం తూర్పు బెంగాల్ వదిలి బొంబాయి చేరింది. మధ్యతరగతి కుటుంబం కావడంతో సంగీతపాఠాలు కొనసాగించలేక సినిమాలలో ప్రయత్నాలు చేశారు. సంగీతదర్శకుడు హనుమాన్ ప్రసాద్ 1946లో ఆమెను "భక్త ప్రహ్లాద్" సినిమాలో పరిచయం చేసినా ఆమె తొలి హిట్ సాంగ్ "మేరా సుందర్ సప్‌నా టూట్ గయా" (దో భాయ్ - 1947) ఎస్.డి.బర్మన్ సంగీత దర్శకత్వంలో రూపు దిద్దుకున్నదే. అప్పటికి ఆమె వయసు్సు 15 సంవత్సరాలే. ఇంత చిన్న పిల్లేం పాడుతుంది? అంటున్న ప్రొడ్యూసర్ మాటను లక్ష్యపెట్టక బర్మన్ పాడించాడు; గీతారాయ్ కెరియర్‌కు పునాది వేశాడు. గురుదత్ దర్శకత్వం వహించిన "బాజీ" (1951) ముహూర్తం నాడు గురుదత్ కుటుంబాన్ని కలిసేనాటికే గీతారాయ్ అనేకమంది కంపోజర్స్ వద్ద పనిచేసి పేరు తెచ్చుకుని ఉంది.

ఆ రోజు ముహూర్తం షాటుగా "తబ్‌దీర్ సే బిగ్‌డీ హుయీ" పాటను గీతాబాలి పై చిత్రీకరిస్తున్నారు. ఆ పాట గీతారాయ్ పాడినదే. ఆ పాట రికార్డింగు టైములో ఆమెను చూసిన గురుదత్ మనసు పారేసుకున్నాడు. అతని తొలిప్రేమ 19వ యేటనే మోసులు వేసింది. పూనాలో ప్రభాత్ స్టూడియోలో పనిచేసే రోజుల్లో విజయ అనే డాన్సర్‌ను ప్రేమించాడు. (గురుదత్ కూడా మంచి డాన్సర్). ఆమెకు ఒక వివాహితుడితో కూడా ఎఫైర్ ఉంది .ఈ విజయ తన భర్తజోలికి రాకుండా చూడాలని ఆ పెద్దమనిషి భార్య ప్రయత్నించేది. దానిలో భాగంగానే ఆ అమ్మాయిని పెళ్ళి చేసేసుకోమని గురుదత్‌ను ప్రోద్బలం చేసేది. మొత్తానికి పెళ్లి జరక్కుండానే ఆ ఎఫైర్ ముగిసి పోయింది.

ఇది విన్న గురుదత్ తల్లి వాసంతి పడుకొనే హైదరాబాద్‌లో ఉన్న తన కజిన్ కూతురు సువర్ణ అనే అమ్మాయితో గురుదత్ వివాహం నిశ్చయించింది. గురుదత్ సరేనన్నాడు. ఆ అమ్మాయితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేడు. పెళ్లి దగ్గరపడుతోందనగా ఈ విజయ వ్యవహారం సువర్ణకు చెప్పడం భావ్యమనుకున్నాడు గురుదత్.



మే 26, 1953 బాంబేలో గురుదత్, గీతారాయ్ పెళ్ళిరోజున

ఆ విషయం వివరంగా రాశాడు. దెబ్బకి ఆమె తల్లిదండ్రులు పెళ్లి కాన్సిల్ చేసేశారు. గురుదత్ ఫీలయ్యాడో లేదో ఎవరికీ తెలియదు కానీ మళ్లీ అతను ప్రేమ జోలికి పోలేదు - 1950లో గీతారాయ్‌ను కలిసేదాకా!

తను ప్రసిద్ధ గాయకురాలయినా, అప్పటికి గురుదత్ పేరులేని దర్శకుడయినా ఆమె గురుదత్‌ను అభిమానించింది. వాళ్ల ఇంటికి తరచుగా వస్తూ పోతూ ఉండేది. కానీ ఆమె సంపాదనపై ఆధారపడిన తల్లిదండ్రులు ఆమె వివాహానికి సమ్మతించలేదు. దాంతో వారి వివాహానికి మూడేళ్లు ఆలస్యమయింది. ఈ లోపుల గురుదత్ తీసిన "బాజీ", "జాల్" హిట్ అయ్యాయి. "బాజ్" ఫెయిలయింది. చివరికి గురుదత్ గీతాను కల్యాణ్‌లోని హాజీ మలాంగ్ బాబా సమాధి వద్దకు తీసుకెళ్లి "నన్ను పెళ్లి చేసుకుంటావో, మీ అమ్మానాన్నా చెప్పిన ఆ బెంగాలీ కుర్రాణ్ని చేసుకుంటావో తేల్చి చెప్పు" అన్నాడు. గీతా తల్లిదండ్రులను ఎదిరించింది. వాళ్లు దిగిరాక తప్పలేదు.

1953 మే 26న వాళ్ల వివాహం సాంప్రదాయ బెంగాలీ పద్ధతిలో జరిగింది. పెళ్లికి దేవ్ ఆనంద్, వైజయంతిమాల, నూతన్, మోతీలాల్ ఇత్యాదులు వచ్చారు. "డబ్బుకోసమే గీతారాయ్‌ను గురుదత్ వరించాడని అనుకున్నారు. కానీ ఆమె డబ్బుని మా అబ్బాయి ఎన్నడూ తాకనైనా తాకలేదు. ఆమె డబ్బు ఎలా ఖర్చు పెట్టిందో అడగలేదు." అని అంది అతని తల్లి వాసంతి.

ఇద్దరు ప్రతిభావంతులు పరస్పరం ఇంతగా అభిమానించుకుని పెళ్లి చేసుకున్నా వారి వైవాహిక జీవితం సక్రమంగా జరగకపోవడం దురదృష్టకరం. అది వేరే కథ.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

## హౌరా బ్రిడ్జి

రచన: ఖమర్ జలాలాబాదీ సంగీతం: ఓ.పి.నయ్యర్

మేర్రానామ్ చిన్‌చిన్ చూ
చిన్ చిన్ చూ బబ చిన్ చిన్ చూ
రాత్ చాంద్‌నీ మై ఔర్ తూ
హల్లో మిస్టర్ హౌ డుయుడూ ॥మేర్రా॥
బాబ్బా.... బాబ్బా.... బాబ్బా....
బాబూజీ మై చీన్‌సే ఆయీ
చీనీ జైసా దిల్ లాయీ
సింగాపూర్ కా జోగన్ మేరా
శంఘాఈ కీ అంగ్‌డాయీ ॥బాబూజీ॥
దిల్‌పర్ రఖ్‌లే హాత్ జరా
హోజ్జాయే న పాగల్ తూ ॥దిల్॥ ॥మేర్రానామ్॥
ఓ బాబూజీ మై ఔర్ ఆప్
కిత్‌నా అచ్ఛా హువా మిలాప్
తుర్‌ఖుకో దేఖ్ తబియత్ ఫడ్‌కీ
అలాదీన్‌కీ మై హూఁ లడ్‌కీ ॥ఓ బాబూజీ॥
ఫూంక్ దూఁ మంతర్ ఛూ ఛూ ఛూ
సింద్‌బాద్‌ది సైలర్ తూ ॥మేర్రా నామ్॥

## సాహిబ్ బీబీ ఔర్ గులామ్

గీతం: షకీల్ బదయూని సంగీతం:హేమంతకుమార్

నజాఓ సైయ్యాఁ ఛుడాకే బయ్యాఁ
కసమ్ తుమ్హారీ మై రో పడూంగీ.... రో పడూంగీ
మచల్ రహా హై సుహాగ్ మేరా
జో తుమ్ న హోంగే, తో క్యా కరూంగీ
. క్యా కరూంగీ.... ॥నజా ఓ॥
యే బిఖరీ జుల్ఫేఁ, ఏ ఖిల్‌తా కజరా
యే మెహ్‌కీ చునరీ యే మన్‌కీ మదిరా ॥యే బిఖరీ॥
యే సబ్ తుమ్హారే లియే హై ప్రీతమ్
మై ఆజ్ తుమ్‌కో నజానే దూంగీ, జానేన దూంగీ ॥నజాఓ ॥
మైతుమ్హా రీ దాసీ, జనమ్‌కీ ప్యాసీ
తుమ్హీ హో మేరా సింగార్ ప్రీతమ్ ॥మై తుమ్హారీ॥
తుమ్హా రే రాస్తే కీ ధూల్ లేకర్
మై మాంగ్ అప్‌నీ సదా భరూంగీ... సదా భరూంగీ ॥నజాఓ॥
జో ముర్‌ఝసే అంఖియా చురా రహే హో
తో మేరీ ఇత్‌నీ అరజ్ భీ సున్‌లో ॥ జో ముర్‌ఝసే॥
పియా మెరీ మే అరజ్‌భిగున్‌లో
తుమ్హారే చరణోం మే ఆ గయీ హూ
యహీ జివూంగీ యహీ మరూంగీ ॥యహీ మరూంగీ॥

## కాగజ్‌కేఫూల్

గీతం: కైఫీ ఆజ్మీ సంగీతం: ఎస్.డి.బర్మన్

వక్త్ నే కియా క్యా హసీన్ సితమ్
తుమ్ రహేన తుమ్ హమ్ రహేన హమ్ ॥వక్త్ నే కియా ॥
బేకరార్ దిల్ ఇస్ తరహ్ మిలే,
జిస్ తరహ్ కభీ హమ్ జుదా నథే ॥బేకరార్॥
తుమ్ భీ ఖోగయే, హమ్ భీ ఖోగయే,
ఏక్‌రాహ్ పర్ చల్‌కే దో కదమ్ ॥వక్త్ నే కియా ॥
జాయేంగే కహా, సోచ్‌తా నహీ,
చల్ పడే మగర్ రాస్‌తా నహీ ॥జాయేంగే॥
క్యా తలాష్ హై, కుఛ్ పతా నహీ,
బున్ రహే హై దిన్ ఖ్వాబ్ దమ్ బదమ్ ॥వక్త్ నేకియా॥

## షర్త్

రచన: ఎస్.హెచ్.బిహారి సంగీతం: హేమంత్ కుమార్

న యే చాంద్ హోగా
న తారే రహేంగే
మగర్ హమ్ హమేషా
తుమ్హారే రహేంగే ॥నయే॥
నజర్ ఢూండ్‌తీ థీ జిసే పాలియా హై
ఉమ్మీదొకె పూలో సె దామన్ భరాహై
యే దిన్ హమ్‌కో సబ్ దిన్‌సె ప్యారీ రహేగే ॥నయే॥
కహుఁ క్యా మెరే దిల్‌కా అంమాన్ క్యా హై
తుమ్హేహర్ ఘడీ చూమ్‌నా చాహ్‌తా హై
కహా తక్ భలా జీకో మారే రహేగే ॥నయే॥
సహారా మిలే జో తుమ్హారీ హసీకా
భులాదేగె హమ్ సారాఘమ్ జిందగీ కా
తుమ్హారే లియే హై తుమ్హారే రహేగె ॥నయే॥

## ఆర్ పార్

రచన: మజూహ్ సుల్తాన్‌పురి సంగీతం: ఓ.పి.నయ్యర్

బాబుజీ ధీరే చల్‌నా ప్యార్ మే జరా సంభల్‌నా
ఆ... బడే ధోఖేహై, బడే ధోఖే హై ఇక్ రాహ్ మే ॥బాబూజీ॥
క్యోం హో ఖోయే హువే సర్ ఝుకాయే
జైసే జాతే హో సబ్ కుఛ్ లుటాయే
యేతో బాబూజీ పెహలా కదమ్ హై
నజర్ ఆతే హై అప్‌నే పరాయే
హా... బడే ధోఖే హై బడే ధోఖేహై ఇక్ రాహ్‌మే ॥బాబూజీ॥
యే మొహబ్బత్ హైహో భోలే భాలే, న కర్ దిల్ కో గమోంకే హవాలే
కామ్ ఉల్‌ఫత్ కా, నాజుక్ బహుత్ హై
ఆకే హోంఠోం పెర్ టూటేంగే ప్యాలే
ఆ... బడే ధోఖే హై ॥బాబూజీ॥
హోగయీ హై కిసీసే జో అన్‌బన్, థామ్‌లే దూస్‌రా కోయీ దామన్
జిందగానీ కీ రాహే అజీబ్ హై హు అకేలా లాఖోం హై దుష్మన్
హో బడే ధోఖే హై ఇక్‌రార్‌కు బడే ధోఖే హై.... ॥బాబూజీ॥

## భాయిభాయి (1956)

రచన: రాజేంద కిషన్ సంగీతం: మదన్‌మోహన్

ఆ... ఆ... ఆ...
ఏ దిల్ ముఝే బతాదే యూ కిస్ పే ఆగయా హై
వో కౌన్ హై జో ఆకర్ ఖ్వాబోంపే ఛాగయా హై ॥ఏ దిల్॥
మస్తీభరా చర్‌నా క్యోం రాత్ గా రహీహై ?
ఆంఖోం మే నీంద్ ఆకర్ క్యోం దూర్ జా రహీహై ॥మస్తీ॥
దిల్ మే కోయీ సితమ్‌గల్ అర్ మా జగా గయాహై
వో కౌన్ హై జువాకర్ ఖ్వాబోంపే ఛాగా యా హై ॥ఏ దిల్॥
బేతాబ్ హో రహాహై ఏదిల్ మచల్ మచల్‌కే
షాయద్ యేరాత్ పీతే
కర్‌వట్ బదల్ బదల్ కే లల్‌లా లల్‌లా లల్‌లా..... ॥బేతాబ్॥
ఏదిల్ జరాసంభాల్ జా షాయద్ వో ఆగయాహై
వో కౌన్‌హై జువాకర్ ఖ్వాబోంపే ఛాగా యా హై ॥ఏదిల్॥
భీగీహుయి హవాయె మౌసమేపే హై గులాబీ
క్యాచాంద్ క్యాసితారే హార్ ఛీజ్ హై షరాబీ ॥భీగీ॥
ధీరే సే ఏక్ నగ్మా కోయీ చున్ ఆగయా
వో కౌన్ హై జువాకర్ ఖ్వాబోంపేఛాగయాహై ॥ఏదిల్॥

## భైరవద్వీపం

రచన: సింగీతం శ్రీనివాసరావు సంగీతం: మాధవపెద్ది సురేష్

ఆ .... .... ....
విరిసినది వసంతగానం
వలపుల పల్లవిగా
మనసే మందారమై
వయసే మకరందమై
అదేదో మాయచేసినది ॥విరి॥
ఝుమ్మంది నాదం రతివేదం
జతకోరే భ్రమర రాగం
రమ్మంది మోహం ఒక దాహం
మరులూరే భ్రమల మైకం
పరువాల వాహిని ప్రవహించే ఈవని
ప్రభవించె ఆమని పులకించె కామిని
వసంతుడె చెలికాంతుడై
దరి చేరె మెల్లగా ॥విరి॥
ఋతుమహిమేమొ విరితెనె
జడివానై కురిసె తీయగా
లతలు పెనవేయ మైమరచి
మురిసేనూ తరువు హాయిగా
రాచిలుక పాడగా రాయంచ ఆడగా
రసలీల తోడుగా తనువెల్ల ఊగగా
మారుడె సుకుమారుడై
జతకూడె మాయగా ॥విరి॥

## ప్రియమైన నీకు

రచన: సీతారామశాస్త్రి సంగీతం: శివశంకర్

మనసున వున్నది చెప్పాలనున్నది మాటలు రావే ఎలా
మాటున ఉన్నది ఓ మంచి సంగతి బైటికి రాదే ఎలా
అతడిని చూస్తే రెప్పలు వాలిపోయి బిడియం ఆపేదెలా
ఎదురుగ వస్తే చెప్పక ఆగిపోయే తలపులు చూపేదెలా
ఒకసారి దరిచేరి ఎదగొడవేమిటో తెలపక పోతే ఎలా
॥మనసున॥
చింత నిప్పైన చల్లగ వుందని ఎంత నొప్పైన తెలియలేదని
తననే తలుచునే వేడిలో ప్రేమ అంటేనే తియ్యని బాధని
లేత గుండెల్లో కొండంత బరువని కొత్తగా తెలుసుకునే వేళలో
కనబడుతోందా నా ప్రియమైన నీకు
నా ఎదకోత అని అడగాలని
అనుకుంటూ తన చుట్టూ
మరి తిరిగిందని తెలపకపోతే ఎలా ॥మనసున॥
నీలి కనుల్లో అతని బొమ్మని
చూసి నాకింక చోటెక్కడుందని
నిదరే కసురుకునే రేయిలో
మేనుకున్నాయి కైపుని
వేల ఊహల్లో ఊరేగు చూపుని
కలలే ముసురుకొనే హాయిలో
వినబడుతోందా నా ప్రియమైన నీకు
ఆశల రాగం అని అడగాలని
పగలేదో రేయేదో గురుతే లేదని తెలపకపోతే ఎలా॥మనసున॥

## నువ్వేకావాలి

రచన: సీతారామశాస్త్రి సంగీతం: కోటి

కళ్ళల్లోకి కళ్ళు పెట్టి చూడవెందుకు
చెప్పలేని గుండె కోత పోల్చుకుందుకు
మనం అన్నది ఒకే మాటని నాకిన్నాళ్ళు తెలుసు
నువ్వు నేను ఇద్దరున్నామంటె నమ్మనంటువుంది
మనుసు ఓ ... ॥కళ్ళలోకి॥
ఈనాడె సరికొత్తగా మొదలైందా మన జీవితం
గతమంటూ ఏం లేదని చెరిగిందా ప్రతి జ్ఞాపకం
కనులు మూసుకుని ఏం లాభం
కలై పోదుగా ఏ సత్యం
ఎటూ తేల్చని నీ మౌనం
ఎటో తెలియని ప్రయాణం
ప్రతి క్షణం ఎదురయే నన్నే దాటగలదా ॥కళ్ళలోకి॥
గాలి పటం గగనానిదా ఎగరేసే ఈ నేలదా
నా హృదయం నీ చెలిమిదా ముడివేసే ఇంకొకరిదా
నిన్నా మొన్నలని నిలువెల్లా
నిత్యం నిన్ను తడిమేవేళ
తడే దాచుకున్న మేఘంలా
ఆకాశాన నువ్వు ఎటు వున్నా
చినుకులా కరగక శిలై వుండగలవా ॥కళ్ళలోకి॥

## మనసంతా నువ్వే

రచన: సీతారామశాస్త్రి సంగీతం: ఆర్.పి.పట్నాయక్

కిటకిట తలుపులు తెరిచిన కనులకు సూర్యోదయం
అటు ఇటు తిరుగుతు అలసిన మనసుకు చంద్రోదయం
రెండు కలిసి ఒకసారే ఎదురయ్యే వరమా
ప్రేమా ప్రేమా ప్రేమా ప్రేమా ..... ॥కిట॥
నిన్నిలా చేరేదాకా ఎన్నడూ నిదరే రాకా
కమ్మనీ కలలో అయినా నిను చూడలేదే
నువ్విలా కనిపించాకా జన్మలో ఎప్పుడూ ఇంక
రెప్పపాటైనా లేక చూడాలనుందే
నాకోసమా అన్వేషణ
నీడల్లె వెంట ఉండగా
కాస్సేపిలా కవ్వించనా
నీ మధుర స్వప్నమై ఇలా
కంట తడి నాడూ నేడు చెంప తడిమిందే చూడూ
చెమ్మలో ఏదో తేడా కనిపించలేదా
చేదు ఎడబాటే తీరి తీపి చిరునవ్వే చేరి
అమృతం అయిపోలేదా ఆవేదనంతా
ఇన్నాళ్ళుగా నీ జ్ఞాపకం
నడిపింది నన్ను జంటగా
ఈనాడిలా నీ పరిచయం
అడిగింది కాస్త కొంటెగా
ప్రేమా ప్రేమా ప్రేమా ప్రేమా ॥కిటకిట




జాతీయస్థాయిలో తెలుగువారికి కీర్తిప్రతిష్ఠలు కట్టబెట్టిన చిత్రం




**1956లో విడుదలయిన ఈ చిత్రం రాష్ట్రపతి రజత పతకాన్ని కూడా పొందింది. అతిరథమహారథులు నటించిన ఈ చిత్రానికి సంగీతం విశ్వనాథం - రామ్మూర్తి. రచన సముద్రాల రాఘవాచార్య. ఈ చిత్రంలోని పాటలన్నీ ప్రామాణికతను కలిగివున్నవే అయినా కొన్ని పాటలని మాత్రమే ఇక్కడ విశ్లేషించటం జరుగుతుంది అవి:**

చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ
కేళి చలన్మణికుండలమండిత గండయుగ స్మితశాలీ
హరిరిహ ముగ్ధ వధూనికరే! విలాసిని విలసతికేళిపరే....
కాపి విలాస విలోల విలోచన ఖేలనజనితమనోజం
కాపి విలాస విలోల విలోచన ఖేలనజనితమనోజం
ధ్యాయతి ముగ్ధవధూ రధికం మధుసూదన వదన సరోజం
ధ్యాయతి ముగ్ధవధూ రధికం మధుసూదన వదన సరోజం
హరిరిహ ముగ్ధ వధూనికరే! విలాసిని విలసతికేళిపరే....
శిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామాం
పశ్యతి సుస్మిత చారుతారాం అపరామనుగచ్ఛతి వామాం
హరిరిహ ముగ్ధ వధూనికరే! విలాసిని విలసతికేళిపరే....
చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ









పి.సుశీల ఆలపించిన ఈ జయదేవ కృతిని నటి సంధ్య వీణ వాయిస్తూ అభినయించింది. దృశ్య ప్రాధాన్యంగా ఎదురుగా రాధాకృష్ణుల నృత్యాన్ని కూడా తెరపై చూపిస్తారు. 'పురచ్చితలైవి' గా పేరుగాంచిన తమిళ రాజకీయ నాయకురాలు, నటి జయలలిత - ఈ పాటకు అభినయించిన సంధ్య కుమార్తెయేనని ఈ తరం వారికి తెలుసుకోవలసిని అవసరం వుంది. మోహనరాగానికి ఒక ప్రామాణిక గీతంగా నిలిచిపోదగ్గ ఈ గీతం సుశీల హిట్స్‌లో ఒకటిగా ఇప్పటికీ చెప్పుకోవచ్చు.



*This feature is sponsored for 6 issues by*
**Sri MANISHARMA** *(music director)*
in memory of his beloved friend
late THIRUPATHI SWAMY *(director)*

ఝుణ్‌ఝుణ్ కంకణములూగ
ఘల్‌ఘల్ కింకిణులు మ్రోగ
కోరిక తీరేర కూడేనురా.... ॥ఝుణ్ ఝుణ్॥
రూపున కెరయైనదానా జాణా నెరజాణా
నెనరుకు తగుదానా!
నే రూపున కెరయైనదానా జాణా నెరజాణా
కూరిమి మీరా నీతో కులికే
వరమూ లభించెను బ్రతుకే ఫలించెన
వలపులవల రాజా నన్నేలరా... ॥ఝుణ్ ఝుణ్॥
కనుసన్నల మెలగేనురారా...
కనుసన్నల మెలగేనురారా...
సుకుమార...సుకుమార
పరువము మనదేరా
రాధా మనోహర
వెన్నెల వేళ విరులాలీలా
వెన్నెల వేళ విరులాలీలా
విరిసి సుఖింతుము పరవశింతము
సొంపుగ సంపంగి జంపాలలోన ॥ఝుణ్ ఝుణ్॥



ఈ పాటను రావుబాలసరస్వతి దేవి పాడగా సురభి బాలసరస్వతి అభినయించటం జరిగింది. అక్కినేని, ఎన్.టి.ఆర్, ముక్కాముల కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. రావు బాలసరస్వతి దేవి పాడిన మంచి పాటలలో ఈ పాటకు అభిమానులు విపరీతంగా ఉన్నారు. శుద్ధ సారంగ రాగం ఆధారంగా స్వరపరచబడిన ఈ పాట సాధనచెయ్యదగ్గది కూడా !

దురదృష్టం ఏమిటంటే - ఈ పాటను తరువాతి రోజులలో 'తెనాలి రామకృష్ణ' సినిమా ప్రింట్ నుండి తొలగించారు. సీడీలలో గాని, వీ హెచ్ ఎస్ టేపులలో గాని ఈ పాట దొరికే అవకాశమే లేదు. ఆ రోజులలో రికార్డుల రూపంలో దాచుకున్న వారి దగ్గర, హెచ్.ఎం.వి.వారి 'తెనాలి రామకృష్ణ' క్యాసెట్‌లోనూ, 'అలనాటి అందాలు' పేరిట వివికే రంగారావు గారు తీసుకువచ్చిన ఆర్.బాలసరస్వతి దేవి క్యాసెట్‌లోను ఆడియో రూపంలో ఈ పాట లభిస్తుంది.

అకతాయి పిల్లమూక
అందాల చిలకా
నాకేసిచూస్తారు నవ్వుతారే
అయ్యయ్యో నాకేసిచూస్తారు
నవ్వుతారే ॥ఆకతాయి॥
చలవ మడత కట్టుకునీ
తలపాగా చుట్టుకుని
వీపున మూటేసుకుని
వీధియెంట పోతుంటే ॥ఆకతాయి॥
కనుముక్కు తీరులోన
పనివాడి తనములోన
కనరారు నాసాటి
అందాల చిలకా
గూనొకటి దాపురించి
పరువు తీసెనే
నలుగురిలో నా బతుకు
నవ్వుల పాల్‌చేసెనే ॥ఆకతాయి॥



సినిమాలోని కథ ప్రకారం - ఏనుగుతో తొక్కించడానికి వీలుగా తెనాలి రామకృష్ణుని రాజభటులు గోతిలో కంఠం వరకు పాతిపెట్టి ఏనుగును తీసుకురావటానికి వెళతారు. ఆ సమయంలో తెనాలి రామకృష్ణునికి రాయలవారిపై జరుగుతున్న కుట్ర తెలుస్తుంది. ఎలా తప్పించుకుని వెళదామా అని ఆలోచిస్తుండగా గూని కలిగిన ఓ రజకుడు పాడుకుంటూ అటు వస్తాడు. అతడిని బుట్టలో పడేసి తన స్థానంలో అతడిని కప్పిపెట్టి బైటపడతాడు తెనాలి రామకృష్ణుడు. ఈ సన్నివేశంలో రజకుడిగా నటించిన హాస్యనటుడు రామకోటి ఈ పాటను పాడారు. ఎంచుకున్న వస్తువుకు అనుగుణంగా గల అంశాలను అందమైన మాటలతో అర్థమయ్యేలా చెప్పగలగటమే సినీ కవికి ఉండవలసిన ముఖ్య లక్షణం. తన కలానికి ఏ వైపైనా పదునే అని తెలిసే విధంగా రాసిన సీనియర్ సముద్రాల చాతుర్యం పాటను ఒకటి రెండుసార్లు గమనిస్తే అర్థమవుతుంది.

**తీరని నా కోరికలే తీరెను ఈ రోజు**
**కూరిమి నా చెలిమి కోరెను రారాజు ॥తీరని॥**
**తరుణులలోన నా సరిచానా సరసుల నీకు సరీ లేరు నెరజాణా ॥2॥**
**ఆటల పాటలలో వినోదాల వేడుకలో ॥2॥**
**వాటముగా నిను లాలింతురా దొరా ॥2॥ ॥తీరని॥**
**వన్నెల మేడ వెన్నెల నీడ**
**వాడని మల్లియల వాడలలో హాయిగా ॥2॥**
**వింతల చేయుదురా విలాసాల తేలుతురా ॥2॥**
**చూతువురా స్వర్గ వైభోగమీ ఇలా.... ॥2॥ ॥తీరని॥**



ఈ పాటను భానుమతి పాడగా భానుమతి, ఎన్.టి.రామారావు అభినయించారు. సినిమాలో గల మిగిలిన పాటలతో పోలిస్తే కొంత రిలీఫ్‌గా అనిపించే పాట యిది. జూన్ 1-15 సంచికలోని 'ఆపాతమధురం'లో 'సంతానం' సినిమాకు సంబంధించి విశ్లేషణలో 'సంతోషమేలా సందేహమేలా' పాట గురించి చెబుతూ 'సుభాహ్ కాతారా' అనే సినిమాలోని తలత్ మహమ్మద్ పాడిన 'గయా అంధేరా హువా ఉజలా' పాటను ప్రస్తావించుకోవటం జరిగింది. ఆ హిందీ పాట చరణాల వరస గుర్తుంటే - ఈ 'తీరని నా కోరికలే తీరెను ఈనాడు' పాటలోని 'తరుణుల లోన నా సరిచాన / వన్నెల మేడ వెన్నెల నీడ' అనే చరణాల ఎత్తుగడతో పోల్చి చూసుకోండి. ఒకేలా ఉంటాయి. ఇది కేవలం ఒక అందమైన అన్వయింపులా భావించాలే కాని దీనివల్ల విశ్వనాథన్ - రామ్మూర్తి శక్తి సామర్ధ్యాలని తక్కువగా అంచనా వెయ్యడానికి వీల్లేదు. చరణాంతాలలో - అంటే - వాటముగా నిన్ను లాలింతురాదొరా / వైభోగమీ ఇల - దగ్గర ఆలపించుకుంటూ - 'దేవదాసు' సినిమాలోని 'అందం చూడవయ్యా ఆనందించవయ్యా' పాటలోకి వెళ్ళి చూడండి. రెండిట్లోను విశ్వనాథన్ (యం.యస్. విశ్వనాథం) కాంట్రిబ్యూషన్ ఎంతో తెలుస్తుంది.

**హరేరాం హరేరాం (3)**
**గండుపిల్లి మేనుమరచి**
**బండ నిదుర పోయెరా**
**కొండ ఎలుకలిచట**
**రెండు కొలువు చేయుచుండెరా ...గండు...**
**హరేరామ రామకృష్ణ హరేకృష్ణ హరేహరే**
**హరేరామ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే**
**హరేరాం హరేరాం హరేరాం (3)**
**ఎక్కరాని మానికొమ్మ**
**నొక్కపండు పండెరా**
**మెక్కకోరి చిలుకలైదు**
**నిక్కినిక్కి చూసెరా**
**రంకెవేసి చేపపిల్ల**
**రాజ్యమంత మేసెరా**
**హుంకరించి మిడతపిల్ల**
**దానికి ఎరవేసెరా**
**హరేరామ రామకృష్ణ హరేకృష్ణ హరేహరే**
**హరేరామ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే**
**హరేరాం హరేరాం హరేరాం (3)**



హరికాంభోజి రాగచ్ఛాయలలో స్వరపరచబడిన 'గండుపిల్లి మేనుమరచి' పాటను ఘంటసాల, నాగయ్య పాడేరు. తెరపై అక్కినేని నాగేశ్వరరావు, నాగయ్య అభినయించారు.

విజయనగర సామ్రాజ్య పతనానికి బహమనీ సుల్తానులు పథకం వేసి వారి వ్యూహరచనను అమలు చేస్తున్న తరుణంలో ఆ పన్నాగాన్ని పసిగట్టిన తెనాలి రామకృష్ణుడు, మహామంత్రి తిమ్మరుసు మారువేషాలు ధరించి పాడే సన్నివేశానికి అనుగుణంగా రాసిన పాట ఇది. మంద్రస్థాయిలో గంభీరంగా ఉండే నాగయ్య కంఠం, తారస్థాయిలో కూడా అద్భుతంగా ఉండే ఘంటసాల గాత్రం యుగళంగా చేరి రసానుభూతిని ద్విగుణీకృతం చేయగా

విన్నవారి మనోవీధులలో చిరస్థాయిగా నిలిచిపోయే రీతిలో రూపొందింది ఈ పాట. తత్త్వగీతాల ధోరణిలో జానపద బాణీలను కలబోసి అందించారు విశ్వనాథం - రామ్మూర్తి. ఇక నర్మగర్భంగా మర్మాలను కప్పిపుచ్చుతూ విప్పి చెప్పడంలో సీనియర్ సముద్రాల తను సీనియర్‌నేనని మరోసారి ఋజువు చేసుకున్నారీ గీతంలో.

చేసేది ఏమిటో చేసెయ్యి సూటిగా
వేసెయ్యిపాగా ఈ కోటలో ॥చేసేది॥
ఎన్ని కష్టాలు రానీ నష్టాలు గానీ
నీ మాట దక్కించుకో బాబయా... బాబయ్యా ॥చేసేది॥
నాటేది ఒక్క మొక్క వేసేది నూరుకొమ్మ
కొమ్మ కొమ్మ విరగబూసె వేలాడిగా... ఆ... ॥నాటేది॥
ఇక కాయాలి బంగారు కాయలు
భోంచేయాలి మీ పిల్లకాయలు ॥ఇక కాయాలి॥ ॥చేసేది॥
రహదారి వెంట మొక్కనాటి పెంచరా
కలవాడు లేనివాడు నిన్ను తలచురా
భువిని తరతరాల నీదు పేరునిలచురా
పనిచేయువాడె ఫలము నారగించురా... ॥భువిని॥ ॥చేసేది॥



ఈ పాట సూటిగా హృదయాల్ని తాకి అందరి ఆదరాభిమానాలను చూరగొంటుంది. సింధుభైరవి రాగానికి చక్కని ఉదాహరణగా మిగిలిపోయిన ఈ పాటలో వుడ్‌ఫోన్ వాద్యం ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుంటూ వినిపిస్తుంది. 1950లో విడుదలయిన హిందీ చిత్రం 'సమాధి'లో సంగీత దర్శకుడు సి. రామచంద్ర సింధుభైరవిరాగంలో స్వరకల్పన చేసిన 'ఓ పాస్ ఆ రహే హై హమ్ దూర్ జారహే హై' పాటలో వుడ్‌ఫోన్ వాద్యాన్ని ఉపయోగించిన తీరు ఈ పాటకు ప్రేరణగా నిలిచివుండవచ్చునని కొందరు పరిశీలకుల అభిప్రాయం. ఈ పాటను ఘంటసాల పాడగా తెరపై అక్కినేని అభినయించారు.

ఈ తెనాలి రామకృష్ణ చిత్రంలో జయదేవుని అష్టపది 'చందన చర్చిత నీలకళేబర'తో పాటు అన్నమాచార్య విరచితమైన 'ఇచ్చకాలు నాకు నీకు ఇంక ఏలరా' అనే కృతి కూడా ఉంది. అయినా టైటిల్స్‌లో వారి పేర్లు ఉండవు. ఎందుకంటే ఆ మహానుభావులు రాసినవి ఈ చిత్రంలో ఉపయోగించుకోవడం జరిగిందే గాని ఈ చిత్రం కోసం వారు వ్రాయలేదు కనుక. అలాగే నేపథ్యగానం చేసిన వారిలో భానుమతి, నాగయ్య, రామకోటి పేర్లు కూడా వుండవు. ఎందుకంటే వారు తమకు తాము పాడుకునే వారే గాని నేపథ్య గానం చేసినవారు కాదు కనుక. ఇప్పుడు తెనాలి రామకృష్ణ చిత్రాన్ని చూస్తే ఆ సంప్రదాయం ఆశ్చర్యంగానే వుంటుంది మరి.

ఇవిగాక జగముల దయనేలే జనని, ఓ లాలా, ఈ వాలు కన్నులు ఈ వన్నె చిన్నలు ఖుషీ మీర కనరా, నీవె రా రారాజీవెగా వంటి పాటలతో పాటు అద్భుతమైన పద్యాలు కూడా ఉన్నాయి. ఈ చిత్రంలోని పాటలన్నీ ఒక ఎత్తు పద్యాలన్నీ ఒక ఎత్తు... ఆ పద్యాలను పాడి మెప్పించిన తీరు మరొక ఎత్తు. 'మంచి మనసులు' సినిమాలో 'అహో ఆంధ్ర భోజా శ్రీకృష్ణదేవరాయా' అనే 'శిలలపై శిల్పాలు చెక్కినారు' పాటలో 'తెనాలి రామకృష్ణ' పద్యాలలోని షాట్లు ఉపయోగించడం - 'ఆదిత్య 369' సినిమాలో 'మేక తోకకు మేక' అనే పద్యాన్ని చెప్పవలసి నప్పుడు ఈ 'తెనాలి రామకృష్ణ' చిత్రంలో ఆ పద్యానికి కట్టిన ట్యూన్‌నే ఉపయోగించటం - ఇవన్నీ ఆ చిత్రంలోని పద్యాలు, వాటి చిత్రీకరణ ఎంత గాఢంగా నాటుకొనిపోయాయో తెలియచెబుతాయి.

ఈ పద్యాలను పాడినందుకు స్వర్గీయ ఘంటసాల ఏమీ తీసుకోలేదట - "చిన్న చిన్న పద్యాలండీ.... వీటికి పారితోషికం తీసుకోవడం ఏమిటి?" అని అన్నారట. అయినా సరే నిర్మాత - దర్శకుడు అయిన బి.ఎస్.రంగా పద్యానికి వంద చొప్పున ఇంటికి వచ్చి ఇచ్చివెళ్ళారని ఘంటసాల వారి సతీమణి సావిత్రమ్మగారు తెలిపారు.

## తారాగణం

**భానుమతి - జమున**
**ఎ.నాగేశ్వరరావు - ఎన్.టి.రామారావు**
**నాగయ్య - ముక్కామల**
**వంగర, మాష్టర్ వెంకటేశ్వర్, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, వై.విశ్వనాథం, డా. కామరాజు, ఎ.రామనాథశాస్త్రి, పొదిలి కృష్ణమూర్తి, సి.హెచ్.వెంకటేశ్వర్రావు మొ॥**
**సురభి, బాలసరస్వతి, సంధ్య, రాణి, లక్ష్మీకాంత, ఇందిరాచార్య, వెంకుమాంబ మొ॥**
**ప్లేబాక్:**
**ఘంటసాల, మాధవపెద్ది, లీల, ఆర్.బాలసరస్వతి, సుశీల, కోమల**

**నిర్మాత, దర్శకుడు, ఛాయాగ్రాహకుడు : బి.యస్.రంగా**

## టెక్నీషియన్స్

| | | |
|---|---|---|
| రచన | : | సముద్రాల రాఘవాచార్య |
| సంగీతం | : | విశ్వనాథం, రామమూర్తి |
| కళ | : | వాలి, గంగా |
| నృత్య దర్శకులు | : | చోప్రా, గోపాలకృష్ణన్ |
| మేకప్ | : | కె.వి.స్వర్ణప్ప |
| అసిస్టెంట్సు | : | తంగప్ప, శ్రీనివాసన్ |
| దుస్తులు | : | కె.అచ్యుతరావు |
| అసిస్టెంట్సు | : | వి.యన్.మూర్తి, బాబు |
| ప్రొడక్షన్ మేనేజర్ | : | వి.కె.శ్రీనివాసన్ |
| శబ్దగ్రాహకులు | : | రంగస్వామి, శేషాద్రి, రామస్వామి |
| ఛాయాగ్రహణం | : | బి.యన్.హరిదాస్ |
| స్టిల్సు | : | ఆర్.వెంకటాచారి, బి.ఏ., |
| కూర్పు | : | పి.జి.మోహన్ |
| అసిస్టెంటు | : | దేవేంద్రనాధ్ |
| అసిస్టెంటు డైరెక్టర్ | : | వి.యస్.రంగాచారి |

1-15 జులై సంచిక యందు విజయా ప్రొడక్షన్సు వారి సూపర్‌హిట్ చిత్రం "మిస్సమ్మ" చిత్రం పాటలు ప్రచురించినందులకు ధన్యవాదములు. ఈ పాటలు ఎంతవిన్నా తనివితీరవు. ఈ చిత్రంలో ఓ విషయం: ఎన్టీఆర్, సావిత్రిగార్లు ఉద్యోగం కోసం రేలంగిని వెంట పెట్టుకుని ఎస్వీరంగారావు ఊరికి వచ్చి బసచేస్తారు. ఎన్టీఆర్ గదిలో మంచి నీళ్లుండవు. సావిత్రి గదికి ఎన్టీఆర్ ఎక్కిళ్లతో వచ్చి తలుపు తడ్తాడు. అప్పుడు బ్యాక్‌గ్రౌండ్ సంగీతంలో శ్రీ ఎస్.రాజేశ్వరరావు గారు రాజ్‌కపూర్, నర్గీస్ నటించిన సూపర్‌హిట్ చిత్రం "ఆవారా"లోని పాట "ధం భర్ జో ఉధర్ మూ ఫేరే, ఓ చందా" ఎంత తెలివిగా వేశారో, సంగీత ప్రియులు గమనించకపోయి వుంటే యిప్పుడు విని ఆనందించండి. ఎల్వీప్రసాద్ దర్శకత్వ ప్రతిభకు జోహార్లు.

-యు.యు.ఉరుకుంద, ఎమ్మిగనూరు



1-15 జూన్ హాసం సంచికలో పేజీ 11లో "కైఫీ ఆజ్మీ" సినిమా పాటలలో కొన్ని తప్పులు దొర్లినవి. హకీకత్ విడుదల అయినది1954లో కాదు, 1964లో "బహారేఁ ఫిర్ భీ ఆయేఁగీ" (బహార్ ఫిర్ ఆయేఁగీ' అని ప్రింట్ అయింది! విడుదల 1971లో కాదు 1966లో. 'నజీవో సయ్యా' వ్రాసింది కైఫీ అజ్మీకాదు, షకీల్ బదాయునీ.

-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్

(మీరు కరక్టు - ఎడిటర్)

'పదసంపద' శీర్షికలో 'శోధన' అంటే ప్రాయశ్చితం అని వ్రాసారు. (కరుణించు మేరీ మాత పాటలలో) కానీ అది తప్పు. బైబిల్ ప్రకారం దేవుడైన యెహోవా 'పది ఆజ్ఞలను' (Ten Commandments) తన బిడ్డలకు ఇచ్చారని, దొంగతనం చేయరాదు, అబద్ధం ఆడరాదు వంటివి వాటిలో కొన్ని అనీ ప్రతీతి. అయితే ప్రతీ క్రైస్తవుడు ఈ పది ఆజ్ఞలను ఆచరించాలనే ప్రయత్నిస్తాడు. దేవుని విరోధి అయిన సాతాను ప్రతీక్షణం మానవుని మనస్సులో దూరి ఇవి ఆచరించకుండా అడ్డుపడతాడు. దీనినే 'సాతాను శోధన' అంటారు. శోధన అంటే చెడువైపు పురికొల్పడం, Tempt చేయడం అని చెప్పవచ్చు. కథానాయకి 'మిస్ మేరీ' ఉద్యోగం కోసం అబద్ధాలు ఆడటం, అది నిలుపుకోవటం కోసం మరిన్ని అబద్ధాలు చెప్పడంతో తనలో తనే పశ్చాత్తాపపడుతూ పాడే ఈ పాటలో 'క్షణమైన శాంతి లేదే, దినదినము శోధనాయే' అని పాడు తుంది. ఈ మాటకి అర్థం నాకు Christian School లో చదవటం వల్ల తెలిసింది.

-వై.ఎస్.నాగమణి, హైదరాబాద్

# తెలుగు పాటలు - తమిళ మాతృకలు

(గత సంచిక తరువాయి)

| వ.నెం. | చిత్రం పేరు | - పాట (తమిళం) | - తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 51. | నానుం ఒరుపెణ్ | -కణ్ణాకరుణనిరకణ్ణా | - నాదీఆడజన్మే | "కన్నయ్యా నల్లని కన్నయ్యా" |
| 52. | నానుం ఒరుపెణ్ | -పూంపోల పూంపోల | - నాదీఆడజన్మే | "చిన్నారిపొన్నారి పువ్వు" |
| 53. | కొళందై దైవమ్ | -అన్బుళ్ల మాంగిళియే | - లేతమనసులు | "అందాల ఓ చిలుకా" |
| 54. | కొళందై దైవమ్ | -కోళి ఒరు కూచ్చిలే | - లేతమనసులు | "కోడి ఒక కోనలో" |
| 55. | కొళందై దైవమ్ | -కొళందై దైవం | - లేతమనసులు | "పిల్లలు దేవుడూ" |
| 56. | కొళందై దైవమ్ | -ఎన్నవేగం నిల్లుబామా | - లేతమనసులు | "హల్లో మేడం సత్యభామా" |
| 57. | సూర్యకాంతి | -పరమశివన్ కళిత్తలియే | - మొగుడా? పెళ్లామా? | "పరమశివుని మెడలోని" |
| 58. | ఇదయకమలం | - ఉన్నైకాణాద | - ఇల్లాలు | "నీవు నావూహాలందే" |
| 59. | కందన్ కరుణై | -తిరుప్పరం నీసిరిమురుగన్ | - "నారీనారీనడుమ మురారి" | "ఇరువురి భామల కౌగిలిలో స్వామి" |
| 60. | భద్రకాళి | -కన్నంవరుకైకొళందై | - భద్రకాళి | "చిన్నిచిన్ని కన్నయ్యా" |
| 61. | వీరాభిమన్యు | -వేలుం విల్లుం విళియాడ | - వీరాభిమన్యు | "రంభా ఊర్వశి తలదన్నే" |
| 62. | వీరాభిమన్యు | -తొట్టయిడం కుళిరిదియో | - వీరాభిమన్యు | "తాకిన చోట ఏదో" |
| 63. | వీరాభిమన్యు | -ఓహో పుదు ఉలగం | - వీరాభిమన్యు | "అదిగో నవలోకం" |
| 64. | వీరాభిమన్యు | -పార్త్తే, సిరిత్తే, పక్కత్తిల్ | - వీరాభిమన్యు | "చూచి, వలచి, చెంతకు" |
| 65. | వీరాభిమన్యు | -కళ్లతనమే ఉరివాయ్ వంద | - వీరాభిమన్యు | "నల్లని వాడా రా రారా" |
| 66. | వీరాభిమన్యు | -నీయుం ఒరు పిణ్ణాళ్ | - వీరాభిమన్యు | "చల్లని స్వామిని నీవైతే" |
| 67. | నిశ్చయతాంబూలం | -మాలై సూడుం మననాళ్ | - వీరాభిమన్యు | "ప్రేమనిండిన యిల్లే" |
| 68. | ఎంగ ఊరు రాజా | -యారైనంబి నాపోరందు | - ధర్మదాత | "ఎవ్వరికోసం ఎవరున్నారు" |
| 69. | "అవళ్ ఒరు తొడర్‌కదై" | -కడవుళ్ల యొత్తం మేదై" | - అంతులేనికథ | "తాళికట్టుశుభవేళా" |
| 70. | "అవళ్ ఒరు తొడర్‌కదై" | -కన్నిలే నిన్నవండు కన్గళి | - అంతులేనికథ | "కళ్ళలో నీరు కన్నులకే" |
| 71. | "అవళ్ ఒరు తొడర్‌కదై" | -దైవం వంద వీడు | - అంతులేనికథ | "దేవుడే ఇచ్చాడు" |
| 72. | కాదలిక్క నేరమిల్లే | -ఉంగపొన్నానకైగళ్ | - ప్రేమించిచూడు | "నీ అందాల చేతులు" |

(వచ్చే సంచికలో మరి కొన్ని)

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూర్

# మా మామయ్య ఘంటసాల కథ

-శ్రీమతి ఘంటసాల సావిత్రి

ఘంటసాల వెంకటేశ్వరరావు మామయ్య 1922 డిసెంబర్ 4వ తేదీన గుడివాడ తాలుకా, కృష్ణాజిల్లాలోని చౌటపల్లి గ్రామములో జన్మించారు. ఆయన తల్లి రత్తమ్మ గారు (నాకు



అమ్మమ్మ) తండ్రి సూర్యనారాయణగారు (నాకు తాతయ్య). వారికి ఆరుగురు సంతానం. ముగ్గురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు. అన్నపూర్ణగారు ఆదినారాయణ శాస్త్రిగారు. తమ్ముడు సదాశివరావు. అక్క చెల్లెళ్లు జయప్రద, వెంకట సుబ్బమ్మ, అన్నపూర్ణ. పూర్వీకులు శివార్చనాపరులు. దేవాలయంలో పూజారులు.

సూర్యనారాయణ తాతగారు సంగీతజ్ఞులు , మృదంగం కూడా వాయించేవారు. ప్రధానంగా వారు తరంగగానంలో ప్రత్యేక కృషి చేసిన వారు. తాతగారు సంసార జీవితంలో అతి నిర్లిప్తంగా ఉండేవారట. ఇంట్లో ఉంటే జపం చేసుకోవడం, బయటకు పోతే ఏ ఏకాహాలలోనో, సప్తాహాలలోనో, భజన కాలక్షేపాలలోనో తన్మయులై గానం చేస్తుండటం. ఇంతే వారి జీవిత విధానంట. సంసార బాధ్యతలను విస్మరిస్తున్నారని బంధువులంతా విమర్శించేవారట ఆయన్ను.

తాతగారు మృదంగం వీపున కట్టుకుని ఘంటసాల మామయ్యను భుజం మీద ఎక్కించుకుని ఎంత దూరమైనా భగవత్సంకీర్తన జరిగితే అక్కడికి హాజరయి, తాను మృదంగం వాయిస్తూ పాడుతూ, మామయ్య చేత నృత్యం చేయిస్తూ ఉండేవారట. మామయ్య బాల్య స్వరూపం, నృత్యం అందరికీ ముచ్చట గొలుపుతూ ఉండేదట. ఆ రోజుల్లో మామయ్యను "బాల భరతుడు" అని అందరూ ముద్దుగా పిలిచేవారట. ఎన్నో బంగారు పతకాలు, బహుమతులు అప్పట్లో లభించాయట. ఆ బాల్యపు రోజులలోనే విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దర్శనం అయిందట.

మామయ్య పదకొండవ ఏట సూర్యనారా



ఘంటసాల పుట్టిన ఇల్లు

యణ తాతగారు మృతి చెందారు. చివరి రోజులలో సూర్యనారాయణ తాతగారు మామయ్యను దగ్గరకు తీసుకుని, సంగీత విద్య యొక్క గొప్పతనం చెప్పుతూ మామయ్యను సంగీతంలో తరించవలసినదిగా ఆదేశిస్తూ ఉండేవారట. తాతయ్యగారి యావజ్జీవిత తపఃఫలమే తన అభ్యుదయానికి కారణం అని మామయ్య నమ్మేవారు.

సూర్యనారాయణ తాతగారు పోయిన తరువాత మామయ్యకు చదువు, సంధ్యలు తిన్నగా జరగలేదట. ఎప్పుడూ దృష్టి ఆటపాటల మీద, నాటకాల మీద ఉండేదట. వారి కుటుంబం అంతా వారి మేనమామ ర్యాలి పిచ్చిరామయ్య గారి సంరక్షణలోకి వచ్చింది. ఇంట్లో వాళ్ళకు తెలియకుండా మామయ్య నాటకాలలో వేషాలు వేస్తుండేవారట. అసలు నాటకం ప్రారంభించటానికి వున్న వ్యవధిలో ప్రేక్షకుల ముందు నృత్యం చేసేవారట మామయ్య.

ర్యాలి పిచ్చి రామయ్య గారు మామయ్యకు 'చదువు మీద ఆసక్తి లేదు ఎలా బ్రతుకుతాడో' అని వ్యవసాయం నేర్చుకోమని పొలానికి పంపారట. పొలంలో గడ్డపారతో భూమిని తవ్వేసరికి చేతులు బొబ్బలు ఎక్కాయట. ఇంటికి వస్తే చేతులు బొబ్బలు ఎక్కడం చూసి, బాధపడి బొబ్బలకు నూనె రాస్తూ నీకు చదువు మీద ఆసక్తి లేదు, వ్యవసాయం చేయటం రాదు. ఎలాగ బ్రతుకుతావురా" అని ఏడ్చేశారట. మామయ్య చేతులు గులాబి రంగులో ఎంతో మెత్తగా ఉండేవి. ఇక లాభం లేదు. ఎలాగైనా సంగీతం నేర్చుకోవాలనీ మామయ్య, ఆయనలో ఆయన శపథం చేసుకొని చుట్టుప్రక్కల నున్న చాలామంది సంగీత విద్వాంసులను ఆశ్రయించారట శిక్షణ కోసం. అయితే గురుకులవాస దీక్షకు నాటి మామయ్య బాల్య ప్రవృత్తి తట్టుకోలేక పోయింది. అంతటితో ఏ విద్యావ్యాసంగం లేక ఏదో కాలక్షేప ధోరణిలో పడింది. మామయ్య జీవితం. అట్టి పరిస్థితులలో ఒక సంగీత సమావేశంలో, మామయ్య, ఆయన సంగీతం నవ్వుల పాలవడం జరిగింది. అప్పటినుండి మామయ్యలో ఒక వేదన ప్రారంభం అయిందట. "సంగీత విద్య సాధించాలి, తండ్రిగారి ఆత్మకు శాంతి కలిగించాలి. నన్ను అపహాస్యం చేసిన వారిని సంగీత విద్యలోనే ప్రతీకారం చేయాలి" ఇదే మామయ్య నిరంతర ధ్యాసట. ఆ రోజులలో ఆంధ్రదేశంలో ఏకైక సంగీత కళాశాల విజయనగరంలో మాత్రం ఉందట. మహామహులు శ్రీ ఆదిభట్ల నారాయణ దాసుగారు, శ్రీద్వారం వెంకటస్వామి నాయుడు గారు మొదలగు సుప్రసిద్ధ విజయనగర సంగీత విద్వాంసుల కీర్తి బాల్యం నుండి మామయ్యకు తెలుసునట. సంగీత విద్య విజయనగరం కళాశాలలోనే సాధన చేయాలని పట్టుదల. విజయనగరం వెళ్ళడానికి తగిన ప్రోత్సాహం యింట్లో లభించే ఆశలేక పోయింది....

(ఇంకా వుంది)

జులై 29 సి.నారాయణరెడ్డి పుట్టినరోజు సందర్భంగా....

# అప్పుడనిపించింది సాహిత్యం కన్నా సంగీతం ఎంత బలమైనదోనని...

-సి.నారాయణరెడ్డి

బైటికి తన్నుకొచ్చిన భావాన్నైనా, జీవాన్నైనా సమానంగా ప్రేమించగల ప్రతి కవికీ అంతర్మథనం, ప్రతి తల్లికీ ప్రసవవేదన తప్పనిసరి... అన్నాడో మినీకవి. సృజనాత్మక ప్రక్రియ ఏదైనా సరే. ఒక చిన్నపాట అయినా సరే!

"అబార్షన్ చేసేద్దాం అని అనుకొని ఏదో కారణాల వల్ల గర్భాన్ని నిలబెట్టుకుంటే అలా పుట్టినపిల్లాడు విపరీతమైన పేరు ప్రఖ్యాతుల్ని తెచ్చుకుంటే ఎలా ఉంటుందో "శివరంజనీ నవరాగిణీ" పాటని తల్చుకుంటే అలా ఉంటుంది" అని అన్నారు డాక్టర్ సి.నారాయణరెడ్డి.



తెలుగు సినీ గీతాల చరిత్రలో నారాయణరెడ్డికి ఒక యుగం ఉంది. హైదరాబాద్ నుంచి పాటలు రాయటానికి మద్రాసు వెళ్తూ ఎయిర్‌పోర్ట్‌లో దిగగానే రెండు జేబుల్లోంచి పాటలు తీసి ఇచ్చేవారని ఆయన గురించి చెప్పుకునే వారు. పాటలు రాయడంలో తనకంటూ ఓ శైలిని, "పాట" వాన్ని రుచి చూపించిన డాక్టర్ సి.నారాయణరెడ్డి కొన్ని పాటల పుట్టుపూర్వోత్తరాలను ఇలా విశదీకరించారు-

"తూర్పు - పడమర" చిత్రానికి మాతృక అయిన 'అపూర్వ రాగంగళ్' చిత్రంలో జేసుదాసు పాడిన "అతిశయరాగం ఆనందరాగం" మంచి హిట్ గీతం. దాన్ని తెలుగులోకి యథాతథంగా తీసుకుందామనుకున్నారు. అలా చెయ్యడం నాకూ, రమేష్‌నాయుడికి ఇష్టం లేదు. నిర్మాత రాఘవ 'ఆ పాటని డబ్ చేద్దాం. రాయండి మీరు - డబ్బింగ్ బాగా రాస్తారు' అని అన్నాడు.



జ్ఞానపీఠ్ అవార్డు అందుకుంటున్న సందర్భంగా...

విషయం ఏమిటంటే అంతకు ముందు నేను శివాజీగణేశన్ నటించిన 'కర్ణ' సినిమాకి పాటలు డబ్ చేశాను. రాఘవ ఆ సినిమాకి ప్రొడక్షన్ వ్యవహారాలు చూసుకునేవాడు. అంచేత నన్ను మళ్ళీ డబ్ చేయమని వత్తిడి చేశాడు. 'మరో మంచి పాట రాసుకోవచ్చు కదా' అన్నాను. 'అంతమంచి పాట రాయగలరా' అని అన్నారు రాఘవ. నాకది సవాల్‌గానే అనిపించింది. 'రాగాన్ని-రమణిని పోలుస్తూ ఓపాట రాస్తాను' అని అన్నాను. రమేష్‌నాయుడు కొత్తదనం కోసం శివరంజని రాగాన్ని సూచించారు. అంతకు ముందు ఒకటీ అరా తప్ప విషాదానికి వుపయోగించే ఈ 'శివరంజని' రాగాన్ని శృంగార భావ వ్యక్తీకరణకు ఎక్కువగా వాడలేదు.

ఆ రోజు అలా పుట్టిన ఆ 'శివరంజనీ నవరాగిణి' పాట తర్వాత ఎన్నిటికో ఒరవడులను దిద్దింది. ఆ రాగం పేరుతో దాసరి నారాయణరావు ఒక సినిమానే తీశారు. బాలూ హిట్స్‌లో అదొక మాస్టర్ పీస్‌గా నిలిచి పోయింది. ఆనాడు మేంగాని ఆ తమిళగీతాన్నే డబ్ చేసి వుంటే...." అని అర్థోక్తిలో ఆగిపోయారు సి.నా.రె. ఆయన ఆగిపోయినా "ఏమై ఉండేది?" అని రిథమిక్‌గా ప్రశ్నించాయి ఆయన కళ్ళు.

ఎవరో అన్నారు సి.నా.రె. గురించి "ఆయన కళ్ళలో లయ" అని. లయ అనగానే సి.నా.రె. రాసిన పాటల్లో గుర్తొచ్చేది. "చరణ కింకిణులు ఘల్లు ఘల్లుమన" అనే "చెల్లెలి కాపురం" చిత్రంలోని పాట.

"ఈ పాట వెనుక కూడా మంచి చరిత్రే ఉంది. విశ్వనాథ్‌గారు సీను వివరించినప్పుడు నాలోని కవి నాచేత రాయించిన పాట 'చరణ కింకిణులు'. విశ్వనాథ్‌గారు 'బావుంది' అని అన్నారు గాని బాలయ్య మాత్రం 'భాష సామాన్యుడికి అందుబాటులో లేదేమో' అన్న అనుమానాన్ని వ్యక్తం చేశారు. కావాలంటే మరోపాట రాస్తాను గానీ ఈ పాటలో ఒక్క అక్షరం కూడా మార్చవద్దు. ఉంచితే ఇది ఇలాగే ఉంచండి' అని అన్నాను. "సరే, ట్యూన్‌లో ఎలా వస్తుందో చూద్దాం" అని అన్నాడు బాలయ్య.

చరణ కింకిణులు అని వచ్చే చోట కాలి అందియలు అంటూ ఉంచి సంస్కృత పదాలు వచ్చే చోట పూర్తిగా తెలుగు పదాలే వుంచి రాయలేక కాదు. అది అలా వుంటేనే బావుండుననిపించింది. పైగా అది ఆశువుగా ఒక కవి గుండెల్ని చీల్చుకువచ్చిన పాట కూడా!

సరే... ట్యూన్ సిద్ధమయింది. ఇంకో గమ్మత్తు వుందిక్కడ. మహదేవన్ పాటలో చరణాలకి, పల్లవికి ట్యూన్ చేశాడు గాని చివర్నవచ్చే "ఫాలనేత్ర

సంప్రభవ జ్వాలలు ప్రసవశరుని దహియించగా'' దగ్గర్నుండి ట్యూన్ చేయలేదు. "ఆ వాక్యాలు మీరు ఒక కవిగా ఎలా అంటారో అలా అనండి'' అని అడిగాడు మహదేవన్. ఆనాడు నేను ఏ ఆవేశంతో ఆ వాక్యాలు పలికానో అవే పాటలోకి వచ్చాయి. నా బాణీలో నేను పలికిన ఆ వాక్యాల్ని యథాతథంగా టేపు చేసుకున్నారు. అవే బాలూ ప్రాక్టీస్ చేసి పాటలో ప్రవచించాడు. ఆ తర్వాత ఎన్నో పాటలలో సంస్కృత పదాలు చోటు చేసుకోవడం, అదే ఆవేశంలో పాటలు పాడడం జరిగిందికూడా! - అన్నారు సి.నారె!

"ఆవేశం" ప్రస్తావన రాగానే మా సంభాషణ మరో పాట మీదకి ఉరికింది. అది "అనుబంధం ఆత్మీయత అంతా ఒక బూటకం''.

"ఆ సీను చెప్పగానే మామూలు ప్రకారం తెలుగు సినిమా పద్ధతిలో ''వెళ్లిపోయావా అమ్మా'' టైపులో ఒక పాట రాసేసాను. పాట పూర్తయిపోయింది కూడా. పాటంతా అయిపోయాక రమేష్‌నాయుడు అన్నాడు. "నారాయణరెడ్డిగారి స్పెషాలిటీ కనిపించడం లేదు'' అని.

రమేష్‌నాయుడులో ఒక ప్రత్యేకత ఉంది. పాట పూర్తిగా తన దగ్గరికి వచ్చేవరకు ఏ కామెంటూ పాస్ చెయ్యడు. అంతేకాక చక్కటి జడ్జిమెంట్ నిర్మొహమాటంగా చెప్పగలడు కూడా. రమేష్‌నాయుడు అలా అనగానే నాకు కాస్త పౌరుషం వచ్చింది.

"మన తెలుగు సినిమాల సంప్రదాయం ప్రకారం రాశాను'' అని అన్నాను.

"సంప్రదాయం సంగతి అలా ఉంచండి. అదే పరిస్థితిలో మీరుంటే ఒక కవిగా మీరేం అనేవారు'' అని అన్నాడు రమేష్‌నాయుడు.

"ఒక కవిగా అంటాను కానీ తీసుకునే దమ్ములు మన సినిమా వాళ్ళకున్నాయా'' అని అడిగాను.

"ఆహా.... ఎందుకు తీసుకోరూ? ముందర ఓ కవిగా మీరేం అంటారో అని అనండి'' అని రెచ్చగొట్టాడాయన.

అప్పుడు సినీగీతం, నేపథ్యం అన్నీ మర్చిపోయి యస్వీరంగారావు వైపునుంచి ఆలోచించాను. ఆవేశంతో అశువుగా "అనుబంధం, ఆత్మీయత అంతా ఒక బూటకం, ఆత్మతృప్తి కొరకు మనుషులు ఆడుకునే నాటకం వింత నాటకం, చెత్తనాటకం''అని అన్నాను.

"అదే ఓ కాగితం మీద రాసివ్వండి'' అని అన్నాడు రమేష్‌నాయుడు.

"ఏవిటి ఇదా'' అన్నాను.

"అవును.... ఇదే.... బావుంది కానివ్వండి''

అంతే, గబగబా పాట మొదటి చరణం వరకు తయారయిపోయింది. ఇంతలో దాసరి నారాయణరావు వచ్చారు. విని "బావుంది. షాట్స్ రాసిస్తాను. మిగిలింది కానివ్వండి'' అని అన్నారు. ఆయన చకచకా షాట్స్ రాసిచ్చారు. అవతల భార్య తరఫు బంధువుల షష్టిపూర్తి, ఇవతల తల్లి చావు.... అటు బాండు మేళం ఇటు చావు మేళం.... అటు తారాజువ్వలు, ఇటు చితిమంటలు.. అలా మొత్తం షాట్స్ రాసిచ్చాడాయన. చూస్తుండగానే నిముషాల మీద పాట తయారయిపోయింది'' అంటూ ఆగారు సినారె.

"గులేబకావళికథ" చిత్రంలోని "నన్ను దోచుకుందువటే" పాట ద్వారా తెలుగు సినీ సాహిత్యంపై చెయ్యి చేసుకున్నారు సి.నారాయణరెడ్డి. "రుసస్పర్శతో" కాదు... "రసస్పర్శ"తో! తనచేత మొదటిసారి సినీ గీతాలు రాయించిన ఎన్.టి.రామారావు తనలోని కవితాత్మను ఎలా జ్వలింప చేశారో సోదాహరణంగా పేర్కొన్నారు సినారె.

"అప్పటికి 'బంధం' అన్నపదం అంతగా వాడబడలేదనుకుంటాను. అలాగే 'నా మనసు దోచుకోవటం' అంటూ వుండేదిగాని 'నన్ను దోచుకోవటం' అలాంటివి లేవనుకుంటాను. అలాగే సినీగీతాల్లో అంతవరకు ఎవరూ ఉపయోగించని దొరసాని, కర్పూర కళికలాంటి పదాల్ని ప్రయోగించినప్పుడు ఎంతగానో ప్రోత్సహించారు రామారావుగారు.

"రామారావుగారికి తమాషా అయిన ఆలోచనలు వస్తుంటాయి. 'దుర్యోధనుడికి డ్యూయెట్ పెడితే ఎలా ఉంటుంది'' అనే స్పార్క్ ఆయనదే. దాని ఫలితమే "దానవీర శూరకర్ణ''లో రాజస శృంగారాన్ని ప్రతిబింబించే



దాశరథి, సి.నారాయణరెడ్డి

అక్షరానికి లయ జ్ఞానాన్ని జోడించి నిరంతరం నర్తించే
నిర్విరామ సంగీతం - నారాయణరెడ్డి
సంప్రదాయాన్ని జీర్ణించుకున్న ప్రయోగం
ప్రయోగంలో జీవిస్తున్న సంప్రదాయం - నారాయణరెడ్డి
బద్ధకం ఆయన బద్ధ శత్రువు
అందుకే ఆయన నిలువెత్తు చైతన్యానికి సంకేతం
ఒక శతాబ్దికి సరిపడే శబ్దాబ్ధిని పుక్కిట పట్టిన వాడాయన
శబ్ద సౌందర్యాన్ని సున్నితంగా, సుతారంగా తప్ప
వేరొకలా స్పృశించలేడాయన
ఆయన సృజించే భావసాగరంలో ఓలలాడేవారికి
ఇహలోక భవసాగరాలు పిల్లకాలువల్లా కనిపిస్తాయి
వాక్కు విలువ తెలిసి మరీ వాడే వాగనుశాసనుడు
ఒక్కొక్కసారి కేవలం కనులతో మాత్రమే వాక్కుని
శాసించే 'వాగని శాసనుడు' - నారాయణరెడ్డి
ప్రతిరోజూ మార్నింగ్ వాక్‌తో మొదలయ్యే ఆయన వాక్చాతుర్యం
సాయంసభల వరకూ ఎంత సవ్వళించినా
కాగితంపై పవ్వళించే వరకు విశ్రమించదు
వశిష్ఠుడంతటి వాడందామా అంటే వయసొప్పుకోదు
ఎందరి హృదయాలలోనో ఇష్టుడై వసించే వసిష్ఠుడు
అని అనకుంటే మనసూరుకోదు
ఆయన 'రసహృదయ వసిష్ఠుడు' మాత్రమే కాక
కవితలోనూ జీవితంలోనూ ఎప్పుడూ
'సిస్టమాటిక్'గా వుండే విశిష్టుడు కూడా
అందుకే ఆయన్ని 'విసిష్టమాటిక్' కవి అని పిలుచుకుంటే
అది ఆత్మీయంగా వుంటుంది, తాదాత్మ్యంగా వుంటుంది.
పదాలమ్మపాలను, పదవులింట వెన్ననూ
ఎంతెంతగా ఆరగించినా
మనసుకు ఆ జిడ్డంటని వ్యక్తి, అభివ్యక్తి - నారాయణరెడ్డి

- హాసం

'చిత్రం హాయ్ భళారే చిత్రం' పాట.

"అంతేగాక, హిడింబి పాడితే ఎలా ఉంటుంది అనే ఆలోచన కూడా ఆయనదే. 'ఛాంగురే బంగారు రాజా' పాట. ఆ పాట రాసేటప్పుడు కూడా అంతగా ఎవరూ ఉపయోగించని తెలుగు పదాలు వాడితే ఎలా ఉంటుంది అని అనుకొని ఆ పాటలో అవి జొప్పించటం, మెప్పించటం జరిగింది. ఛాంగురే, మజ్జారే, అయ్యారే, మచ్చకంటి, పచ్చలపిడిబాకు (ఇది తెలంగాణా జానపదం) లెస్స, హైలెస్స ఇవి మచ్చుకి.

"ఇలా చెప్పుకుంటూ పోతే చాలా పాటలున్నాయి. 'మబ్బులో ఏముంది' పాట జముకుల సంప్రదాయానికి చెందినది: 'ముత్యాలముగ్గు' లోని 'గోగులు పూచే ఓ లచ్చ గుమ్మడి' పాట పల్లవికి ఆధారం - తెలంగాణా ప్రాంతంలో విశేష ప్రచారం ఉన్న జానపద గీతం. కొత్తగా పెళ్ళయిన ఓ పల్లెటూరి నాయిక, పట్నవాసపు చదువును అభ్యసించిన నాయకుడు ప్రొద్దుటి నుంచి రాత్రి వరకు ఎలా గడిపారో అనే బాపూ, రమణల ఊహలకు రాయబడిన పాట యిది. దానికి నా చిన్నప్పటినుంచీ వింటూ నా మెదడు పొరలలో దాచుకున్న తెలంగాణా ప్రాంతపు జానపద గీతాన్ని పాటకు ప్రారంభంగా వాడుకున్నాను. ఆ తరువాత "పొద్దుపొడిచే" అంటూ ఎత్తుకుంటుంది నాయిక" అంటున్న సి.నా.రె వాక్ప్రవాహానికి అడ్డువేసి "పుత్తడి వెలుగులు కొత్తగ మెరిసె" అనే వాక్యం "పల్లెటూరి నాయిక ఊహాపరిధికి ఎక్కువగా లేదా?" అని అడిగాను.

"అప్పుడు ఆ ఆలోచన రాకపోలేదు గానీ పుత్తడి బొమ్మ పూర్ణమ్మలాగ వుంటుంది. బాగానే ఉంది అని ఉంచెయ్యమన్నారు. అలా అంటున్న నాయికతో 'పొద్దు కాదది నీ ముద్దు మోమున' అంటూ నాయిక చెప్పే ప్రతిదాన్ని ఇంకోలా అభివర్ణిస్తాడు నాయకుడు. కవితా ప్రయోగపరంగా దాన్ని 'ప్రతీయోగ రీతి' (బై కాంట్రాస్ట్) అని అంటారు" అని అన్నారు సి.నా.రె.



లండన్‌లో ఎన్.టి.ఆర్.తో....

"ఆరుద్ర పాటల సంకలనంగా రూపొందిన "కొండగాలి తిరిగింది" అనే పుస్తకంలో 'ఊహలు గుసగుసలాడే' పాట వుంది. చాలా మంది ఊహల్లో అది మీ పాటగానే వుంది. దీని గురించి స్పష్టీకరిస్తే బావుంటుంది...

"నేనెప్పుడూ 'ఊగిసలాడే' అనే పదాన్ని ఇప్పటివరకూ వాడలేదు. అలా వాడవలసిన సందర్భం వస్తే "ఊగాడింది" అని వాడుతుంటాను. అది నా పద్ధతి" అని వివరించారు సినారె.

"మరి ఆకాశవాణి వారు కూడా ఆ పాటని మీ పాటగా చాలాసార్లు అనౌన్స్ చేశారే?"

"దాన్దేముంది? ఇప్పటికి ఎన్నిసార్లో నా పాటని దాశరథి పాటగా, దాశరథి పాటని నా పాటగా చెప్పుకుంటూ వుంటారు" అని నవ్వారాయన.

"కొన్ని కొన్ని పాటలు మీరు ఆత్రేయకు పోటీగా, లేదా ఆత్రేయరాసిన పాటలను దృష్టిలో పెట్టుకొని రాశారని అనుకునేవారు - నిజమేనా?"

"ఏమిటవి?"

"కలెక్టర్ జానకిలో "నీవన్నది నీవనుకున్నది" అనే పాటకి 'దసరాబుల్లోడు'లో 'నల్లవాడే అమ్మమ్మ అల్లరి పిల్లవాడే' పాటని, 'పవిత్ర హృదయాల'లోని 'మనసే మనిషికి తీయని వరము' అనే పాటకి ప్రేమ్‌నగర్‌లో 'మనసున గతి ఇంతే' అనే పాటని ఇన్‌స్పిరేషన్‌గా వాడుకున్నట్టు పరిశీలకుల అభిప్రాయం. మీరేమంటారు?"

సినారె ఒక్క క్షణం నిశితంగా చూశారు. ఒక వచ్చినిజం చెప్పబోతున్నారనే భావన ఆ క్షణం ఒక్కసారిగా తటాలుమని మెరిసింది.

"ఇక్కడో విషయం చెప్పాలి. "కలెక్టర్ జానకి" చిత్రానికి మాతృక అయిన "ఇరుకోడుగళ్" తమిళ చిత్రం "దసరాబుల్లోడు" కంటే ముందు విడుదలయింది. "నీవన్నది నీవనుకున్నది" టైపు పాట.... అంటే... ఇద్దరు ఆడవాళ్ళు తమ ప్రియుడికోసం వాద ప్రతివాదాలను కొనసాగించుకునే ధోరణి ఆ "ఇరుకోడుగళ్" చిత్రంలో ఉంది. ఆ పాట రాసింది కణ్ణదాసన్. ఇటువంటి కొత్తకొత్త పద్ధతులకెన్నిటికో నాందీవాచకం పలికినవాడు కణ్ణదాసన్.

మద్రాసులో ఉండే సినీకవుల అదృష్టం ఏమిటంటే కొత్తగా ఎవరేమి రాసినా అక్కడ కవులకు ముందు తెలుస్తుంది. ఆ తమిళ గీతాన్ని ఆత్రేయ విని వుండవచ్చు. ఆయన కణ్ణదాసన్‌ని కాపీ చేశారని నేననను గానీ ఆ పద్ధతి ఆయన గుండెల్లో నాటుకుని ఉంటుంది. 'దసరాబుల్లోడు' పాటల టైములో అది బయటికి వచ్చి ఉంటుంది. తర్వాత "కలెక్టర్ జానకి" వచ్చింది. ఆ చిత్రానికి తమిళ మాతృకను అనుసరించవలసి వచ్చింది. కనుక 'నీవన్నది నీవనుకున్నది' పాటకి కణ్ణదాసన్‌ని మూలంగా తీసుకున్నాను. ఆత్రేయను దృష్టిలో పెట్టుకొని రాశానని 'నీవన్నది నిజంగా నీవనుకున్నదే'. అది నిజంగా నిజం కాదు.

పోతే - 'మనసే మనిషికి తీయని వరమూ' పాట గురించి నువ్వన్నావు చూడు అది - చాలా వరకూ నిజం. మేం 'పవిత్ర హృదయాలు' సినిమాకి పాటలు రాయడానికి కూర్చున్నప్పుడు సంగీత దర్శకుడు టి.చలపతిరావు ఆత్రేయ రాసిన 'ప్రేమ్‌నగర్' పాటను ప్రస్తావించాడు.

అప్పటికే 'మనసుగతి ఇంతే' పాట పెద్ద హిట్. దానికి టి.చలపతిరావు 'ఇదేమిటండీ, ఆత్రేయ ఈ పాటలో పలాయన వాదాన్ని, నిరాశావాదాన్ని సమర్థిస్తున్నారు? అదేమంత మెచ్చుకోదగ్గ విషయం కాదండీ' అన్నాడు. చలపతిరావు అభ్యుదయవాది. నేనూ ఆశావాదినే. "అవును. మనసు మనిషికి శిక్ష అని ఎందుకనుకోవాలి. వరంకావచ్చు కదా. పక్షులకుంటాయా పరీక్షలు? రాళ్ళకు పడతాయా శిక్షలు? మనిషన్న వాడికే శిక్షలు. పరీక్షలు, అందుకే మనిషికి నిండుమనసు కావాలి" అని అన్నాను. అదేపాట రూపంలోకి ఉరికింది. ఆ పాటే - "మనసే మనిషికి తీయనివరము'.

వరం అనగానే చటుక్కున స్ఫురించేది సుస్మిత, నిశిత, సునిశిత, శృంగారానికి సినారె పెట్టింది పేరుగా, పట్టింది పాటగా ముద్ర పడ్డారని. నిజంగా అది ఆయనకు వరం. కొన్నికొన్ని పాటలను ఎంత త్వరగా ఆయన రాసేవారంటే నిర్మాతలు - "అరెరే సినారె.... అప్పుడే పాటను రాసేసినారే?" అని ఆశ్చర్యపోయేవారు. కానీ 'వరకట్నం'లోని 'మరదలా మరదలా' పాటలో 'పల్లెటూరి చిన్నోడు'లోని "నీళ్ళేమంటున్నాయి ఓ వదినా" పాటలో, "భక్తతుకారం"లోని "పూజకు వేళాయెరా" పాటలో శృంగారాన్ని కాస్త శృతి ఎక్కువగా పెంచి ఉపయోగించారనిపించి వాటికి కారణాలని అడగటం జరిగింది.

"నిజమే... తెలంగాణా ప్రాంతంలో వదినా మరదళ్ళ సరసాలు, ఛలోక్తులు కాస్త ఎక్కువ మోతాదులోనే ఉంటాయి. పైగా నీవన్న ఆ మొదటి రెండు పాటలు వదినా మరదళ్ళు పాడుకుంటూ ప్రియుడి గురించి ప్రస్తావించుకునేవే. అందుచేత ఆ రెండు పాటలలోనూ కాస్త శృంగారం ఎక్కువగానే పడింది. పోతే 'తుకారం' లోని 'పూజకు వేళాయెరా' పాటలోని

శృంగారం నేను అలంకార శాస్త్రాన్ని అనుసరించి వాడినది. జఘన మండలాన్ని పృథ్వీ మండలంతో పోల్చటం లాంటివన్నీ అలంకార శాస్త్రజ్ఞులు చెప్పినవే. కాకపోతే అంతటి సాంద్రశృంగారం అక్కడ పలికితేగాని వెంటనే అది ప్రబల వైరాగ్యానికి దారితీయదు. తర్వాత వచ్చే 'తోలుతిత్తులై పోవునులే', వాడివత్తులై పోవునులే' లాంటి వైరాగ్య సూచ్యానికి మొదట అంతటి శృంగార వాచ్యం తప్పలేదు. సంగీత దర్శకుడు ఆదినారాయణరావు కూడా ఈ శాస్త్రాలన్నీ క్షుణంగా చదివినవాడు కూడా!" అని ఓ లిప్తపాటు ఆగి "శృంగారం ప్రస్తావన వచ్చింది కాబట్టి ఇక్కడో విషయం చెప్పాలి" అన్నారు నారాయణరెడ్డి.

"పూర్వం పాటల్లో శృంగార సూచకం రహస్యంగా పొంచిఉన్నా సరే తొలగించమనే వారు సెన్సారు వారు. "రాముడు - భీముడు" చిత్రంలో "హోయ్ తళుకు తళుకుమని" అనే పాటలో "రమ్మనకు పగలే ననురా రమ్మనకు" అని రాశాను. పాట అలాగే రికార్డయి పోయింది కూడా. కానీ సెన్సారు అధికారులు ఒప్పుకోలేదు. "పగలే నను రా రమ్మనకు అంటే రాత్రి రమ్మనా? తొలగించండి" అని అన్నారు. వారి అభీష్టానుసారమే 'రమ్మనకు ఇప్పుడే నను రా రమ్మనకు' అని మార్చి తిరిగి రికార్డు చేసి జోడించడం జరిగింది. ఆ సినిమా ఎప్పుడైనా వస్తే మళ్ళీ చూడండి - అక్కడ "లిప్‌సింక్" కాదు. రికార్డులలో మాత్రం "పగలే ననురా రమ్మనకు" అనే ఉంది." అని వెల్లడించారు సినారె.

"ఇప్పుడీ పాటకీ చివరి క్షణంలో ఎలా అయితే మరొక పదం వేసి నడిపించారో అలా ట్యూన్ అంతా అయిపోయాక దానికి సాహిత్యం సమకూర్చాక, చివర్న మీకు రాయాలనిపించి ఓ వాక్యమో, ఓ పదమో చేర్చితే దానిని తిరిగి ట్యూన్ చెయ్యటం జరిగిందా?"

"ఓ... ఎందుకు జరగలేదూ....? అలా ఉదహరించాలంటే 'శారద' చిత్రంలోని 'శారదా ననుచేరగా' పాటని చెప్పుకోవాలి" అని తిరిగి కొనసాగించారు నారాయణరెడ్డి.

"శారద చిత్రంలో "శారదా నను చేరగా" పాటకి చక్రవర్తి "లాలల, లల, లాలలా" అంటూ ట్యూన్ ఇచ్చాడు. సరే, హీరోయిన్ శారద అని, సినిమాలో పాత్రపేరు కూడా శారదే అని తెలుసు. "శారదా నను చేరగా" అని రాశాను. పల్లవి, చరణాలు అన్నీ పూర్తయి పోయాయి. కానీ పల్లవిలో చక్రవర్తి ఇచ్చిన ట్యూన్ "ఏమిటమ్మా సిగ్గా ఎరుపెక్కే లేత బుగ్గా" అనే వాక్యం వరకే సరిపోతుంది. తర్వాత వెంటనే పల్లవిని పాడుకునేటట్టుగా మలచాడు చక్రవర్తి. రాస్తూ ఉండగా పల్లవిని మరికాస్త పొడిగిస్తే బావుండుననిపించింది. "మరో వాక్యం రాయనా" అని అడిగాను "తప్పకుండా.... రాయండి రాయండి" అంటూ ప్రోత్సహించారు చటర్జీ, చక్రవర్తీ. వెంటనే "ఓ శ్రావణ నీరద శారదా" అన్నాను. ఎందుకంటే ఆ చిత్రంలో శారద కరుణరసపూరితమైన పాత్రకు రూపకల్పన. శ్రావణ నీరదము అంటే కరిగిపోయే స్వభావానికి ప్రతీక. అలా కలిసొచ్చేట్టు "శ్రావణ నీరద శారదా" అని అన్నాను. "బావుంది. ఏదీ. చక్రవర్తీ, అది ట్యూన్‌లో అను" అని అన్నారు చటర్జీ. వెంటనే దాన్ని తన ట్యూన్‌లో అన్నాడు చక్రవర్తి. అదే అలా వుండిపోయింది అక్కడ. చక్రవర్తి ట్యూన్ ఎంత బలంగా చొచ్చుకుపోయిందో చెప్పడానికి ఇంకో చిన్న ఉదాహరణ.

ఓసారి నేను కరీంనగర్ వెళ్తున్నాను. దారిలో ఓ కుర్రాడు ఈ పాటని ఆలపించుకుంటూ నడుస్తున్నాడు. పాట ఎలా పాడతాడో చూద్దాం అని అతన్ని గమనించసాగాను. ఈ 'శారదా' పాటని పాడుతూ 'శ్రావణ నీరద శారదా' దగ్గర కొచ్చేసరికి అతను "ఓ శ్రావణ రీరద శారదా" అని అన్నాడు. అప్పుడనిపించింది సాహిత్యం కన్నా సంగీతం ఎంత బలమైనదో".

"ఇప్పటివరకూ మీరు చాలా పాటల గురించి చెప్పారు గాని "ఇక్కడేం రాయాలి? ఎలా రాయాలి?" అని మిమ్మల్ని సందిగ్ధావస్థలో పడేసిన పాట గురించి చెప్పనేలేదు. అటువంటివేమీ లేవా?"

"సీతా కళ్యాణం లోని "గంగావతరణం" నన్ను ఓ క్షణం అటువంటి



అక్కినేని, సినారె, నేరెళ్ళ వేణుమాధవ్, జగ్గయ్య...

అవస్థకు గురిచేసిన పాట కిందే లెక్క" అని అన్నారు సినారె.

"సాధారణంగా కొన్ని పాటలకు ఒక 'ఫ్లో' కావాలి. అటువంటి 'ఫ్లో' ఉన్న పాటల్ని నేను అశువుగా చెప్పగలనే గాని చెప్తూ రాయలేను" అంటూ కొనసాగించారు డాక్టర్ సి.నారాయణరెడ్డి.

"నా అదృష్టం ఏమిటంటే అలా 'ఫ్లో'తో రాసిన పాటలకు కొందరు ప్రతిభావంతులు 'వ్రాయసగాళ్ళు'గా వ్యవహరించడం జరిగింది. కొన్ని పాటలకు కోడి రామకృష్ణ, రేలంగి నరసింహారావు. ఎమ్వీయల్ ఇలా నేను చెప్తుంటే వాళ్ళు రాసుకోవడం జరిగింది.

ఈ "సీతా కళ్యాణం"లోని "గంగావతరణం" పాటకి 'ఫ్లో' కావల్సి వచ్చింది. బాపూ, రమణలది సాధారణంగా బడ్జెట్ పిక్చర్ కదా - ఈ పాటని నాకు రాయడానికి పక్కన ఎవరూ లేరు. 'మీరు చెప్పండి - నేను రాస్తాను' అన్నాడు ముళ్ళపూడి వెంకటరమణ. అలా ఆ పాట మొదలయింది.

బాపు చెప్పిన షాట్సుకి అనుగుణంగా ఆ పాటని రాయడం జరిగింది. "ఇప్పుడు ఉద్రేకంగా చెలరేగిన గంగని శివుడు తన జటాజూటంలో బంధిస్తాడు. అందునుంచి బైటకి ఉరకలేక అటు ఇటూ చూస్తూ ఉన్న గంగని భగీరథుడు విడిపిస్తాడు" అని షాట్స్‌ని చెప్పడం జరిగింది. ఈ కథ తెలిసినదే అయినా జటాజూటంలో గంగని బంధించడం, గంగ బైటికి రావాలని ప్రయత్నించడం బాపు ఎలా తీస్తాడు. దీనికి ఎలా రాయాలి అనే మీమాంసలో పడ్డాను కొంతసేపు.

అప్పుడు బాపు అనుకున్న షాట్స్‌ని బొమ్మలుగా వేసి ఇచ్చాడు. అదేవిధంగా చిత్రీకరించడం జరిగింది కూడా. ఆ బొమ్మల్ని చూడగానే, ఆ రకంగా నవ్యత్వం కనబడగానే నాలోని కవితాగంగ ఒక్కసారి ఇలా పెల్లుబికింది. ఆ రస గంగధారను "అయిగిరి నందిని నందిత మోహిని" ట్యూన్‌లో అనుకుంటూ ఇలా రాశాను.

**"జడ అను అడవిని వడివడి అడుగిడి**
**జాడ ఎరుంగనిదై**
**తడబడి నడచుచు వడివడి వడకుచు**
**నుడివడి పోయినదై**
**ఒక పరి యిటు చని ఒక పరి అటు చని**
**మొకమే చెల్లనిదై"**

అలాగే 'భక్తకన్నప్ప' చిత్రంలో 'కండ గెలిచింది' పాటలో కూడా జరిగింది. పాట మధ్యలో డ్రమ్స్‌ని అనుకొని చూస్తూ ఉన్నట్టు బొమ్మ వేసి ఇచ్చాడు బాపూ. దాన్ని చూడగానే పుట్టిందే - "ఎంత చక్కని మేను ఎంతో చల్లని చూపు అనే చరణం" అని ముగించారు నవ్య కవిత నయాగరా నారాయణరెడ్డి.

-రాజా

## ఏకవీర

సంగీతం: కె.వి.మహదేవన్ గానం: ఘంటసాల, సుశీల

ప: ఆ: తోటలో నారాజు
తొంగిచూసెను నాడు
నీటిలో ఆ రాజు
నీడ నవ్వెను నేడు
చరణం: నవ్వులా అవి కావు నవపారిజాతాలు
రవ్వంత సడిలేని రసరమ్యగీతాలు
ఆరాజు ఈరోజు అరుదెంచునా
అపరంజి కలలన్ని చివురించునా ॥తోటలో॥
చరణం:
అ: చాటుగా పొదరింటి మాటుగా వున్నాను
పాటలాధర రాగభావనలు కన్నాను
ఎలనాగ నయనాల కమలాలలో దాగి ॥ఎల॥
ఎదలోన కదలే తుమ్మెదపాట విన్నాను
ఆపాట నాలో తీయగ మ్రోగనీ
అనురాగ మధుధారయై సాగనీ ॥తోటలో॥

## గులేబకావళికథ

సంగీతం: జోసఫ్ - కృష్ణమూర్తి గానం: ఘంటసాల, సుశీల

అ: నన్ను దోచుకొందువటే వన్నెల దొరసానీ
ఆ: కన్నులలో దాచుకొందు నిన్నే నాస్వామీ నిన్నే నాస్వామీ
ఆ: తరియింతును నీ చల్లని చరణమ్ముల నీడలోన
పూలదండవోలె-కర్పూరకళిక వోలె కర్పూరకళిక వోలె
అ: ఎంతటి నెరజాణవో నా అంతరంగమందు నీవు॥ఎంతటి॥
కలకాలము వీడని సంకెలలు వేసినావు
సంకెలలు వేసినావు ॥నన్ను॥
ఆ: నా మదియే మందిరమై నీవే ఒక దేవతవై
వెలసినావు నాలో నే-కలసిపోదు నీలో కలిసిపోదు నీలో
అ: ఏనాటిదో మనబంధం ఎరుగరాని అనుబంధం
ఎన్నియుగాలైనా యిది యిగిరిపోని గంధం
ఇగిరిపోని గంధం ॥నన్ను॥

## చదువుకున్న అమ్మాయిలు

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల, సుశీల

ప: అ: కిలకిల నవ్వులు చిలికిన పలికెను నాలో బంగారువీణ
ఆ: కరిగిన కలలే నిలిచిన విరిసెను నాలో మందారమాల
చ:అ: రమ్మని మురళీరవమ్ములు పిలిచె
అణువణువున బృందావని తోచె
ఆ: తళతళలాడే తరగలపైన
అందీ అందని అందాలు మెరిసె ॥కిల॥
చ:ఆ: నీవున్న వేరే సింగారములేల?
నీపాద ధూళి సిందూరము కాదా!
అ: మమతలు దూసీ మాలలు చేసీ
గళమున నిలిపిన కళ్యాణి నీవే ॥కిల॥
చ:అ: నీ కురులే నన్ను సోకినవేళ
హాయిగ రగిలేను తీయనిజ్వాల
ఆ: జలజలపారే వలపుల లోన
సాగెను జీవనరాగాల నావ ॥కిల॥

## దొరికితే దొంగలు

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల, సుశీల

అ: ఎవరన్నారివి కన్నులని-అరెరే మధువొలికే గిన్నెలివి
ఆ: ఎవరన్నారివి బుగ్గలని హోయ్ ఎఱ్ఱని రోజా మొగ్గలవి
అ: నడుమిది యేమంటున్నది నా నడుమిది యేమంటున్నది?
అ: నా పిడికిట ఇమిడెదనన్నది
ఆ: నల్లనిజడ యేమన్నది? - నా నల్లని జడ యేమన్నది?
అ: అది నను బంధించెదనన్నది
నను బంధించెదనన్నది ॥ఎవరన్నారివి॥
అ: సిగ్గులు దోసిట దూయకు నా సిగ్గులు దోసిట దూయకూ
నీ చేతుల బందీ చేయకు
అ: మెల్లగ లోలో నవ్వకు మెలమెల్లగ లోలో నవ్వకు
చలచల్లగ పిడుగులు రువ్వకు
చల్లగ పిడుగులు రువ్వకు ॥ఎవరన్నారివి॥
ఆ: అడుగున అడుగిడుటెందుకు?
నా అడుగున అడుగిడుటెందుకు?
అ: నువు తడబడిపోతున్నందుకు!
ఆ: మరిమరి చూచెదవెందుకు?
నను మరిమరి చూచెదవెందుకు?
అ: నువు మైకములో వున్నందుకు
మైకములో వున్నందుకు ॥ఎవరన్నారివి॥

## కులగోత్రాలు

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల, సుశీల

అ: చెలికాడు నిన్నే రమ్మని పిలువ-చేరరావేలా
ఇంకా సిగ్గునీకేలా
ఆ: ప్రియురాలి మదిలో ఏముందో తెలుసుకోలేవా
నన్నే తెలుపమంటావా
అ: నీ నవ్వులో ఏ పువ్వులో - పన్నీరు చిలికాయీ
ఆ: కిరణాలలోనేగా సరోజం కిలకిల నవ్వేదీ ॥చెలి॥
అ: నీ అందమే శ్రీగంధమై-నా డెందమలరించే
ఆ: నీ రూపె దీపమ్మై ప్రియా-నాచూపుల వెలిగించే ॥చెలి॥
అ: నీ తోడుగా నడయాడగా-ఇంకేమీ కావాలి?
ఆ: మధురానురాగాలే ఫలించే తరుణం రావాలి ॥చెలి॥

## బొబ్బిలియుద్ధం

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: పి.భానుమతి

ఊయలలూగినదోయి మనసే
తీయని ఊహల తీవెలపైన
వెన్నెల పూవులు విరిసేవేళ
సన్నని గాలులు సాగేవేళ
వలపులు ఏవో పలికెను నాలో
తెలుపగరానిది ఈ హాయి ॥ఊయల॥
కమ్మని రాతిరి రమ్మని పిలిచె
మల్లెల పానుపు మనకై నిలిచె
ప్రాయము నీవై పరువము నేనై
పరిమళించగా రావోయి ॥ఊయల॥

## వివాహబంధం

సంగీతం: ఎం.బి.శ్రీనివాస్ గానం:పి.భానుమతి

ప: విన్నావా విన్నావా
మనసులోన దాగియున్న మధురగీతి విన్నావా ॥విన్నావా॥
చ: తొలిచూపులు నా మదిలో తలుపు తీసెనే
పెదవులపై చిరునవ్వులు నిదురలేచెనే ॥విన్నావా॥
చ: తలపులన్ని వేణువులై పిలువసాగెనే
హృదయమె యమునానదియై కదలసాగెనే ॥విన్నావా॥
చ: అందరాని చందమామ ముందు నిలిచెనే
అణువణువున వెన్నెలలే అరవాసెనే ॥విన్నావా॥
చ: వలపులు విరజాజులుగా పరిమళించెనే
జగమే బృందావనియై సొగసులొలికెనే ॥విన్నావా॥

## పూజాఫలము

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల

ప: నిన్నలేని అందమేదో-నిదురలేచెనెందుకో
నిదురలేచెనెందుకో
తెలియరాని రాగమేదో-తీగసాగె నెందుకో
తీగసాగె నెందుకో ... నాలో ॥నిన్న॥
చ: పూచిన ప్రతి తరుపొక వధువు
పువుపువ్వున పొంగెను మధువు
ఇన్నాళ్లీ శోభలన్నీ
ఎచట దాగెనో ॥నిన్నలేని॥
చ: తెలినురుగులె నవ్వులు కాగా
సెలయేరులు కులుకుచురాగా
కనిపించని వీణలేవో
కదలి మ్రోగెనే ॥నిన్నలేని॥
చ: పసిడియంచు పైటజార
పయనించే మేఘబాల
అరుణకాంతి సోకగానే
పరవశించెనే ॥నిన్నలేని॥

## అమరశిల్పి జక్కన్న

సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల

ప: ఈ నల్లని రాలలో
ఏ కన్నులు దాగెనో
ఈ బండల మాటున
ఏ గుండెలు మ్రోగెనో
చ: పాపాలకు తాపాలకు
బహుదూరములో నున్నవి
మునులవోలె కారడవుల
మూలలందు పడియున్నవి ॥ఈ నల్లని॥
చ: కదలలేవు మెదలలేవు
పెదవివిప్పి పలుకలేవు
ఉలియలికిడి విన్నంతనే
జలజలమని పొంగిపొరలు ॥ఈ నల్లని॥
చ: పైన కఠినమనిపించును
లోన వెన్న కనిపించును
జీవమున్న మనిషికన్న
శిలలే నయమనిపించును ॥ఈ నల్లని॥

## మంచిరోజులొచ్చాయి

సంగీతం: టి.చలపతిరావు గానం: పి.సుశీల

ప: ఎగిరే గువ్వ ఏమంది?
విసిరే గాలి ఏమంది?
ప్రకృతిలోన స్వేచ్ఛకన్న
మిన్న లేనే లేదంది
చ: పూలకెందుకు కలిగెనే
ఈ ఘుమఘుమలు - ఈ మధురిమలు
తీగలెన్నడు నేర్చెనే
ఈ అల్లికలు - ఈ అమరికలు
స్వేచ్ఛకోరే మనసువుంటే
పొందలేనిది యేముంది! ॥ఎగిరే॥
చ: కోకిలెన్నడు నేర్చెనే
ఈ సరిగమలు - సరాగములు
నెమలికెవ్వరు నేర్పిరే
ఈ లయగతులు - ఈ స్వరజతులు
స్వేచ్ఛకోరే మనసువుంటే
నేర్వలేనిది యేముంది ॥ఎగిరే॥
చ: శిరసువంచక నిలువనా
గుడిగోపురమై - గిరిశిఖరమునై
అవధులన్నీ దాటనా
ప్రభంజనమై - జలపాతమునై
స్వేచ్ఛకోరే మనసు నాది
ఇంక నాకెదురేముంది ॥ఎగిరే॥

## కంచుకోట

సంగీతం: కె.వి.మహదేవన్ గానం:పి.సుశీల, యస్.జానకి

ప: సరిలేరు నీకెవ్వరు - నరపాల సుధాకర!
సరిలేరు నీకెవ్వరు
సురవైభవాన -
భాసురకీర్తిలోన
సరిలేరు నీకెవ్వరు - రతిరాజసుందరా!
సరిలేరు నీకెవ్వరు
సిరిలోన గానీ -
మగసిరిలోన గానీ ॥సరిలేరు॥
చ: ప్రజలను నీ కంటిపాపలుగా కాచి
పరరాజులదరంగ-కరవాలమును దూసి
శాంతిని వెలయించి-మంచిని వెలిగించి
జగతిని లాలించి-పాలించినావు ॥సరి॥
చ: మరుడే తొందరచేయ-విరిబోణులను గూడి
మధువే పొంగులు వార - మనసార తూగాడి
నవ్వులు చిలికించి - మువ్వలు పలికించి
యవ్వనవీణలు - కవ్వించినావు ॥సరి॥
చ: రాజభోజ! రవితేజ! దానజితకల్పభూజ! జోహార్!
నీటుగుల్కు సుమకోటి తేనెలానేటి తేటి! జోహార్!
అసమప్రభావ! జోహార్
రసికావతంస! జోహార్
జోహార్! జోహార్! ॥సరి॥

## మానవుడు - దానవుడు

సంగీతం: అశ్వత్థామ గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, బృందం

ప: అణువూ అణువున వెలసినదేవా!
కనువెలుగై మము నడిపించరావా!
చ: మనిషిని మనిషే కరిచేవేళ
ద్వేషం విషమై కురిసేవేళ
నిప్పులు మింగి-నిజమును తెలిపి
చల్లని మమతల సుధలను చిలికి
అమరజీవులై వెలిగినమూర్తుల
అమృతగుణం మాకందించరావా ॥అణువు॥
చ: జాతికిగ్రహణం పట్టినవేళ
మాతృభూమి మొరపెట్టిన వేళ
స్వరాజ్యసమరం సాగించీ
స్వాతంత్ర్య ఫలమును సాధించీ
ధన్యచరితులై వెలిగిన మూర్తుల
త్యాగనిరతి మాకందించరావా ॥అణువు॥
చ: వ్యాధులు బాధలు ముసిరేవేళ
మృత్యువు కోరలు సాచేవేళ
గుండెకు బదులుగ గుండెను పొదిగి
కొనవూపిరులకు వూపిరులూది
జీవనదాతలై వెలిగిన మూర్తుల
సేవాగుణం మా కందించరావా ॥అణువు॥

## విచిత్ర దాంపత్యం

సంగీతం: అశ్వత్థామ గానం: పి.సుశీల

ప: శ్రీ గౌరి శ్రీగౌరియే - శివుని
శిరమందు ఏ గంగ - చిందులు వేసినా ॥శ్రీగౌరి॥
చ: సతిగా తన మేను చాలించి -
పార్వతిగా మరుజన్మ ధరియించి
పరమేశునకై తపియించి ఆ
ఆ హరుమేన సగమౌ పరవశించిన ॥శ్రీగౌరి॥
చ: నగకన్యగా తాను జనియించినా
జగదంబయైనది హైమవతి
సురలోకమున తాను ప్రభవించినా
తరళాత్మయైనది మందాకిని
చ: ఒదిగి ఒదిగి పతి
పదములందు నివసించుచుయుండు గౌరి
ఎదిగి ఎదిగి పతి
సిగనుదూకి నటియించుచుండు గంగ
లలితరాగకలితాంతర గౌరి!
చలిత జీవన తరంగ రంగ గంగ
ధవళాంశుకీర్తి గౌరి
నవఫేనమూర్తి గంగ
కల్పాంతమైన
భువనాంతమైన
క్షతియెరుగని
మృతి ఎరుగని నిజమిది ॥శ్రీగౌరి॥

## తూర్పుపడమర

సంగీతం: రమేష్‌నాయుడు గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: శివరంజనీ!
నవరాగిణీ!
వినినంతనే - నా
తనువులోని
అణువణువు కరిగించే
అమృతవాహినీ
చ: రాగాల సిగలోన సిరిమల్లివి
సంగీత గగనాన జాబిల్లివి
స్వరసురఝురీతరంగానివి
సరస హృదయవీణావాణివి ॥శివరంజనీ॥
చ: ఆ కనులు పండువెన్నెల గనులు
ఆ కురులు ఇంద్రనీలాలవనులు
ఆ వదనం అరుణోదయకమలం
ఆ అధరం సుమధురమధుకలశం ॥శివరంజనీ॥
చ: జనకుని కొలువున అల్లనసాగే
జగన్మోహినీ జానకీ!
వేణుధరుని రథమారోహించిన
విదుషీమణి రుక్మిణీ!
రాశీకృత నవరసమయ జీవన
రాగచంద్రికా!
లలిత లావణ్య భయద సౌందర్య కలితచండికా!
రావే... రావే నా శివరంజనీ!
మనోరంజనీ!
రంజనీ! నా రంజనీ!
నీవే నీవే నాలో పలికే నాదానివి
నీవే నా దానివి
నా దానివి నీవే నా దానివి

## తూర్పు పడమర

సంగీతం: రమేష్‌నాయుడు గానం:పి.సుశీల

ప: స్వరములు ఏడైనా రాగాలెన్నో
హృదయం ఒకటైనా భావాలెన్నో
అడుగులు రెండైనా నాట్యాలెన్నో
అక్షరాలు కొన్నైనా కావ్యాలెన్నో
చ: జననంలోన కలదు వేదన
మరణంలోనూ కలదు వేదన - ఆ -
వేదనలోన ఉదయించే - నవ
వేదాలెన్నో నాదాలెన్నో ॥స్వరములు॥
చ: నేటికి రేపొక తీరని ప్రశ్న
రేపటికి మరునాడొక ప్రశ్న
కాలమనే గాలానికి చిక్కి
తేలని ప్రశ్నలు ఎన్నెన్నో - ఎన్నెన్నో ॥స్వరములు॥
చ: కనులున్నందుకు కలలు తప్పవు
కలలున్నపుడు పీడకలలు తప్పవు
కలల వెలుగులో కన్నీరొలికే
కలత నీడలు ఎన్నెన్నో - ఎన్నెన్నో ॥స్వరములు॥

## చెల్లెలికాపురం

సంగీతం: కె.వి.మహదేవన్ గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం

సా: చరణకింకిణులు ఘల్లుఘల్లుమన
కరకంకణములు గలగలలాడగ
వినీల కచ భర విలాస బంధుర
తనూలతిక చంచలించిపోగా
ప: ఆడవే మయూరీ! నటన మాడవే మయూరీ!
నీ కులుకును గని-నా పలుకు విరియు
నీ నటనను గని - నవ కవిత వెలయగా ॥ఆడవే॥
చ: అది యమునాసుందరతీరము
అది రమణీయబృందావనము
అది విరిసిన పున్నమి వెన్నెల
అది వీచిన తెమ్మెర ఊయల
అది చల్లని సైకత వేదిక
అట సాగెను విరహిణి రాధిక
అది రాధ మనసులో మాధవుడూదిన
రసమయ మురళీ గీతిక
ఆడవే మయూరీ! నటన మాడవే మయూరీ!
నా పలుకుల కెనయగు కులుకుచూపి
నా కవితకు సరియగు నటనచూసి -ఇక
ఆడవే మయూరీ! నటన మాడవే మయూరీ!
చ: ఫాలనేత్ర సంప్రభవత్ జ్వాలలు
ప్రసవశరుని దహియింపగా
పతినికోలుపడి రతీదేవి -
దుఃఖితమతియై రోదించగా
హిమగిరీంద్ర శిఖరాగ్ర తాండవత్
ప్రమథగణము కనిపించగా
ప్రమథనాదకర పంకజభాంకృత
డమరుధ్వని వినిపించగా
ప్రళయకాలసంకలిత భయంకర
జలధరార్భటుల - చలితదిక్తటుల
చకిత దిక్కరుల - వికృత ఘీంకృతుల
సహస్రఫణసంజనిత ఫూత్కృతుల
కనులలోన - కనుబొమలలోన
అధరమ్ములోన - వదనమ్ములోన
గళసీమలోన - కటిసీమలోన
కరయుగములోన - పదయుగములోన
నీ తనువులోని అణువణువులోన
అనంత విధముల అభినయించి - ఇక
ఆడవే-ఆడవే-ఆడవే

## నిర్దోషి

సంగీతం, గానం: ఘంటసాల

ప: మల్లియలారా! మాలికలారా!
మౌనముగా ఉన్నారా! మా కథయే విన్నారా!
చ: జాబిలిలోనే - జ్వాలలురేగె వెన్నెలలోనే - చీకటిమూగె
పలుకగలేక - పదములు రాక
బ్రతుకే తానే - బరువై సాగె ॥మల్లియ॥
చ: చెదరినవీణ - రవళించేనా
జీవనరాగం - చివురించేనా
కలతలుపోయి - వలపులు పొంగి
మనసే లోలో - పులకించేనా ॥మల్లియ॥

## ఆత్మబంధువు

సంగీతం: కె.వి.మహదేవన్ గానం: పి.సుశీల

ప: చదువురాని వాడవనీ దిగులుచెందకు - మనిషి
మదిలోన మమతలేని చదువులెందుకు ॥చదువురాని॥
మంచువంటి మల్లెవంటి... మంచిమనసుతో -
జీవించలేని పనికిరాని బ్రతుకులెందుకు ॥చదువురాని॥
చ: ఏమి చదివి పక్షులు - పైకెగుర గలిగెను
ఏ చదువు వల్ల చేపపిల్ల లీదగలిగెను
అడవిలోని నెమలికెవడు ఆట నేర్పెను - కొమ్మ
పైని కోకిలమ్మకెవడు పాటనేర్పెను ॥చదువురాని॥
చ: తెలివిలేని లేగదూడ పిలుచును అంబాయని
ఏ మెరుగని చంటిపాప ఏడ్చును అమ్మాయని
చదువులతో పనియేమి? హృదయమున్న చాలు
కాగితంపు పూలకన్న గరికపువ్వు మేలు- ॥చదువురాని॥

## కళ్యాణి

సంగీతం:రమేష్‌నాయుడు గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

ప: లలిత కళారాధనలో వెలిగే చిరుదివ్వెను నేను
మధుర భారతి పద సన్నిధిలో
ఒదిగే తొలి పువ్వును నేను ॥లలిత॥
చ: ఏ ఫలమాశించి మత్తకోకిల
ఎలుగెత్తి పాడును
ఏ వెల ఆశించి పూసేపువ్వు
తావి విరజిమ్మును
అవధిలేని ప్రతి అనుభూతికీ
ఆత్మానందమే పరమార్థం ॥లలిత॥
చ: ఏ సిరికోరి పోతన్న భాగవత సుధలు చిలికించెను
ఏ నిధి కోరి త్యాగయ్య రాగ జలనిధులు పొంగించెను
రమణీయ కళావిష్కృతికి
రసానందమే పరమార్థం ॥లలిత॥

## గోరంతదీపం

సంగీతం: కె.వి.మహదేవన్ గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల

గోరంతదీపం కొండంత వెలుగు
చిగురంత ఆశ జగమెంత వెలుగు
కరి మబ్బులు కమ్మేవేళ మెరుపు తీగె వెలుగు
కారు చీకటి ముసిరే వేళ వేగుచుక్క వెలుగు
మతి తప్పిన కానుల రొదల్లో మౌనమే వెలుగు
దహియించే బాధల మధ్యన సహనమే వెలుగు ॥గోరంత॥
కడలి నడుమ పడవ మునిగితే
కడదాకా ఈదాలి
నీళ్ళు లేని ఎడారిలో.... ॥నీళ్ళు॥
కన్నీళ్ళయిన తాగి బతకాలి
ఏ తోడూ లేని నాడు
నీ నీడే నీకు తోడు
జగమంతా దగా చేసినా
చిగురంతా ఆశను చూడు
చిగురంతా ఆశ జగమెంత వెలుగు ॥గోరంత॥

## స్వాతికిరణం

సంగీతం: కె.వి.మహదేవన్ గానం: వాణీజయరామ్

ప: శ్రుతి నీవు గతి నీవు
ఈ నా కృతి నీవు భారతీ
ధృతి నీవు ద్యుతి నీవు
శరణాగతి నీవు భారతీ ॥శ్రుతి॥
చ: నీ పదములొత్తిన పదము - ఈ పదము
నిత్యకైవల్య పథము
నీ కొలువు కోరిన తనువు - ఈ తనువు
నిగమార్థ నిధులున్న నెలవు
కోరినా మిగిలిన కోరికేమీ - నిను
కొనియాడుకృతుల పెన్నిధి తప్ప
చేరినా ఇక చేరువున్నదేమీ - నీ
శ్రీ చరణ దివ్య సన్నిధి తప్ప ॥శ్రుతి॥
చ: శ్రీనాథ కవినాథ శృంగార కవితా
తరంగాలు నీ స్ఫూర్తులే
అల అన్నమాచార్య కలవాణి అలరించు కీర్తనలు నీ కీర్తులే
త్యాగయ్య గళసీమ రాగిల్లిన ఆనంతరాగాలు నీ మూర్తులే
నీ కరుణ నెలకొన్న ప్రతి రచనం -
జననీ భవతారక మంత్రాక్షరం ॥శ్రుతి॥

## ప్రేమించు

సంగీతం: యం.యం.శ్రీలేఖ గానం: యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

ప: అ: కంటేనే అమ్మ అని అంటే ఎలా
కరుణించే ప్రతి దేవత అమ్మే కదా కన్నఅమ్మే కదా
ఆ: కంటేనే అమ్మ అని అంటే ఎలా
కడుపు తీపి లేని అమ్మ బొమ్మే కదా రాతి బొమ్మేకదా
చ1అ: కణకణలాడే ఎండకు శిరసుమాడినా
మనకు తల నీడను అందించే చెట్టే అమ్మ
చారెడు నీళ్లైన తాను దాచుకోక
జగతికి సర్వస్వం అర్పించే మబ్బే అమ్మ
ఆ అమ్మలనే మించిన మా అమ్మకు ॥అ॥
రుణం తీర్చుకోలేను ఏ జన్మకు
ఆ: ॥కంటేనే॥
చ2 ఎన్నో అంతస్థులుగా ఎదిగిపోయినా
నేడు ఉన్న అసలు ఉనికి ఆ పునాది పైనే
సిరుల జల్లులో నిత్యం పరవశించినా
మగువ జీవన సాఫల్యం మాతృత్వంలోనే
ప్రతి తల్లికి మమకారం పరమార్థం ॥ప్రతి॥
మదిలేని అహంకారం వ్యర్థం వ్యర్థం
అ: కరుణించే ప్రతిదేవత అమ్మే కదా
ఆ: కడుపుతీపి లేని అమ్మ బొమ్మేకదా రాతి బొమ్మే కదా

## సినారె కవితలు

### ఎన్నిసార్లు చెక్కితే

ఎన్నిసార్లు చెక్కితే ఓ శిల్పం
ఎన్నిసార్లు తీర్చితే ఓ చిత్రం
కబుర్లు చెప్పకే ఓ కాలమా
ఎన్నిసార్లు చస్తే ఓ జీవితం

### ఇదీ విషయం

ఉన్నాయి నాకు రెండు చేతులు
ఈ దేశంలో అందరికున్నట్టే.
ఒకటి బిచ్చమెత్తేది
ఒకటి పిడికిలెత్తేది

ఉన్నాయి నాకు రెండు చెవులు
ఈ సభలో అందరికున్నట్టే
ఒకటి పరవశించేది
ఒకటి ప్రతిఘటించేది

ఉన్నది నాకు ఒకే గమ్యం
ఈ మందలో ఒకరిద్దరికున్నట్టే
కంచెలను ఛేదించేది
కర్రపెత్తనాన్ని ఎదిరించేది

## సినారె 'ప్ర'పంచ పదులు

తనింగిలోతును చూడగోరితె నీటిచుక్కను కలుసుకో
రత్నతత్వం చూడగోరితె రాతిముక్కను కలుసుకో
అణువునడిగితె తెలియదా బ్రహ్మాండమంటే యేమిటో-
మౌనశిల్పం చూడగోరితె మంచుగడ్డలను కలుసుకో
మనిషి మూలం చూడగోరితె మట్టిబెడ్డను కలుసుకో

ఎన్నిమెట్లు ఎక్కావని కాదు ఎంత యెత్తుకెదిగావనీ
ఎన్ని మునకలేశావని కాదు ఎంత లోతు చూశావనీ
గమనం సార్థకమవుతుంది నీ గమ్యాన్ని చేరినప్పుడే-
ఎన్ని సభలు తిరిగావని కాదు ఎంత బుద్ధి పెంచావనీ
ఎన్ని కృతులు చదివానని కాదు ఎంత సిద్ధి పొందావనీ.

నీడలాగ నీవెంట పడేదే నిక్కమైన కీర్తి
మృత్యుబాహువుల కందలేనిదే నిత్యమైన కీర్తి
డప్పులు డబ్బులు కొనితెచ్చే ఆ మెప్పులకేం గానీ-
రొచ్చు ఊబిలో ఉబికొచ్చేదే స్వచ్ఛమైన కీర్తి
చిచ్చు అంచుపై నడిచొచ్చేదే మచ్చలేని కీర్తి

## సినారె ఛలోక్తులు

1990లో తూర్పుగోదావరి జిల్లా రామవరంలో నల్లమిల్లి మూలారెడ్డి కళాపరిషత్ వారు డాక్టర్ సి.నారాయణరెడ్డి గారికి సన్మానం ఏర్పాటు చేశారు. ఆనాటి సన్మాన సభకు జరిగిన బ్రహ్మాండమైన ఏర్పాట్లనూ, అసంఖ్యాక ప్రజానీకాన్ని చూసి ఒక వక్త తనయత్వంతో ఆ సభను మయసభతో పోల్చగా దానికి స్పందిస్తూ సినారె "ఈ 'మహాసభ'ను ఇంతకు ముందు ప్రసంగించిన మిత్రులు 'మయసభ'గా అభివర్ణించారు. కాని 'మయసభ' అంటే ఉన్నవి లేనట్లుగా లేనివి వున్నట్లుగా... అంతా గందరగోళం వ్యవహారం, పైగా అపోహలు, అవమానాలు... కాబట్టి ఈ సభను మయసభ అనవద్దు. 'వాఙ్మయ సభ' అందాం" అన్నారు. భావగర్భితమైన ఆయన చమత్కారానికి ఆనాటి సభ హాయిగా నవ్వుకుంది.

-డా॥ టి.వి.నారాయణరెడ్డి, గణపవరం

ఒకసారి సినారెని కలవడానికి ఒక విద్వాంసుడైన నియోగి ప్రముఖుడు, ఆయనతోపాటు ఓ వ్యాకరణవేత్తా వచ్చారు. ఇద్దరూ సినారెకు ఆత్మీయులు. ఇద్దరూ కాసేపు మాట్లాడి సెలవు తీసుకుని స్కూటరు మీద కూచున్నారు. అప్పుడు వాళ్లిద్దర్నీ ముచ్చటగా చూస్తూ "బాగుంది ఈ జంట. ముందు కరణం వెనక వ్యాకరణం" అని ఆప్యాయత చిలకరిస్తూ ఛలోక్తి విసిరారు.

-ఆచార్య ఎల్లూరి శివారెడ్డి, హైదరాబాద్


జులై 29
సి. నారాయణరెడ్డి
పుట్టిన రోజు
సందర్భంగా
సంగీత, సాహిత్య
ప్రియులందరి
తరపున
శుభాకాంక్షలతో...
హాసం

# Blueprinting the future from the past



The world around us is full of unseen biological wonders, many of them endowed by nature with miraculous cures for the ills of man.

But it takes a particularly discerning eye to see these hidden cures.

At Shantha, we take quiet pride in the fact that our scientists possess this type of penetrative vision. One example of their path-breaking research is Shanvac-B, India's first indigenous family vaccine against Hepatitis-B. Another is betacarotene, an antioxidant manufactured from algae found in the high seas. A third is Shanferon, an indigenous anti-cancer drug…

Working 24 hours a day, 365 days a year, Shantha's scientists are ceaselessly pushing back the frontiers of the unknown. To bequeath mankind with a healthier future - through the miracles of Biotechnology.

**SHANTHA BIOTECHNICS PVT. LTD.**

3rd Floor, Serene Chambers, Road No 7, Banjara Hills, Hyderabad, India.
Tel : +91-40-3548507, 3608843 Fax : +91-40-3548476 E-mail : info@shanthabiotech.com
www.shanthabiotech.com